





మహాసభల ప్రత్యేక సంచిక

# ఐక్య ఉపాధ్యాయ

చంద్రమౌళి నగర్, నెల్లూరు.



జూన్, 22-25 1989.

జూలై, ఆగష్టు
సంచిక 7,8
సంపుటి-15.

మహాప్రదర్శన దృశ్యము

రు: 5/-

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ అధికార పత్రిక

THE LARGEST CIRCULATED TELUGU EDUCATIONAL MONTHLY.

# ఐక్య ఉపాధ్యాయ పత్రికా క్యాంపెయిన్ల బహుమతి దృశ్యాలు











# MESSAGES



I am glad to note from your letter of 1-6-89 that you are holding the 5th Educational & Cultural Conference of your organisation. Education and Culture are today facing a number of serious problems whose solution can be found only by the joint efforts of all sections of our people. I hope that your Conference will pay attention to all these problems and this help the evolution of a common plan of action on the problems of education and culture in Andhra itself and the whole country.

With Greetings.

Yours sincerely

(EMS NAMBOODIRIPAD)
General Secretary
Communist Party of India (Marxist)
Central Committee

****

RAJ BHAVAN,
BANGALORE - 560 001

The Governor of Karnataka is glad to know that Andhra Pradesh United Teachers Federation is holding its Fifth Educational and Cultural Conference from 22nd to 25th June 1989 at Nellore.

The Governor sends his greetings to all the Participants in this Conference and wishes the Conference all success.

(C.M. GANAPATHI)
Deputy Secretary to Governor

****



I am glad to know that Andhra Pradesh United Teachers' Federation is celebrating the 5th Educational & Cultural Conference from 22nd to 25th June, 1989.

Teachers are the backbone of the society and on their shoulders rests the responsibility of shaping the future generation. It is my firm belief that the dedication and involvement of teachers will be of great significance in meeting the serious challenges that we might face in the future.

I send my best wishes to the Conference.

(L.P. SHAHI)
MINISTER OF STATE FOR EDUCATION & CULTURE



ఆంధ్రప్రదేశ్ యునైటెడ్ ఫెడరేషను పక్షాన విద్యా సాంస్కృతిక మహా సభలను జూన్ 22 నుంచి మూడు రోజుల పాటు జరుపనున్నట్లు తెలిసి సంతోషం కలిగింది.

సభలు విజయవంతం కావాలని ఆశిస్తూ, ప్రతినిధులకూ, ప్రసంగించడానికి వచ్చే పండితులకూ, నా హృదయపూర్వకమైన శుభాకాంక్షలు అందజేస్తున్నాను.

భవదీయుడు

**జి. నారాయణరావు**
స్పీకర్
ఆంధ్రప్రదేశ్, లెజిస్లేటివ్ అసెంబ్లీ

****



I am indeed happy to know that your Federation is organising Fifth Educational and Cultural Conference at Nellore during June, 1989.

I hope that deliberations in the Conference will help for better educational systems and improved teaching Methods. It may not be out of place to recall the sacred position occupied by a Teacher in the good old days and harmonious relationship which existed between the Teacher and the student. A stage has come for us to ponder how best we can redeem that culture for the betterment of society.

I wish your Conference all success.

Yours sincerely,

KARUPATI VIVEKANANDA
MINISTER FOR INFORMATION, CULTURAL AFFAIRS,

****

I am glad to know that United Teachers' Federation is holding its fifth Conference at Nellore. I understand, many eminent educationists are participating in the Conference.

Free and compulsory primary education is a Constitutional obligation. It is a matter of regret that we have not yet been able to fulfil this obligation and achieve Universalisation of Elementary Education. It is a matter of gratification that the State Government as well as the National Educational Policy lay great

emphasis on Universalisation. Concrete programmes are a foot to achieve Universalisation and to improve the content and process of education. The critical input for all these programmes is the teacher. Unless the teachers are adequately motivated and bring to bear on their work, missionary zeal the programmes would not achieve the goals expected. Apart from continuous updating of their skills and teaching methods through periodic refresher courses and other activities, it is also necessary that the teachers should rededicate themselves to the cause of Universalisation.

I hope that all the teachers attending your Conference will understand the magnitude of the problem and resolve to participate in this stupendous task of improving the standards of education at all levels in our State.

I wish the Conference success.

(R.V. VAIDYANATHA AYYAR)
Secretary to Government
Education Department
Andhra Pradesh

****

I am very happy to learn that the Andhra Pradesh United Teachers Federation is going to hold its Fifth Educational and Cultural Conference on the 22-25 June this year.

The aims and aspirations of the Federation is highly commendable.

I wish to extend my good wishes in your invaluable endeavours for the development of education and for the success of the Conference.

With best regards,

Yours sincerely,

Henryk Bilski
Second Secretary
EMBASSY OF THE POLISH PEOPLE'S
REPUBLIC IN NEW DELHI

****



ఉపాధ్యాయులు భారత స్వాతంత్ర్య పోరాటంలో గణనీయమైన పాత్ర నిర్వహించారు. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, అధికార [illegible]ానికి వ్యతిరేకంగా, ఫ్యూడలిజానికి [illegible]రేకంగా పోరాటాలు జరిపారు. దేశ స్వాతంత్ర్యం సాధించాం. సా[illegible]జ్యవాదం యిప్పటికీ తన ప్రయోజనాల కనుగుణమైన విద్యావిధానాన్ని, ఆర్థికంగా వెనుకబడిన దేశాలపై రుద్దుతూ వుంది. ఉపాధ్యాయుల పోరాటాలలో జాతీయ భావాల ప్రచారం, సామ్రాజ్యవాద వ్యతిరేకతను అంశంగా చేర్చవలసిన అవసరం ఈ నాడు బలీయంగా వుంది.

**దేవదాసు**
ప్రధాన కార్యదర్శి
కేరళ ప్రభుత్వ ఉపాధ్యాయుల సంఘం

****



'విద్యారంగం దేశ వ్యాప్తంగా యించుమించు ఒకే రకమైన సమస్యలను ఎదుర్కొంటున్నది నిరక్షరాస్యత దేశ వ్యాప్తంగా గల ఉపాధ్యాయుల వృత్తిపరమైన కోర్కెల సాధన కొరకు, నిరక్షరాస్య[illegible] నిర్మూలనకు, మూఢాచారాలలో మ్రగ్గుతున్న ప్రజ[illegible] [illegible]స్త్రీ[illegible] దృక్పథాన్ని, దేశభక్తిని పెంపొందించేందుకు, విద్యను జాతి పుర[illegible] కొరకు దోహదపడే సాధనంగా మలిచేందుకు వివిధ రాష్ట్రాల ఉపాధ్యాయ సంఘాల మధ్య సమన్వయం సాధించవలసిన అవసరం వున్నది. ఈ అంశాన్ని గూడా ప్రతినిధులు చర్చించ వలసిందిగా విజ్ఞప్తి.

**అరుణ్ చౌదరి, లమితవసేన్**
ప్రధాన కార్యదర్శి
ఆల్ బెంగాల్ టీచర్స్ అసోసియేషన్

****



'మా రాష్ట్రంలో విచ్ఛిన్నకారుల [illegible]లు, వారు సాగిస్తున్న దారుణ [illegible]త్యాకాండ మీకు తెలియనిది కాదు. సామాన్య [illegible]జానీకం నుండి హత్యాకాండ సాగిస్తున్నఉగ్ర [illegible]దులను వేరు [illegible]కు అక్కడ దేశభక్తి గల రాజకీయ పార్టీలు, ఉన్నతాశయాలు గల ప్రజలు సాగిస్తున్న కృషిలో ఉపాధ్యాయులుగా మావంతు కర్తవ్యాన్ని మేమూ నిర్వహిస్తున్నాం. వేర్పాటువాద ధోరణులు ఒక్క పంజాబ్‌కి మాత్రమే పరిమితం గాక అంటువ్యాధిలా యితర ప్రదేశాలకు వ్యాపిస్తున్నవి. కాబట్టి దేశవ్యాప్తంగా విద్యార్థులలో, ప్రజానీకంలో దేశభక్తి, సమభావం, సౌహార్దత, పెంచడం ద్వారానే ఈ దేశం యొక్క సమైక్యత, సమగ్రతలను కాపాడగలం. సామ్రాజ్యవాదుల కుట్రలను వమ్ము చేయగలం.'

**హర్‌కన్వల్ సింగ్**
పంజాబ్ ఉపాధ్యాయ సంఘ ప్రతినిధి.

****



'దేశం అన్ని రంగాలలో సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నది. విద్యారంగంలోనూ ఎదుర్కొంటున్నది. దేశంలో నిరక్షరాస్యత పెరుగుతున్నది. నిరుద్యోగం పెరుగుతున్నది. ప్రజలు అమాయకత్వం, అజ్ఞానంలో కూరుకు పోతున్నారు. ప్రస్తుత అస్తవ్యస్త పరిస్థితులకు కారణాలు వారికి తెలియవు. ఇవి ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా పరిస్థితులే కావు, దేశవ్యాప్తంగా వున్న పరిస్థితులు. ఉపాధ్యాయులు తరగతి గదులలోని బిడ్డలకే గాక అక్షరాస్యతా జ్యోతిని వెలిగించి సమాజాన్ని కాంతి వంతం చేయాలని, అందుకు అవసరమైన పథకాన్ని రూపొందించి అమలు జరుపుటలో ఉపాధ్యాయులుగా మనం ముందుండా లని విజ్ఞప్తి చేస్తున్నాను.

**అనంత కార్**
కార్యదర్శి
సెకండరీ స్కూల్ టీచర్స్ అసోసియేషన్
ఒరిస్సా.

****

'ఉపాధ్యాయులలో చైతన్యాన్ని పెంచి విద్యా రంగానికి చెందిన సమస్యలపై పోరాటాలకు సంసిద్ధులను చేయడంలో ఆంధ్రప్రదేశ్‌ది అగ్రస్థానం. వేలాదిమంది ఉపాధ్యాయులు ఈ పట్టణానికి తరలివచ్చి ఈ సదస్సులో పాల్గొనడమే అందుకు సాక్ష్యం. ఉపాధ్యాయ వర్గం విద్యార్థులు వ్యతిరేకించి నప్పటికి నూతన విద్యా విధానం పేరుతో నవోదయ పాఠశాలలు వెలిశాయి. నూతన విద్యా విధానాన్ని ప్రవేశపెట్టకుండా చేయడంలో వివిధ రాష్ట్రాల ఉపాధ్యాయులు విడివిడిగా పోరాడి విఫలమయ్యారు. కాబట్టి దేశ వ్యాప్తంగా విద్యారంగంలో ఎదురయ్యే విపరీత ధోరణులను ఎదుర్కొనడానికి వివిధ రాష్ట్ర ఉపాధ్యాయ సంఘాలు మధ్య సమన్వయం అవసరం.

**మిశ్రా,**
ఉత్తర ప్రదేశ్

****



'శాస్త్ర సాంకేతిక రంగాలు, మూఢాచారాలు సహజీవనం చేస్తున్న దేశం మనది. సమాజంలో మూఢాచారాలను తొలగించలేకపోతే దేశం ముందుకు కాదు, వెనక్కి నడుస్తుంది. అక్షరాస్యతను పెంచడంతో పాటు మూఢాచారాలకు వ్యతిరేకంగా పోరాడేందుకు విద్యార్థుల్ని సంసిద్ధం చేయడంలో ఉపాధ్యాయులుగా మన కర్తవ్యాన్ని చర్చించి అందుకు సరియైన విధానాన్ని రూపొందించాలని విజ్ఞప్తి చేస్తున్నాను.'

**శ్రీ దేవేంద్రసింగ్**
రాజస్థాన్ ఉపధ్యాయ సంఘం



'విద్య కేంద్ర రాష్ట్రాల ఉమ్మడి జాబితాల వుండడం వలన పెత్తనం కేంద్రం చేతిలోనూ, ఆర్థిక భారం రాష్ట్రాల పైనా పడుతున్నది. విద్యను రాష్ట్ర జాబితాలో చేర్చినప్పుడు విద్యాభివృద్ధికి అవకాశాలు పెరుగుతాయి.

**తమిళనాడు ఉపాధ్యాయ సంఘ ప్రతినిధి**

****

మీరు తలపెట్టిన లక్ష్యాలు చాలా ముఖ్యమైనందు వల్ల మీ మహాసభలు జయప్రదం కావాలని ఆకాంక్షిస్తున్నాను. మన ఫెడరేషన్ వ్యవస్థాపకులు కీ.శే. లక్ష్మయ్యగారు ఆశించి నట్లు విద్యా ప్రగతికి, ఉపాధ్యాయ సంక్షేమానికి, ప్రజాసేవకు తోడ్పడే అనేక నిర్ణయాలు చేయగలరని ఆశిస్తున్నాను.

ఇట్లు
**పిల్లా సుబ్బారావు** అధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్.

****



ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ 5వ రాష్ట్ర మహాసభలు నెల్లూరులో జరుపుతున్నందుకు ఎంతో ఆనందిస్తున్నాను. నేటి విద్యారంగంపై మీ ఆవేదన, అవగాహనలను అభినందిస్తు న్నాను.

ఉపాధ్యాయులు జాతి భవితవ్యానికి రూపకల్పన చేసేవారు. భావిభారత పౌరుల వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దేవారు. నేడు వీరి బాధ్యత మరింత పెరిగింది. ముఖ్యంగా గ్రామీణ ఉపాధ్యాయుల బాధ్యత పేద, సామాన్య ప్రజానీకపు బిడ్డలకు విజ్ఞాన వికాసాలు పంచి పెట్టడంలో ఎంతైనా పెరిగింది. మీ మహాసభ దీనిపై దృష్టి సారిస్తుందని ఆశిస్తున్నాను.

మీరు నిర్వహిస్తున్న గోష్ఠులు, సదస్సులు, ఆహ్వానిస్తున్న ప్రముఖుల ఉపన్యాసాలు, సందేశాలు, పెరుగుతున్న మీ సంఘబలం, అన్ని ఉపాధ్యాయుల్లో సాంస్కృతిక విజ్ఞాన స్పృహను గణనీయంగా పెంచగలవని ఆశిస్తున్నాను. ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ కేవలము ఉపాధ్యాయుల సమస్యలపైనా దృష్టిని కేంద్రీకరించకుండా, ప్రస్తుత విద్యారంగంలో సమూలమైన మార్పులు తీసుకొని వచ్చేందుకు, ఉపాధ్యాయులలో నైతిక విలువలు పెంపొందించేందుకు కూడా కృషి చేయడం ఎంతైనా అభినందించ దగిన విషయం. అన్ని విధాలా ఈ మహాసభలు జయప్రదం కావాలని ఆకాంక్షిస్తున్నాను.

ఇట్లు
**చేవూరి విజయమోహనరెడ్డి, యం.ఏ.,**
అధ్యక్షులు
మండల ప్రజాపరిషత్, గూడూరు.
నెల్లూరు జిల్లా.

****

యు.టి.యఫ్. విద్యా మహాసభల ద్వారా
మనసులో చెరిగిపోని మధురస్మృతులు కలిగించిన కార్యకర్తలందరికీ
శుభాకాంక్షలతో ....

# యునైటెడ్ టీచర్స్ కో-ఆపరేటివ్ హౌసింగ్ సొసైటీ లిమిటెడ్

రిజిష్టర్ నెం. టి.బి. 349 / తేదీ 6-6-84
పెదఅంబర్ పేట : : హయత్ నగర్
రంగారెడ్డి జిల్లా

పర్సన్ – ఇన్‌ఛార్జి కమిటీ

సర్వశ్రీ డి. రామిరెడ్డి, పి. సత్యనారాయణ, వై.యల్. నారాయణ, పి. సత్యనారాయణరాజు, సి.హెచ్. పిచ్చిరెడ్డి, జి. లక్ష్మయ్య, కె. జోజయ్య, కె. కృష్ణయ్య, ఎ. రంగారావు.

సభ్యులకు గమనిక

1. కార్యాలయమందు గల గుర్తింపు కార్డులను పూర్తిచేసి ఓటర్లు కండి.
2. గృహనిర్మాణమునకు సిద్ధపడువారు తమ వివరములన్నిటిని కార్యాలయమునకు అందజేయండి.

కార్యాలయం

యు.టి.యఫ్. భవన్
దోమల్‌గూడ, హైదరాబాద్ – 29
ఫోన్ : 66840

Grams : UTIYEF

Phone: V Z A : 63606 Phone : H Y D : 66840

**IKYA UPADHYAYA**
Yearly Subscription Rs. 25-00
Single Copy Rs. 2-50

**IKYA UPADHYAYA**
Palaparthivari Street
VIJAYAWADA-520 002.

# ఐక్యఉపాధ్యాయ



సంపుటి, 15 | 1989 జూలై, ఆగష్టు | సంచిక 7,8

## అందుకోండి ... అరుణాంజలి !

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ 5వ విద్యా వైజ్ఞానిక మహాసభలు 1989 జూన్ 22-25 తేదీలలో, నెల్లూరులో అత్యంత జయప్రదంగా జరిగాయి.

నెల్లూరు చరిత్రలోనే అపూర్వంగా, ఉద్యమచరిత్రలోనే అమోఘంగా 5వ మహాసభలద్వారా యు. టి. యఫ్. తన ప్రత్యేకతను, చాటింది. దేదీప్యమానంగా వెలుగొందింది.

ప్రారంభసభగాని, సాంస్కృతిక సభగాని, విద్యా గోష్ఠిగాని, ఆరోగ్య సదస్సుగాని, సాహిత్య సదస్సుగాని దేనికదే ప్రత్యేకత సంతరించుకొన్నది. ప్రతి ఉపన్యాసం,చైతన్య స్ఫోరకమైనదే. అలాగే వస్తు ప్రదర్శనలు, వైజ్ఞానిక ప్రదర్శనలు, ఉర్రూతలూగించిన పాటలు.

అన్నిటికంటే మించి మహాప్రదర్శన నెల్లూరు పట్టణాన్నే కుదిపి వేసింది. ఎర్రెర్రని పతాకాలతో, ప్లేకార్డులతో, క్రమశిక్షణతో కదం దొక్కుతూ, మిన్నంటే నినాదాల హోరుతో మహా ప్రవాహంలా, మరచిపోలేని మధుర ఘట్టమది. ఆబాలగోపాలం దర్శించి, అన్ని వర్గాల ప్రజల్ని ఆశ్చర్యచకితుల్ని చేసిన చెరిగిపోని చిరస్మృతి అది.

ఎందుకీ విజయం ? ఎలా వచ్చిందీ చైతన్యం ?

15 సంవత్సరాల చిరదీక్ష ఇది. ఆశయాల కంకితమైన తపోఫలమిది పీడితోపాధ్యాయుల పక్షాన నికరంగా నిలబడిన పోరాట ఫలితమిది !

యు. టి. యఫ్. 1974లో ప్రారంభింపబడింది. అన్ని ప్రాంతాల, అన్ని కేడర్ల, అన్ని యాజమాన్యాలకు విస్తరించి, సమైక్య ఉపాధ్యాయ సంస్థగా ఉపాధ్యాయుల పక్షాన నిల్చి, అనేక విజయాలు సాధించింది. ఫలితంగా ఉపాధ్యాయుల హృదయాలలో హత్తుకు పోయింది.

యు. టి. యఫ్. స్థాపనే ఓ చారిత్రక అవసరంగా జరిగింది. ప్రారంభించింది మొదలు వందలాది కార్యకర్తల దీక్ష, వేలాదిమంది ఉపాధ్యాయుల అండ, దానికి పెట్టని కోట అయ్యాయి. అన్ని మహాసభలూ అపార సమీకరణతో దిగ్విజయమయ్యాయి.

ఈ పెరుగుదలకు, ఆదరాభిమానాలకు దాని సూత్రబద్ధవైఖరే కారణం. అత్యవసరపరిస్థితి ఎదురైనా పోరాటాలు ఆగిపోలేదు. విద్యఉమ్మడి జాబితా అన్నా ఊరుకోలేదు. భాషా విధానం పైనా ఏటికి ఎదురీదింది. అవకాశవాదులు ఎన్ని పాట్లుపడ్డాదాని ప్రగతిని అడ్డుకోలేక పోయారు. ఆపైన పుష్కరకాలం తర్వాత దాని మార్గంలోనే పయనించాల్సిన తప్పని పరిస్థితికి నెట్టబడ్డారు.

నిజంగానే ఈ మహాసభకాలం యు. టి. యఫ్. కు స్వర్ణయుగం. 23 జిల్లాలకు విస్తరించి, 53 వేలకు చేరిన సభ్యత్వం, 18 వేలను అధిగమించిన ఐక్య ఉపాధ్యాయ పత్రిక, 10 సంపుటాలు దాటిన అధ్యాపకదర్శినుల ప్రచురణల విభాగం, అకడమిక్‌సెల్ క్రమబద్ధ కార్యక్రమం, సామాజిక స్పృహ పెంపొందించే కార్యాచరణ దాని ప్రగతికి ప్రతిబింబాలు.

మహాసభల జయప్రదానికి అతి స్వల్పకాలంలోనే అహోరాత్రులు శ్రమించిన కార్యకర్తలకు, ఆదరించిన అధ్యాపకులకు, విరాళాలిచ్చిన దాతలకు, అన్ని ఏర్పాట్లలో సహకరించిన ప్రజా సంఘాల కార్యకర్తలకు, చేయూతనిచ్చిన విద్యాభిమానులకు, మాహృదయపూర్వక వందనాలు.

మహాసభల ద్వారా ఉపాధ్యాయ వర్గం మాపై ఉంచిన గురుతర బాధ్యతను గుర్తెరిగి మసలు కొంటామని, అమరజీవి చెన్నుపాటి ఆశయాల అడుగు జాడలో పయనిస్తామని, ఉద్యమాన్ని మరింత ముందుకు తీసుకు పోతామని ఈ సందర్భాన విన్నవించు కొంటూ . . . ఈ మహాసభల ప్రతిబింబాన్ని మీముందుంచుతున్నాం.

**ము ఖ్య గ మ ని క**

ఈ నెల నుండి ఐక్య ఉపాధ్యాయ పత్రిక సంవత్సర చందా రూ. 25/- లుగా పెంచటం జరిగింది. పేపరు, ప్రింటించు ధరలు పెరిగిన కారణంగా పత్రిక రేటు పెంచటం తప్పని సరి అయింది. ఆగష్టు 1 నుండి పెంచిన రేటు అమలులోకి వస్తుంది. పాఠకులు ఎప్పటిలా మాతో సహకరించాలని కోరుతున్నాం.

# స్పందించిన కలాలు! శ్రుతి గలిపిన గళాలు!



## ఎత్తరా ... గొంతెత్తరా!

— శ్రీ యం. పురుషోత్తమాచార్య
నల్గొండ

ఎత్తరా గొంతెత్తరా మన
ఫెడరేషను కీర్తిని నలు
దిక్కు లదర పాడగ గొంతెత్తరా!

ఉత్తమ ఉద్యమ సంస్థకు
ఉపాధ్యాయ సంఘానికి
జే జే లను పలుకుతూ స
ముజ్జ్వల కరదీపికలను ... ఎత్తరా!

ఉపకారమె ఊపిరిగా
సహకారమె లక్ష్యంగా
త్యాగాలకు వెనుదీయని
అమర వీరులకు నివాళులు ... ఎత్తరా!!

ఉపాధ్యాయ సమైక్యతను
విద్యార్థులతో మైత్రిని
భంగ పరచ జూచెడి, దు
ర్మార్గుల గుండెల్లో హడలు ... ఎత్తరా!!

నిత్యంగా నిల్చిపోవు
సత్యమే చెన్నుపాటి
నవత కొఱకు శ్రమియించిన
శివంకరుడు చంద్రమౌళి
అందరి మేలును కోరే
సుందరమే సుందరయ్య
వీరి అరుణ రేఖలలో
వెలిగి పోవు పతాకాన్ని ... ఎత్తరా!!

(మహాసభల్లో గానం చేయబడిన పాట).



## అరుణరాగం

— శ్రీ పద్దమాను వెంకటేశ్వర్లు
తెనాలి.

పదవ విద్యా వైజ్ఞానిక మహాసభలు
యు.టి.యఫ్ ప్రగతికి పట్టాభిషేకం !
ఐక్య ఉద్యమాభివృద్ధికి అద్దం పట్టి
నవతరానికి పల్కినయ్ నాందీ వాచకం !

జాతి పురోగమనానికి మార్గం చూపి
వివిధ రాష్ట్ర ప్రతినిధుల నాహ్వానించి
సందేశాలూ . . . సలహాలూ సమన్వయించి
అఖిల భారత వ్యాప్తికి పునాది వేసినయ్

బడి పంతుళ్ళ ఓర్పు, నేర్పు, కళ, క్రమశిక్షణ
చేవ దేలిన చైతన్యం, వెల్లి విరిసిన విజ్ఞానం
భరతమాతకే అలంకారం కాబోతున్నది
ఆకసమంతా అరుణరాగం అలుంకొంటున్నది !



## ప్రబోధం

శ్రీ చిరమన శ్రీనివాసులు
కడివేడు, నెల్లూరు జిల్లా.

ఉపాధ్యాయ సోదరా !
ఉద్యమాన్ని నడపరా !!
ఉత్తేజం, ఉత్సాహం
ఉరకలేయ సాగరా !! ||ఉపా||

నిజాయితీ, నిస్వార్థం
నిష్పాక్షిక వైఖరీ
నిన్ను నిలుపు బలమురా
నీకు మూల ధనమురా ! ||ఉపా||

దౌర్జన్యం, దుర్మార్గం
అవినీతి, అక్రమాల
తూరుపార బట్టరా !
తుద ముట్టించేయరా !! ||ఉపా||

లంచగొండి తన మన్నది
పొంచి యున్న పులి వంటిది
మాటువేసి పట్టరా !
ఘాటు దెబ్బ కొట్టరా !! ||ఉపా||

ఉపాధ్యాయ సంక్షేమమె
ఊపిరిగా భావించిన
అమరజీవి చెన్నుపాటి
ఆశలు పండించరా !! ||ఉపా||

సమస్యలను సాధింపగ
సరభస గతి కదలరా !
ఐక్య ఉపాధ్యాయ పేరు
అంతట మ్రోగించరా !! ||ఉపా||

(పతాక యాత్రల్లో పలుమార్లు గానం చేయబడినది)

# ఉద్యమ స్ఫూర్తితో ఉన్నత శిఖరాలందుకొన్న యు.టి.యఫ్. 5వ రాష్ట్ర విద్యా వైజ్ఞానిక మహాసభలు

యు.టి.యఫ్. రాష్ట్ర మహాసభలంటేనే అదో ప్రత్యేకత .. అదో సంచలనం .. అదో చైతన్యస్ఫూర్తి .. ఉరకలెత్తే ఉత్సాహోత్తేజాలు ! గత నాల్గు మహాసభల అనుభవాలూ అవే .. ఈ 5వ మహాసభకూడా నిరూపించింది అదే.

నిర్ణయం తీసుకొన్నప్పుడు నిండా నాల్గు నెలలైనా లేదు. అందులో రెండు నెలలు వేసవి శెలవులు. ఈ స్వల్పకాలంలోనే ఆర్థిక వనరులు సమకూర్చుకోవాలి. చైతన్యపరిచే కార్యక్రమాలుండాలి. చేవగల రిపోర్టులు ప్రవేశపెట్టాలి. శక్తి వంతమైన ప్రదర్శన నిర్వహించాలి. అలరించే సాంస్కృతిక ప్రదర్శనలు ఏర్పాటు చేయాలి. విజ్ఞానం వెల్లివిరిసే ఎగ్జిబిషన్ రూపొందించాలి. అయినా కార్యకర్తలు కఠోర దీక్ష పూనేరు. వజ్ర సంకల్పం ప్రదర్శించారు. ఎన్ని అవాంతరాలెదురైనా నిద్రాహారాలుమాని నిర్విరామ కృషి చేశారు. ఉద్యమ శక్తికి ఎదురు లేదని నిరూపించారు. ఊహింపని విధంగా మహాసభల్ని విజయవంతం చేసి ఉద్యమ చరిత్రలో మరో సువర్ణాధ్యాయాన్ని చేర్చి చరితార్థం చేశారు. ఒక్క మాటలో చెప్పాలంటే ఆ ఘనత అతిథ్య మిచ్చిన నెల్లూరు జిల్లా శాఖకు దక్కుతుంది.

## కొత్తవరవడులు

మహాసభలకు ముందే జిల్లా వ్యాప్తంగా ఉపాధ్యాయుల్లో, విద్యార్థుల్లో అంతర్గతంగా ఉండే శక్తులన్నిటిని వెలికి దీయటానికి ఆటలు .. పాటలు .. రచనలు - వివిధ పోటీల ద్వారా సృజనాత్మక శక్తులన్నిటినీ ప్రోత్సహించారు. గుండగుండెలో కొత్తదివ్వెల్ని వెలిగించారు. తమ యింట్లో జరిగే పండుగగా భావించే వాతావరణం కల్పించారు. దానితో ఎంతో ఆదరణ [illegible] జిల్లా అంతటా [illegible]ల్లివిరిసింది



వేదిక ముందు ఉప్పుతో చిత్రించిన శాంతికపోతం

## మహోత్తేజంగా సాగిన పతాక యాత్రలు

మొత్తం నెల్లూరు జిల్లాను మూడు భాగాలు చేసి మూడు కేంద్రాల నుండి ముగ్గురి నాయకత్వాన ఈ యాత్ర ప్రారంభించడింది. దాదాపు అన్ని ఉన్నత పాఠశాలలను, ప్రధాన కేంద్రాలను దర్శించేలా యిది సాగింది. వందలాదిమంది ఉపాధ్యాయులను పలకరిస్తూ, ఉద్యమ మహాసభలకాహ్వానిస్తూ సాగిన పతాకయాత్రకు అప్యాయతతో ఉపాధ్యాయులు అడుగడుగునా స్వాగతం పలికారు. ఆతిథ్యం ఇచ్చారు. యాత్రా వాహనం మండల కేంద్రానికి చేరినపుడు ఆ మండల బాధ్యులు తమ పతాకాన్ని చేర్చి వెంటవచ్చారు.

మొదటి యాత్ర జిల్లాశాఖ ఉపాధ్యక్షులు శ్రీ ఎ.వీరయ్యనాయకత్వాన 'తడ' నుండి బయలు దేరింది. సూళ్ళూరుపేట, దొరవారి సత్రం మండల కేంద్రాల మీదుగా నాయుడుపేట చేరింది. ఓజలి, పెళ్ళకూరు శాఖలు తమ పతాకాలతో అక్కడ కలిశాయి. చిట్టమూరు, వాకాడు మండల కేంద్రాల మీదుగా మధ్యాహ్నానికి కోట చేరింది. వాకాడులో ఎయిడెడ్ పాఠశాల ఉపాధ్యాయులు 50 మంది అపూర్వ స్వాగతం పలికారు. కోట టీచర్లు మధ్యాహ్నం భోజనవసతి కల్పించి వెంటవచ్చారు. చిల్లకూరు మండలం మీదుగా గూడూరు చేరగానే అప్పటికే సైకిల్ యాత్ర చేసిన గూడూరు టవున్, గూడూరు మండల శాఖల బాధ్యులు స్వాగతం చెప్పి పట్టణాని[illegible] [illegible]ని వచ్చారు. పురవీధుల్లో ప్రచారం చేసి [illegible] ఉదయం మనుబోలు, వెంకటాచలం మీదుగా ఈ దళం నెల్లూ[illegible]


వెంకటగిరిలో పతాకయాత్ర

రెండ[illegible] పతాక యాత్ర [illegible]యపల్లి నుం[illegible] [illegible] [illegible] రాధాకృష్ణారెడ్డిగారి నాయకత్వాన ప్రారంభమై వెంకటగిరి [illegible] డక్కిలి, రాపూరుల మీదుగా కలువాయి చేరింది. అక్కడ మధ్యాహ్న ఆతిథ్యం కలువాయి శాఖ ఇచ్చింది. చేజర్ల మీదుగా పొదలకూరు చేరి సాయంత్రం పురవీధుల్లో ప్రచారం చేస్తూ రాత్రి విశ్రాంతి తీసుకొని ఉదయం నెల్లూరు చేరింది. దాదాపు ఈ ప్రాంత పాఠశాలలన్ని సందర్శించడం దీని ప్రత్యేకత.

మూడవ యాత్ర సీతారామపురం నుంచి జిల్లాశాఖ ఉపాధ్యక్షుడు శ్రీ కె. నారాయణ రెడ్డి గారి నాయకత్వాన బయలుదేరి ఉదయగిరి, దుత్తలూరు మీదుగా కలిగిరి, వింజమూరు చేరి ఆత్మకూరుకు వచ్చింది. వరికుంటపాడు, మర్రిపాడు, అనంతసాగరం, ఎ.యస్.పేట శాఖలు ఆత్మకూరు వద్ద కలిశాయి. అక్కడనుంచి సంగం మీదుగా బుచ్చి చేరి రాత్రి విశ్రాంతి తీసుకొని ఉదయం నెల్లూరు చేరింది.



పశ్చిమ గోదావరి పతాకయాత్ర

మూడు పతాక యాత్రల దళాలు నెల్లూరు వెంకటేశ్వరపురం సెంటర్‌కు ఉదయం 8 గం.ల కల్లా చేరుకున్నాయి. అప్పటికే ముత్తుకూరు, నెల్లూరు టౌన్, నెల్లూరుమండలం, తోటపల్లి గూడూరు, ఇందుకూరుపేట, శాఖలు తమ పతాకాలతో అక్కడికి చేరాయి. అంతా కోలాహలం. ఉదయభానుడి కాంతులతో పోటీ పడుతున్న అరుణ పతాకాల రెపరెపలు గుమికూడిన ప్రజానీకాన్ని అమితంగా ఆకర్షించాయి.




రాజమండ్రి పతాకయాత్ర

దానితో పాటు గత మహాసభలు జరిగిన నాల్గు చోట్ల నుండి నాల్గు పతాకాలు 400 కి.మీ. ప్రాంతం పర్యటిస్తూ .. ఊరూర స్వాగతాలు అందుకొంటూ మోటారు సైకిళ్లు, జీపులపై పతాక యాత్ర జరిపారు. విజయవాడ 20 వ తేది రాత్రికి 'చతుర్వేణి' సంగమంలా చేరుకొన్నారు. ఖమ్మంజిల్లా నుండి 15 మంది మోటారు సైకిళ్లపై ఎంతో శ్రమకోర్చి కదలి రావటం ప్రశంసనీయం. నాల్గు చోట్ల నుండి వచ్చిన 50 మంది దళానికి విజయవాడలో నేతాజీ రెసిడెన్షియల్ స్కూలు (చుట్టుగుంట) లో భోజన సదుపాయం కల్పించారు. 21వ తేదీ ఉదయం మళ్లీ బయలు దేరి గుంటూరు, ప్రకాశం జిల్లాల మీదుగా దారి పొడువునా స్వాగత సత్కారాలందుకొంటూ యాత్ర సాగించారు. ఖమ్మం జిల్లా దళానికి (15 మంది) జిల్లా ప్రధాన కార్యదర్శి శ్రీ కృష్ణయ్య నాయకత్వం వహించారు. పశ్చిమ గోదావరి జిల్లా దళానికి (5 గురు) శ్రీ యన్.ఆర్.పోలిశెట్టి, సుభాన్ చంద్రబోస్ నాయకత్వం వహించారు. తూర్పు గోదావరి జిల్లా దళానికి (5 గురు) ప్రధాన కార్యదర్శి శ్రీ జి.చిట్టిబాబు నాయకత్వం వహించారు. కృష్ణాజిల్లా దళానికి అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు శ్రీ పి.వెంకటేశ్వరరావు, శ్రీ యన్. రామకోటేశ్వరరావు నాయకత్వం వహించారు.



ఖమ్మం పతాకయాత్ర

21వతేది సాయంత్రానికి రాష్ట్రంలోని నాల్గు ప్రాంతాల నుంచి బయలుదేరిన పతాకయాత్ర దళాలు కావలికి చేరాయి. కావలి టవున్, కావలి మండలం, దగదర్తి, జలదంకి శాఖలు వారికి స్వాగతం పలికి రాజుపాళెం సెంటర్‌కు చేరాయి. అప్పటికే కొడవలూరు, కొల్లేరు, విడవలూరు మండల శాఖలు రాజుపాలెం అంతా ప్రదర్శన చేసి రాత్రికి వీరందరికీ ఆతిథ్యం ఇచ్చాయి. 22వ తేది ఉదయం అన్ని దళాలూ నెల్లూరు చేరాయి




విజయవాడ పతాకయాత్ర

వెంకటేశ్వరపురం, స్థానిక సెట్టి గుంట రోడ్డు సెంటర్లలో అన్ని పతాకయాత్రల దళాలు మహాసాగర సంగమంలా కలిశాయి. నెల్లూరు

జిల్లా 49 శాఖల 49 పతాకాలు రాష్ట్రంలోని నాల్గు ప్రాంతాల 4 పతాకాలు ఒక్కటై అదొక మహాప్రవాహంలా కన్పించాయి. మహాసభల వేదిక అయిన సర్వోదయ కళాశాలకు, పుర వీధుల్లో కదం తొక్కుతూ, నినాదాలిస్తూ చేరాయి. సభాస్థలివద్ద రాష్ట్ర నాయకులు వాటికి స్వాగతం పలికి ప్రతిష్ఠింప జేశారు.

వేలమంది టీచర్లను కలవడం, వారి ఆతిథ్యం స్వీకరించడం, వందలాది గ్రామాల్లో మహాసభల ప్రచారం, దానికి కార్యకర్తల కృతదీక్ష ఈ పతాక యాత్రల ప్రత్యేకత. ఈ ప్రచార ప్రభావంతో జిల్లాలోని మూడు వంతుల ఉపాధ్యాయులు మహాసభలకు హాజరయ్యారంటే .. దాని ప్రాధాన్యత, విశిష్టత మనకు అర్థమవుతుంది.

జిల్లా ఉద్యమానికి ఇది గొప్ప ఉరవడి !

దీక్షా దక్షతకు మరోవరవడి !



## పతాకావిష్కరణలు

నెల్లూరు సర్వోదయ కళాశాల ఆవరణలో, ప్రత్యేకంగా నెలకొల్పిన అమరజీవి చంద్రమౌళి నగర్‌లో పతాకావిష్కరణలతో 22 ఉదయం మహాసభల కార్యక్రమం ప్రారంభమయింది. జిల్లా కలెక్టర్ శ్రీ కె. రాజు జాతీయ పతాకాన్ని, ఉద్యమ పతాకాన్ని సీనియర్ కార్యకర్త శ్రీ కటారి తిరుపాలు ఆవిష్కరించారు. దేశభక్తి గేయాలతో .. ఉద్యమ స్ఫూర్తి నిచ్చే పతాక గేయంతో మహాసభల వాతావరణం వ్యాపింపగా .. మంద్ర స్వరంతో, ఆశయాల కోసమై అసువులనర్పించిన అమర వీరులకు, జోహార్లర్పించేగేయం సాగుతుండగా అమరవీరుల స్థూపానికి రాష్ట్రకమిటీ సభ్యులు, ప్రత్యేకాహ్వానితులు పూలు సమర్పించి శ్రద్ధాంజలి ఘటించారు.



అమరులకు శ్రద్ధాంజలి ఘటిస్తున్న దృశ్యం

అంతకు ముందే మహాసభల ప్రాంగణానికి చేరుకున్న ఉద్యమ పతాకాలను నాయకులు స్వీకరించారు. మొదటి మహాసభ జరిగిన రాజమండ్రి నుండి వచ్చిన ఉద్యమ పతాకాన్ని అధ్యక్షుడు శ్రీ డి. రామిరెడ్డి, రెండవ మహాసభ జరుపుకున్న ఖమ్మం నుండి చేరిన ఉద్యమ పతాకాన్ని ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి, మూడవ మహాసభ నిర్వహించిన భీమవరం నుండి వచ్చిన ఉద్యమ పతాకాన్ని రాష్ట్ర నాయకులు శ్రీ. టి. అంజిరెడ్డి, నాల్గవ మహాసభను ఘనంగా నిర్వహించిన విజయవాడ నుండి వచ్చిన ఉద్యమ పతాకాన్ని ఐక్య ఉపాధ్యాయ ప్రధాన సంపాదకుడు శ్రీమైనేని వెంకటరత్నం, ప్రస్తుతం 5వ మహాసభను అత్యంత ఆనందోత్సాహాలతో జరుపుకుంటున్న నెల్లూరు ఉద్యమ పతాకాన్ని శ్రీ కె. నారాయణరావులు స్వీకరించారు. అనంతరం అత్యంత వైభవోపేతంగా ఎగ్జిబిషన్ ప్రారంభమైంది. ఎగ్జిబిషన్‌లో సైన్సు ప్రదర్శనను జిల్లా అభివృద్ధి అధికారి శ్రీ డి. సి. రోశయ్య ప్రారంభించగా, చిత్రకళా ప్రదర్శనను జిల్లా విద్యాధికారి శ్రీ. యం. బాలాజీ సింగ్, జన విజ్ఞాన వేదిక ఆరోగ్య ప్రదర్శనను నెల్లూరు మున్సిపల్ ఛైర్మన్ శ్రీ జి. రమే[illegible] [illegible] ప్రదర్శనను నెల్లూరు మున్సిపల్ కమీషనరు శ్రీ ఎస్. ఎ. సతార్‌లు [illegible]రంభించారు.



సింగరాయకొండలో పతాకయాత్రలకు స్వాగతమిస్తున్న దృశ్యం

శ్రీ డి.రామిరెడ్డి అధ్యక్షతన ఏర్పాటైన సమావేశంలో జిల్లాకలెక్టరు శ్రీ కె.రాజు సందేశమిస్తూ, కేవలం ఉపాధ్యాయ సమస్యలపై కాకుండా దేశాభివృద్ధికి సంబంధించిన అంశాలపై కూడా మహాసభ కూలంకషంగా చర్చించాలని కోరారు. యు.టి.యఫ్. ఉద్యమాన్ని అభినందిస్తూ హక్కులు - బాధ్యతలు రెండు నేత్రాలుగా యు.టి.యఫ్. ప్రగతి బాట పయనిస్తున్నందుకు ప్రశంసించారు. శ్రీ కటారి తిరుపాలు సందేశమిస్తూ అశేష త్యాగాల ఫలితంగాఉద్యమం ఎంతో ప్రాధాన్యతను సంపాదించుకున్నదని చెప్పారు. అనంతరం శ్రీ రోశయ్య, శ్రీ బాలాజీ సింగ్ సందేశమిస్తూ స్థాయిగల విజ్ఞాన ప్రదర్శనకు విశేష కృషి చేసిన ఉపాధ్యాయులను అభినందించారు. శ్రీ వెంకటస్వామి వందన సమర్పణ గావించారు.

## స్వాగత ద్వారాలు

యు.టి.యఫ్. మహాసభ సందర్భంగా పట్టణంలోని 3 ప్రధాన కేంద్రాల ద్వారాలకు మహాకవి తిక్కన, అమరజీవి పొట్టి శ్రీరాములు, పీడిత ప్రజానేత పుచ్చలపల్లి సుందరయ్య, మహాసభల ముఖద్వారానికి అమరజీవి చంద్రమౌళి పేర్లను పెట్టారు. పట్టణంలో 10 స్వాగత ద్వారాలను ఆకర్షణీయంగా ఏర్పాటు చేశారు. పట్టణమంతా యు.టి.యఫ్. పతాకాలతో సుందరంగా అలంకరించారు. రాష్ట్రమంతటి నుండి 7 వేల మంది ప్రతినిధులు అందిన ప్రత్యేక బస్సులలో, రైళ్ళలో ఉదయానికే ఉత్సాహంతో చేరుకున్నారు. వీరిలో వేయిమందికి పైగా మహిళలు పాల్గొనడం విశేషం.

## ప్రారంభ సభ

నిరక్షరాస్యతను రూపుమాపి విద్యా స్వరాజ్ సాధించేందుకు ఉపాధ్యాయులు ఉద్యమించాలని సుప్రీం కోర్టు మాజీ న్యాయమూర్తి శ్రీ కృష్ణయ్యర్ సభను ప్రారంభిస్తూ పిలుపునిచ్చారు. ప్రపంచంలోని మొత్తం నిరక్షరాస్యులలో సగం మంది భారతదేశంలోనే వున్నారని ఆయన తెలిపారు. స్వాతంత్ర్యం వచ్చిన 10 ఏళ్లలో సార్వత్రిక విద్య జరుపుతామని, రాజ్యాంగంలో పేర్కొనబడినా స్వాతంత్ర్యా నంతరం 42 ఏళ్ళు గడిచినా మన దేశంలో అక్షరాస్యత బండి ముందుకు సాగక పోగా వెనక్కు పోతోందని చెప్పారు. సోషలిష్టు దేశాలయిన చైనా సోవియట్ యూనియన్, క్యూబా వంటి దేశాలలో నూటికి నూరు శాతం అక్షరాస్యత సాధించగా, మన దేశంలో నూటికి 36 మంది మాత్రమే అక్షరాస్యులుగా ఉండడం సిగ్గుచేటైన విషయమని శ్రీ కృష్ణయ్యర్ పేర్కొన్నారు. 1950 వ దశకంలో కేంద్రబడ్జెట్‌లో విద్యపై 7.2 శాతం ఖర్చుచేయగా, ప్రస్తుతం 1.2 శాతానికి ఖర్చు దిగజారిందని అన్నారు. విద్యపై బడ్జెట్ కనీసం 10 శాతం కేటాయించాలని ఆయన కోరారు.



అల్లూరు నియోజక వర్గ శాసన సభ్యులు శ్రీ జక్కా వెంకయ్య సభలో మాట్లాడుతూ ప్రజల జీవన పరిస్థితులు మెరుగుపరచడానికి జరిగే పోరాటంలో అందరికి విద్య కోసం జరిగే పోరాటం అంతర్భాగంగా వుండాలని అన్నారు. విద్యార్థులను చైతన్యవంతులను చేయడంలో ఉపాధ్యాయులకు తమ పూర్తి అండదండలుంటాయని ఆయన చెప్పారు.

శ్రీ డి. రామిరెడ్డి ప్రారంభసభకు అధ్యక్షత వహించారు. ఆయన తొలిపలుకులు పిదప ప్రజా వైద్యశాల డాక్టరు, ఆహ్వాన సంఘ అధ్యక్షుడు శ్రీ.జె. శేషారెడ్డి స్వాగతోపన్యాసం చేశారు. అధ్యక్షోపన్యాసం పిదప ప్రారంభ సభ ముగిసింది.

ఆ సాయంత్రం జరిగిన ప్రతినిధుల సభలో అధ్యక్ష వర్గ, సారథ్య సంఘ, అర్హతల సంఘ ఎన్నికలు జరిగాయి.

**అధ్యక్ష వర్గం** :- సర్వశ్రీ డి. రామిరెడ్డి, కె. నారాయణ రావు, జి.లక్ష్మయ్య, యస్. ఆర్. పోలిశెట్టి, జి.సి. లక్ష్మిరెడ్డి, కె. భద్రయ్య

**సారథ్య సంఘం** :- సర్వశ్రీ ఎ. వెంకటస్వామి, పి. సూర్యనారాయణరాజు, యస్. విజయకుమార్, పి. కృష్ణమూర్తి, యం.ఎ.కె.దత్తు, వి. బాల సుబ్రహ్మణ్యం, యం. వెంకటరత్నం.



ఎగ్జిబిషన్ ప్రారంభ దృశ్యం

**అర్హతల సంఘం** :- సర్వశ్రీ బి. అంజిరెడ్డి, కె. కృష్ణయ్య, పి. మహేశ్వరరావు, డి. లక్ష్మిరెడ్డి, పి. రాజమౌళి, సి. హెచ్. లక్ష్మినారాయణ, కె. రామచంద్రారెడ్డి.

ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి సంఘనివేదికను, ప్రవేశపెడుతూ సభ్యత్వం 53 వేలకు చేరుకొన్నదని, రాష్ట్ర వ్యాప్తంగా సాగించిన కృషిని సమీక్షించారు. ఐక్య ఉపాధ్యాయ ప్రధాన సంపాదకుడు శ్రీ మైనేని వెకటరత్నం ఉద్యమ వాణి ఐక్య ఉపాధ్యాయ 18 వేల సర్క్యులేషన్‌తో పురోగమిస్తున్నద[illegible] చెప్పారు.



ఆ రాత్రి [illegible] ప్రదర్శనల్ని ఊర్వశి అవార్డు ముమ్మారు పొందిన సినీ ఆర్టిస్టు శ్రీమతి శారద ప్రారంభించారు. ఆ సభకు ఆంధ్రప్రదేశ్ మహిళా సంఘ కార్యదర్శిని శ్రీమతి మోటూరు ఉదయం అధ్యక్షత వహించారు



ఈ సందర్భంగా ప్రసంగిస్తూ శ్రీమతి శారద, సమాజంలో నానాటికి కాన్వెంటు చదువుల వ్యామోహం పెరిగి పోతుండడం పట్ల ఆవేదన వెలిబుచ్చారు. గతంలో పల్లెల్లోను, పట్టణాల్లోనూ, ప్రాథమిక పాఠశాలలు, మున్సిపల్ పాఠశాలల పట్ల తల్లిదండ్రుల్లో ఒక సద్భావం, గౌరవ భావం వుండేదని, కానీ ఏకారణం వల్లనైతేనేమి ఇప్పుడు ఆ స్థానం లేకుండా పోయిందని ఆమె అన్నారు. మన సంస్కృతీ సాంప్రదాయాలు మృగ్యమైన కాన్వెంట్ చదువులకు ప్రాధాన్యత విపరీతంగా పెరిగిపోతున్నదని వీటిని అరికట్టేందుకు చేయాల్సిన కృషి గురించి అధ్యాపకులు, తల్లిదండ్రులు ఆలోచించాలని శ్రీమతి శారద అన్నారు.

సభకు అధ్యక్షత వహించిన ఆంధ్రప్రదేశ్ మహిళా సంఘం కార్యదర్శి శ్రీమతి మోటూరు ఉదయం మాట్లాడుతూ సమాజంలో సగభాగంగా ఉన్న మహిళ నేటికీ అన్యాయాలకూ, అక్రమాలకు గురౌతోందని అన్నారు. స్వాతంత్ర్య పోరాటంలో మహోన్నత పాత్ర నిర్వహించిన మహిళలకు ఇన్నేండ్ల స్వాతంత్ర్యానంతర పాలనలో న్యాయం జరగలేదని అన్నారు. అందువల్ల మహిళలు వారు ఏ రంగంలో పని చేస్తున్నా తమ సంక్షేమానికై హక్కుల సాధనకై నడుంకట్టాలని అన్నారు.



అఖిలాంధ్ర కళాకారుల సంఘం కార్యదర్శి శ్రీ [illegible] బసవయ్య ప్రసంగిస్తూ ఎక్కడ చూసినా సెక్స్, క్రైమ్ సాహిత్యం కుప్పతెప్పలుగా వచ్చిపడి యువతను తప్పు దోవ పట్టిస్తోందని, ఖావి తరాన్ని రూపొందించటంలో ఉపాధ్యాయులపై బృహత్తర బాధ్యత వుందని అన్నారు. కళకే అంకితమైన పేద, వృద్ధ కళాకారులను ఆదుకునేందుకు తన సిల్వర్‌జూబ్లీ ఉత్సవాల సందర్భంగా ఒక ట్రస్టు ఏర్పాటు చేసి దానిపై వచ్చిన వడ్డీని వారి కివ్వాలని, ప్రతి సినిమాద్వారా వచ్చే ఆదాయంలో కొంత డిపాజిట్ చేస్తూ వుండాలని శ్రీమతి శారద ఇటీవల తనతో చెప్పారని శ్రీ బసవయ్య తెలిపారు.



సందేశాలిస్తున్న అతిథులు

తొలుత రాష్ట్ర కార్యవర్గ సభ్యురాలు శ్రీమతి కమలకుమారి దుశ్శాలువ కప్పి శ్రీమతి శారదను సత్కరించారు. పిదప నెల్లూరు జిల్లాకు చెందిన పలువురు స్థానిక ప్రముఖ రచయితలను, కవులను ఉపాధ్యాయులను జిల్లాశాఖ సన్మానించింది. అలాగే, 7, 10 వ తరగతి పరీక్షల్లో ర్యాంకులు పొందిన నలుగురు విద్యార్థులకు మెమెంటోలు బహూకరించారు.

కావలికి చెందిన ఉత్తమ ఉపాధ్యాయుడు శ్రీ ఆర్.పి. సుబ్బారావు, రచయిత శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డి, ఉపాధ్యాయుడు శ్రీ జయకృష్ణ, కవి శ్రీ శివారెడ్డి శేషురెడ్డి, కవి, ఉపాధ్యాయుడు శ్రీ మోన, స్థానిక సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ రామానుజాచార్యులు స్టేజ ఆర్టిస్టు శ్రీ రేబాల రమణ, రచయిత శ్రీ పిసపాటి విశ్వేశ్వరశాస్త్రి శ్రీ శంకరయ్య గార్లను సత్కరించారు.

10 వ తరగతి పరీక్షలలో రాష్ట్రంలో 7 వ ర్యాంకు పొందిన టి. రంగాచారి, 7 వ తరగతి పరీక్షల్లో జిల్లాలో ప్రథమ, ద్వితీయ ర్యాంకులు పొందిన ఎ. శశిధర్, కుమారి సుమన్‌లను ఈ సందర్భంగా మెమెంటోలు బహుకరించారు.

## విద్యా గోష్ఠి

రెండవ రోజు జరిగిన విద్యాగోష్ఠికి యు.టి.యఫ్. ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ.వెంకటస్వామి అధ్యక్షత వహించారు. ఈ మహాసభల సందర్భంగా తమ 'అకడమిక్ సెల్' ఆధ్వర్యాన ఇటీవల నిర్వహించిన ఉపాధ్యాయ శిబిరం, వృత్తి విద్యపై సెమినార్‌లపై ఒక డాక్యుమెంటు, కాన్వెంటు చదువులు, రెసిడెన్షియల్ స్కూళ్ళపై మరో డాక్యుమెంటు, ఛటోపాధ్యాయ కమీషన్ రిపోర్టు సారాంశాన్ని 'ఉపాధ్యాయుడు – సమాజం' అనే పేర ఇంకో డాక్యుమెంటు ప్రతినిధులకు పంచి చర్చిస్తున్నామని తెల్పేరు.

ఈ విద్యా గోష్ఠిని పాఠశాల విద్యా డైరెక్టరు శ్రీ టి. వెంకారెడ్డి ప్రారంభిస్తూ ఇటీవల కాలంలో కాన్వెంటులు, రెసిడెన్షియల్ స్కూళ్ళు కుప్పల తెప్పలుగా బయలుదేరేయని, ప్రస్తుతం నడుస్తున్న ప్రభుత్వ పాఠశాలలు, తల్లిదండ్రుల ఆశల మేరకు పనిచేయలేక పోవటం కూడా ఇందుకు కారణమని, విద్యా సంస్థల్ని నడపటంలో విధాన నిర్ణయాల్లో ఉపాధ్యాయులను కూడా భాగస్వాములుగా చేయాలని ప్రభుత్వం ప్రతిపాదించిందని, పాఠశాలల్లో నేర్పే విద్యకు సామాజిక అవసరాలకు సంబంధం ఉండాలని, మాతృభాష తరగతి గది... బోధించటంతో పాటు, దానిని అధికార భాషగా చేసి అన్ని రంగాలలో ప్రవేశపెట్టనంత కాలం పరభాషా వ్యామోహం పోదని, దృశ్య శ్రవణ విధానం విద్యా బోధనకు గొప్ప సాధనంగా ఉపకరిస్తుందని చెప్పారు.

ప్యాక్టో అధ్యక్షుడు, మాజీ యం.యల్.సి. శ్రీ యం.జె. మాణిక్యారావు ప్రసంగిస్తూ, సమాజపురోభివృద్ధికి విద్య ప్రధానమైనదని, కాని విద్యారంగం నేడు పెద్ద సంక్షోభంలో చిక్కుకొని ఉన్నదని, ఆర్థిక రంగాల్లో వైఫల్యాలు దానిలో కూడా ప్రతిఫలిస్తున్నాయని, అందుకనే నిరక్షరాస్యత తొలగలేదని, ప్రజల దారిద్ర్యాన్ని రూపుమాపటంతో పాటు, యుద్ధ ప్రాతిపదికపై నిరక్షరాస్యత నిర్మూలించాలని ఆయన ఉద్బోధించారు.




మాజీ యం. యల్. సి., విద్యావేత్త అయిన శ్రీ యం. మాధవరావు ప్రసంగిస్తూ వర్గ సమాజంలో అందరికీ ఒకే విద్య లభించదనీ, అందువల్ల ఈ సామాజిక వ్యవస్థ మారకుండా ప్రజలందరికీ విద్యావకాశం లభించజాలదని, ఉపాధ్యాయవర్గం వ్యవస్థ మార్పుకు కృషి చేయాలని అన్నారు.

## మహా ప్రదర్శన

ఆ సాయంత్రం 3 గంటలకు నెల్లూరు పట్టణాన్ని ఊపివేస్తూ 10 వేల మందితో మహా ప్రదర్శన జరిగింది. రాష్ట్ర ఉపాధ్యాయ ఉద్యమంలో యు.టి.యఫ్. ప్రతిష్ఠను, విశిష్టతను ఈ ప్రదర్శన మరో సారి రుజువు చేసింది. మూడు కిలోమీటర్ల పొడవున .. రెండు వరుసలలో బారులు తీరి, అత్యంత క్రమశిక్షణతో ఈ ప్రదర్శన సాగింది. ఒక పాయింట్



దాటటానికి దాదాపు 50 నిమిషాలు పట్టింది. ప్రతి వారి చేతిలో కోర్కెల ప్లే కార్డులు, యు.టి.యఫ్. పతాకాలతో, హెూరెత్తిన నినాదాలతో పట్టణంలో విశేష సంచలనం తెచ్చింది.

సమస్యలకే పరిమితమైన నినాదాలు గాక, నిరక్షరాస్యత, నిరుద్యోగం నిర్మూలించాలని, శాస్త్రీయ విద్య ప్రవేశపెట్టాలని, అధిక ధరలు అరికట్టాలని, ప్రపంచ శాంతి వర్ధిల్లాలని, చేసిన నినాదాలు వారి సామాజిక స్పృహకు అద్దం పట్టేయి. తెలంగాణా జిల్లాల నుండి వచ్చిన ప్రతినిధులు అందరినీ ఆకర్షించే విధంగా హిందీలో నినాదాలు చేశారు. 'ఉస్తాద్ నహీ.. తాలీం నహీ, దునియాకే ఉస్తాద్ ఏక్ హై, హమారే మాంగే .. లేకే రహేంగే, కైసే లేంగే లడకే లేంగే' లాంటి నినాదాలు ప్రజల్ని విశేషంగా ఆకర్షించినయ్.

1974లో రాజమండ్రిలో తొలి మహాసభ నాటి నుండి, నేటి ఐదవ మహాసభను ప్రతిబింబిస్తూ ఆయా జిల్లాల ముఖ్య కార్యకర్తలు 5 పతాకాలు చేబూని ముందు నడిచారు. ఆ వెనుక మహాసభల పెద్ద బ్యానర్ కదిలింది. దాని వెనుక రాష్ట్ర నాయకులు, ఇతర రాష్ట్రాల సౌహార్ద ప్రతినిధులు నాయకత్వం వహిస్తూ నడిచారు. ఆ వెనుక తెల్లటి షర్టు, ప్యాంటు ధరించిన 500 మంది వలంటీర్లు, ఆ వెనుక మహిళలు, రెండు వరుసలుగా బారులు తీరారు. స్త్రీలు యు.టి.యఫ్. గుర్తు బోర్డరు గల ప్రత్యేక చీరలు ధరించడం ఒక ప్రత్యేకత సంతరించుకొన్నది. ఆ తర్వాత నెల్లూరు జిల్లా వివిధ మండలాల బ్యానర్లలో కదిలింది. పిదప జిల్లాల వారీగా బ్యానర్లు పట్టుకొని ప్రదర్శకులు కదిలారు. మండుటెండల్ని సైతం లెక్క చేయక 10 వేల మంది ఆ ప్రదర్శనలో పాల్గొన్నారు.

సర్వోదయ కళాశాల ముఖ ద్వారం నుండి ఎర్రని కొండ వాగులా .. కడలి కెరటాల్లా .. పుట్ట పగిలినట్టు .. నేల యీనినట్టు .. పట్టణాన్ని అరుణారుణం చేస్తూ క్రమబద్ధంగా ఎంతకీ తరగని ఆ ఊరేగింపు అందర్నీ ఆశ్చర్య చకితుల్ని చేసింది. 'ఉపాధ్యాయ ఉద్యోగ సమైక్యత వర్ధిల్లాలి! యన్.జి.ఓ.ల 53 రోజుల సమ్మెకాలం జీతాలివ్వాలి!' అని పదివేల కంఠాలు ఆకాశం దద్దరిల్లేట్టు నినదిస్తుంటే వివిధ కార్యాలయాలలో పనిచేసే ఉద్యోగుల కళ్ళల్లో సహృద్భావం పెల్లుబికింది. ('విద్యార్థులకు పాఠ్యగ్రంథాలు వెంటనే అందించాలని నినదిస్తుంటే) బాలబాలికలు, తలిదండ్రులు ఆశావహంగా చూశారు. కష్టజీవులకు చెందిన నినాదాలిస్తుంటే ఎ ళ్ళ ఆనందానికి హద్దేలేదు ముందు నడుస్తున్న సిక్కు ప్రతినిధుల్ని చూసి 'ఇది అఖి భారత మహాసభా!' అని సందేహ వెళ్ళబుచ్చారు కొందరు. ఈ విధంగా అన్ని వర్గాల ప్రజల్ని ఆకర్షిస్తూ ఆత్మీయుల్ని చేసుకొంటూ 3 గంటల పాటు సాగి మద్రాస్ బస్‌స్టాండ్, ట్రంక్‌రోడ్, జడ్.పి. కార్యాలయాల మీదుగా తిరిగి మహాసభ ఆవరణకు చేరుకొన్నది. దారి పొడవునా రోడ్డుకిరువైపులా, మేడల మీదా, మిద్దెల మీదా నిలబడి ఈ ప్రదర్శనను ప్రజలు ఎంతో ఆసక్తితో తిలకించారు. రాష్ట్రంలో అన్ని తరగతుల, అన్ని ప్రాంతాల ఉపాధ్యాయుల్ని సంఘటిత పరచిన అతి పెద్ద ఉపాధ్యాయ సంస్థగా తన సమీకరణ శక్తిని ఈ ప్రదర్శన ద్వారా యు.టి.యఫ్. నిరూపించింది.

ఈ మహా ప్రదర్శనను ఆ మారునాడు పతాక శీర్షిక లిచ్చి రంగు రంగు బొమ్మలతో అన్ని పత్రికలూ ప్రచురించి విశేష ప్రచార మిచ్చి యు.టి.యఫ్. ఘనతను చాటినయ్.

## బహిరంగ సభ

ప్రదర్శనానంతరం శ్రీ డి. రామిరెడ్డి గారి అధ్యక్షతన జరిగిన బహిరంగ సభలో పశ్చిమ బెంగాల్ విద్యాశాఖామంత్రి శ్రీ కాంతిబిశ్వాస్, పార్లమెంటు సభ్యులు శ్రీ మోటూరు హనుమంతరావు, జనతాదళ్ నాయకుడు శ్రీ జైపాల్‌రెడ్డి, సి.పి.ఐ. నాయకులు శ్రీ జి. రామచంద్రయ్య, విద్యా విధానాలపై తమ తమ పార్టీల అభిప్రాయాల్ని వ్యక్తీకరించారు. దేశంలో విద్యా రంగం తీవ్రమైన నిర్లక్ష్యానికి గురవుతున్నదని, విద్యా రంగాన్ని ప్రాధాన్యత గల రంగంగానూ, ఉత్పాదనా రంగంగానూ, గుర్తించాలని, పునాది విద్య అయిన ప్రాథమిక విద్య రోజు రోజుకు క్షీణిస్తున్నదని, చీకటి ఖండమని పేర్కొనే దక్షిణాఫ్రికాలో అక్షరాస్యులు 46 శాతం ఉంటే, మన దేశంలో 36 శాతం మాత్రమేనని, మహిళల్లో 24.8 శాతం మాత్రమేనని, విద్యారంగ బడ్జెట్ ప్రణాళికల్లో 7 శాతంతో ప్రారంభమై నేటికి 1.2 శాతానికి కుదింపబడటమే దానికి కారణమని వక్తలందరూ ఏకాభిప్రాయాన్ని వెల్లడించారు. ఉపాధ్యాయులు ప్రజలకు బాధ్యత వహించాలనీ, ప్రజలంటే కార్మిక, కర్షకులని, వారికి విద్య గరపందే ఉత్పాదనా కృషి అడుగు ముందుకు సాగదని, ఈ దుస్థితిని పోగొట్టటానికి యు.టి.యఫ్. సాగిస్తున్న కృషిని అందరూ అభినందించారు.

పిదప జరిగిన ఎన్నికలలో ఈ క్రింది కార్యవర్గం ఏకగ్రీవంగా ఎన్నికయింది.




ప్రారంభసభ దృశ్యం

## రాష్ట్ర కార్యవర్గం

### సబ్‌కమిటీ

**అధ్యక్షుడు** :- శ్రీ డి. రామిరెడ్డి

**ప్రధాన కార్యదర్శి** :- శ్రీ ఎ. వెంకటస్వామి

**ఉపాధ్యక్షులు** :- సర్వశ్రీ జి. లక్ష్మయ్య
యస్.ఆర్. పోలిశెట్టి
కె. నారాయణరావు
కె. భద్రియ్య
యస్. ఆనందనాయుడు

**కార్యదర్శులు** :-సర్వశ్రీ పి. సూర్యనారాయణరాజు
పి. బాలసుబ్రహ్మణ్యం
యస్. విజయకుమార్
పి. కృష్ణమూర్తి
కె. జోజయ్య

**ప్రధాన సంపాదకుడు** :- శ్రీ మైనేని వెంకటరత్నం

**కార్యవర్గ సభ్యులు**:- సర్వశ్రీ పి. ఉమామహేశ్వరరావు (శ్రీకాకుళం), యం. మురళీధరరావు (విజయనగరం), కె.యల్. యన్ శాస్త్రి (విశాఖ), జి.చిట్టి బాబు (తూ. గోదావరి), సి.హెచ్. సుభాన్ చంద్రబోస్(ప.గో), యన్. రామకోటేశ్వరరావు (కృష్ణా), వి.విశ్వనాథం (గుంటూరు), కె. రామచంద్రారెడ్డి (చిత్తూరు), పి.నరసింహులు (కడప), డి. లక్ష్మిరెడ్డి (ప్రకాశం), ఎ. చెన్నకేశవరెడ్డి (కర్నూలు), జి.సి. లక్ష్మిరెడ్డి (అనంతపురం), కె. కృష్ణయ్య (ఖమ్మం), పి. రాజమౌళి (కరీంనగర్), యస్. నర్సయ్య (ఆదిలాబాద్), యస్. ఆంజనేయులు (నల్గొండ), యం.డి. ఖమురుద్దీన్ (యం. నగర్), సి.హెచ్. పట్టాభిరామయ్య (నిజామాబాద్), యం.ఆర్. రెడ్డి (మెదక్), యం. మార్క్ (రంగారెడ్డి), యస్. రమణయ్య శాస్త్రి (హైదరాబాదు), శ్రీమతి సి.కమలకుమారి (మహిళాప్రతినిధి).

### సంపాదక వర్గం

**ప్రధాన సంపాదకుడు** :-శ్రీ మైనేని వెంకటరత్నం

**సంపాదక వర్గం** :- సర్వశ్రీ ఎ. వెంకటస్వామి, డి. రామిరెడ్డి, యం. నరహరి, యం.ఎ.కె. దత్తు.

### ఆడిట్ కమిటీ

సర్వశ్రీ యం.ఎ.కె. దత్తు (కన్వీనర్)
టి. కొండాచారి
కె. బ్రహ్మాజీరావు

ఆ రాత్రి జరిగిన సాంస్కృతిక ప్రదర్శనలతో రెండవ రోజు కార్యక్రమం పూర్తి అయింది.



మూడవ రోజు ఉదయం ప్రతినిధుల సభ వివిధ సమస్యలు చర్చించి తీర్మానాలు ఆమోదించింది. తమిళనాడు ఉద్యోగ, ఉపాధ్యాయ సమితి కన్వీనర్ శ్రీ యం. ఆర్. అప్పన్, తమ రాష్ట్రంలో ఇటీవల జరిగిన పోరాటాల్ని, విజయాల్ని వివరించారు. పిదప రాజస్థాన్(2), పంజాబ్ (7), యు.పి. (1), పశ్చిమబెంగాల్ (4), ఒరిస్సా(1), తమిళానాడు (8), కేరళ(4)లకు చెందిన 27 మంది ప్రతినిధుల పక్షాన ఆయా ఉపాధ్యాయ సంఘాల నాయకులు సందేశాలిచ్చి అఖిలభారత ఉద్యమాన్ని తలపింపజేశారు.

పిదప నెల్లూరు ప్రజా వైద్యశాలకు చెందిన డా.జె. శేషారెడ్డి అధ్యక్షతన ఆరోగ్య సదస్సు జరిగింది. పంచాయత్ రాజ్ శాఖామాత్యులు శ్రీ పి. చంద్రశేఖర్ దాన్ని ప్రారంభించారు. ఖమ్మంకు చెందిన



మహా ప్రదర్శన

డా. వై. రాధకృష్ణమూర్తి ప్రపంచ ఆరోగ్య సంస్థ సూచించిన విధానాల్ని తెల్పి ప్రజలందరి ఆరోగ్యానికి చెందిన కార్యక్రమాల్ని వివరించారు. డా. విజయకుమార్ మూఢ విశ్వాసాల ఫలితంగా ఎదురవుతున్న అకాలమరణాల్ని వివరించి పాఠశాల పరిధిలోనే ఉపాధ్యాయులు బిడ్డల జబ్బుల్ని ఎలా నివారించవచ్చో వివరించారు. కర్నూలు, పీపుల్స్ హెల్త్ సొసైటీకి చెందిన డా. పి. బ్రహ్మారెడ్డి, మందుల కంపెనీల దారుణదోపిడీని, సామాన్య ప్రజలకు వైద్యం అందుబాటులో లేని దుస్థితిని వివరించి, ప్రజలందరి దగ్గరకు ఆధునిక విజ్ఞానాన్ని అందించాల్సిన అవసరాన్ని వివిధ ఉదాహరణలతో ఆకర్షణీయ ప్రసంగం చేశారు. జన విజ్ఞాన వేదిక కార్యక్రమాల్ని వివరించి ప్రజల కోసం సైన్సు, దేశాభివృద్ధి కోసం సైన్సు, దేశ సమైక్యత కోసం సైన్సు ఎలా ఉపయోగిస్తుందో తెల్పి ఉపాధ్యాయుల కర్తవ్యాల్ని తెల్పారు.



పంచాయిత్‌రాజ్ ఛాంబర్ అధ్యక్షుడు శ్రీ యన్. చంద్రశేఖర్ రెడ్డి సందేశమిస్తూ, ప్రజల ఆరోగ్యం కాపాడటం ప్రభుత్వ బాధ్యత అని, సహకార విద్యా సంస్థలు విద్యా వ్యాపార సంస్థలుగా మా[illegible] అవకాశమున్నందున వాటిని రద్దు చేయాలని, జూనియర్ కళాశాలలను, హైస్కూళ్ళకు అనుబంధం చేసి అర్హతలు గల హైస్కూలు టీచర్లను జె.యల్స్‌గా ప్రమోట్ చేయాలని, దీవుల్లో వున్న పాఠశాలల్లో పని చేసేందుకు కనీసం రోటేషన్ పద్ధతి కయినా ఉపాధ్యాయులు అంగీకరించాలని, బి.యిడి., సెకండరీ గ్రేడు ప్యాసయినవారికి ఎంప్లాయిమెంట్ ఆఫీసులో రిజిస్టరు అయిన వారికి సీనియారిటీ ప్రకారం ఉద్యోగాలివ్వాలి తప్ప మళ్ళీ సెలక్షన్ పరీక్షలు అనవసరమని, టీచర్లు

[illegible] లేకుండా చాల పాఠశాలలు నడవటం [illegible]కరమని వీటన్నిటినీ ప్రభుత్వ [illegible] తెచ్చామని అన్నారు.



ఆ మధ్యాహ్నం శ్రీ మైనేని వెంకట[illegible] అధ్యక్షతన జరిగిన విద్యా సదస్సులో ఆంధ్రాయూనివర్సిటీ [illegible] ఎం. నళిని మహిళా సమస్యల్ని గురించి ప్రత్యేక ప్రసంగం చేశారు. సమాజంలో సగభాగంగా ఉన్న స్త్రీలు చైతన్యం పొందనిదే, ఉత్పాదనా కృషిలో వారి భాగస్వామ్యం లేనిదే దేశాభివృద్ధి జరగదని వక్కాణించారు. ఆ విద్య, సాంఘిక దురాచారాలు, దౌర్జన్యాలు మహిళల జీవితాల్ని ఎలా నరక ప్రాయం చేస్తున్నాయో కళ్ళకు కట్టించారు. వివిధ రంగాలలో పురోగమిస్తున్న మహిళల్ని పేర్కొని స్త్రీ అబల కాదని సబల అని ఉద్బోధించారు.



ఆ సాయంత్రం జరిగిన సాహిత్య సదస్సుకు



శ్రీ పి.బాలసుబ్రహ్మణ్యం అధ్యక్షత వహించారు. ఆంధ్రప్రజా నాట్యమండలి అధ్యక్షుడు డా. ఎ.పి.విఠల్ సదస్సును ప్రారంభిస్తూ భావ ప్రపంచం భౌతిక ప్రపంచం నుండే ఆవిర్భవిస్తుందని, సమాజ పరిణామానికి అనుగుణంగా సాహిత్యం పరిణామం చెందుతుందని, వర్గ సమాజం ఏర్పడినప్పటి నుండి సాహిత్యం కూడా వర్గ ప్రయోజనాలను ప్రతిబింబిస్తూ వచ్చిందని అన్నారు.



ప్రఖ్యాత కథా రచయిత శ్రీ మధురాంతకం రాజారాం తన ప్రసంగాన్ని కథారూపంలో కొనసాగిస్తూ, సగటు మనిషి నేడు కథావస్తువుగా మిగిలి ఉండటం సంతోషదాయకమని, మధ్య తరగతి భ్రమల నుండి మనిషిని బయటికి లాగి, జీవన వాస్తవాలను కళ్ళముందు నిలిపి, మనిషిని మనిషిగా నిలబెట్టే సాహిత్యం నేడెంతో అవసరమని, ప్రతి యిద్దరు కథా రచయితల్లోను ఒకరు ఉపాధ్యాయులై ఉండటం హర్షింపదగిన విషయమని, బోధనలో కూడా ఆ సాహితీ శక్తిని ఉపయోగించి విద్యార్థుల్ని సత్ పౌరులుగా తీర్చి దిద్దాలని ఉద్బోధించారు.



ఐక్య ఉపాధ్యాయ సంపాదక వర్గ సభ్యులు శ్రీ యం. నరహరి మాట్లాడుతూ ప్రజల్లో పఠనాభిలాష పెరిగిందని, దానిని దుర్వినియోగ పరుస్తూ ఆధునిక సాహిత్యంలో దిగజారుతున్న విలువల్ని సోదాహరణంగా వివరించారు. యువతీ యువకుల్ని తప్పుదారి పట్టించే క్రైం, సెక్స్, దయ్యాల రచనల్ని ఆయన తీవ్రంగా నిరసించారు. భావితరాన్ని తీర్చి దిద్దాల్సిన ఉపాధ్యాయులు పురోగమన శీలమైన సాహిత్యాన్ని ప్రోత్సహించాలని, మానవతా విలువల్ని ధ్వంసం చేస్తూ ఉప్పెనలా ముంచుకొస్తున్న దుష్ట సంస్కృతీ ప్రభావాన్ని త్రిప్పి కొట్టాలని కర్తవ్యోపదేశం చేశారు.



శ్రీ యస్.యం. కొండయ్య (సంపాదకుడు, ప్రాథమిక విద్య) సందేశమిస్తూ అకడమిక్ విషయాల్లోనూ, నిర్మాణంలోనూ యు.టి.యఫ్.కు పూర్తి సహకారాన్ని అందిస్తానని హర్షధ్వానాల మధ్య ప్రకటించారు.

పిదప జన విజ్ఞాన వేదిక వారు ప్రచురించిన 'అయోడైజ్డ్ ఉప్పు' పుస్తకాన్ని డా. విఠల్, ఆహ్వాన సంఘ అధ్యక్షుడు డా. జె. శేషారెడ్డి 'చిట్టి విజ్ఞానం' అనే పుస్తకాన్ని ఆవిష్కరించారు. ప్రకాశంజిల్లా సావనీర్‌ను శ్రీ మధురాంతకం రాజారాంగారు ఆవిష్కరించారు పత్రికా క్యాంపెయిన్లలో విజేతలకు, జిల్లాలో నిర్వహింపబడిన క్రీడలు, వ్యాసరచన, లెసన్‌ప్లాన్, కథానికలు, గేయరచన పోటీల్లో పాల్గొని విజేతలైన వారికి శ్రీ శేషారెడ్డి గారు బహుమతులందించారు.

జనవిజ్ఞాన వేదిక ప్రధాన కార్యదర్శి శ్రీ లక్ష్మణరెడ్డి సందేశమిస్తూ సామాన్య ప్రజలకు సైన్సు ప్రయోజనాలను, సైన్సు స్పృహను సన్నిహితం చేస్తున్న తమ సంస్థకు ఉపాధ్యాయుల సహకారం ఎంతైనా అవసరం అన్నారు.





నాల్గవరోజు జరిగిన ప్రతినిధుల సభలో శ్రీ సీతారాం ఏచూరి సందేశమిచ్చారు. పిదప ఉపాధ్యాయ సంక్షేమం, వృత్తి భద్రత, విద్యారంగ అభివృద్ధికి చెందిన పలు తీర్మానాలు ఆమోదించారు.

## విద్యా, వైజ్ఞానిక, ఆరోగ్య, చిత్ర, వస్తు ప్రదర్శనలు

మహాసభల సందర్భంగా ఏర్పాటుచేసిన ఎగ్జిబిషన్లు ఉన్నత స్థాయిలో ఉన్నాయని పలువురు ప్రశంసించారు. వేలాదిమంది ఎడతెరిపి లేకుండా వాటిని దర్శించటం అవి ఎంత ఆసక్తికరంగా ఉన్నాయో, విజ్ఞానదాయకంగా తీర్చి దిద్దబడ్డాయో స్పష్టపరుస్తుంది.

జన విజ్ఞాన వేదిక వారు ఏర్పాటు చేసిన విజ్ఞాన ప్రదర్శన, ఆరోగ్య ప్రదర్శన బహుళ ప్రయోజనకారిగా అందరినీ ఆకర్షించింది.

వివిధ జిల్లా ఉపాధ్యాయుల మార్గదర్శకత్వంలో పనికిరాని వస్తువులతో చౌకగా రూపొందించిన విభిన్న బోధనోపకరణాలు, ఛార్టులు, సైన్సు, గణితం, చరిత్రను సులభంగా బోధించే సాధనాలు, ఎంతో విజ్ఞానదాయకంగా ఉన్నాయి. పురావస్తు పరిశోధనా విభాగం, చిన్నారులు తయారుచేసిన ఆకర్షణీయమైన, ఆశ్చర్య చకితుల్ని చేసే బొమ్మలు కూడా ఈ ప్రదర్శనలో చోటు చేసుకొన్నాయి.

ఈ ప్రదర్శనలో మరో ప్రత్యేక ఆకర్షణ ప్రపంచ బాలల చిత్రకళా ప్రదర్శన. వెల్లటూరు నవరంగ్ చిత్ర కళానికేతన్ స్థాపకులు శ్రీ వి. పూర్ణనందశర్మగారు దీన్ని తీర్చి దిద్దారు. బిడ్డల భావనాశక్తికి, కల్పనా పటిమకు, కళా నైపుణ్యానికి ఇవి గీటురాళ్ళుగా ఉన్నాయి.



మహాసభల సందర్భాన నిరంతర సేవలందించిన స్కౌట్ మాష్టర్, (శ్రీ పి. ధర్మారావు, ఒడలరేవు, తూ.గో)

ఆహ్వాన సంఘం వారు, ప్రజా సంఘాల సహకారంతో వందలాది వలంటీర్లను సమీకరించి, వచ్చిన వేలాది ప్రతినిధులకు ఉచితభోజన వసతి సదుపాయాలు కల్పించి, రాత్రింబవళ్లు శ్రమించి అన్ని యేర్పాట్లు చేశారు. ఎందరో దాతలు మహా సభల దిగ్విజయానికి విరాళాలిచ్చి తోడ్పడ్డారు.

అన్ని పత్రికలు పతాక శీర్షికలిచ్చి మహాసభల విశేషాల్ని ప్రచురించి విశేష ప్రచారానికి తోడ్పడ్డాయి. ఆకాశవాణి వారు ప్రత్యేక శ్రద్ధతో ప్రసారం జేసి సహకరించారు.

ఈ విధంగా యు.టి.యఫ్. తన మహాసభల ద్వారా తన సమీకరణ శక్తిని, ప్రజాభిమానాన్ని, నిరూపించుకోవడమే గాక, హక్కులు – బాధ్యతలు తమ నేత్రాలనీ, అధ్యయనం – అధ్యాపనం – సామాజిక స్పృహ తమ సూత్రాలనీ మళ్ళీ నినదించి, వాటిని ప్రతిబింబించే కార్యక్రమాల ద్వారా ఉత్సాహోత్తేజాలను రేకెత్తించి, చైతన్యాగ్నిని రగుల్కొల్పి అధ్యాపక లోకానికి ఆశా జ్యోతిగా నిల్చింది. పదే పదే సామాజిక కర్తవ్యాలను ప్రబోధించి, 'జనంతోనే మనం' అనే విశాల దృక్పథాన్ని చాటి తన ప్రత్యేకతను నిల్పుకొన్నది. 8 రాష్ట్రాల నుండి దాదాపు 5 లక్షల మందికి ప్రాతినిధ్యం వహించే వివిధ సంఘాలకు చెందిన సౌహార్ద ప్రతినిధుల రాకతో దేశవ్యాప్త ప్రగతిశీల ఉద్యమానికి పునాది వేసి ఈ మహాసభ ఓ మూల మలుపుగా చరిత్రలో నిల్చింది. నిరక్షరాస్యతా నిర్మూలనకు, విజ్ఞాన వ్యాప్తికి, విద్యా రంగ అభివృద్ధికి జాతీయ సమైక్యతను తన తీర్మానాల ద్వారా కర్తవ్య దీక్షను పురికొల్పింది. ఉపాధ్యాయుల్లో అణగిమణగి ఉండే సృజనాత్మక శక్తుల్ని వెలికిదీసి ప్రత్యేక ప్రోత్సాహమిచ్చి సరియైన జాతి నిర్మాతలుగా రూపొందాల్సిన కర్తవ్యాలను ప్రబోధించి చరితార్థమయింది.



పుస్తకావిష్కరణ దృశ్యం

## సాంస్కృతిక ప్రదర్శనలు

—శ్రీ పున్నం బసవయ్య
కార్యదర్శి, అఖిలాంధ్ర
కళాకారులసంఘం

22, 23, 24 తేదీల్లో 3 రాత్రులూ ప్రొద్దు పోయేదాకా ప్రదర్శించిన సాంస్కృతిక ప్రదర్శనలు ప్రేక్షకుల్ని ఎంతగానో ఆకట్టుకొన్నాయి. పగలంతా వివిధ అంశాలపై చర్చలు, సదస్సులు, గోష్ఠులలో పాల్గొన్నప్పటికీ రాత్రి బాగా ప్రొద్దుపోయేవరకు వేలాదిమంది ఉపాధ్యాయులు ఎంతో ఆసక్తితో తిలకించారంటే ఈ ప్రదర్శనలు వారినెంతగా ఉత్తేజపరిచాయో విదితమౌతుంది.

రాష్ట్రంలో యిటీవల జరిగిన కూచిపూడి, భరత నాట్యం, బ్రేక్‌డాన్స్, జానపద నృత్య పోటీలలో అందరి మన్ననలను పొందడమేగాక, ప్రథమ, ద్వితీయ స్థానాలు పొందిన కుమారి సుచిత్ర, కుమారి భవాని చేసిన కూచిపూడి తరంగాలు, ప్లేట్ డ్యాన్స్, జానపద నృత్యం ప్రేక్షకులను మైమరపించి అలరింపజేశాయి. రమేష్ చేసిన కూచిపూడి నృత్యం సభికులను అలరించింది.

ఆంధ్ర ప్రజా నాట్యమండలి తిరుపతి వారు నేటి ఎలిమెంటరీ పాఠశాలల పరిస్థితిని కళ్ళకు కట్టినట్లు చిత్రించిన 'ఎలిమెంటరీ స్కూలు' నాటికను ప్రదర్శించి ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించారు. 45 నిమిషాలసేపు నాటిక ఐదు నిమిషాల్లో అయిపోయిందా అన్నట్లు ప్రేక్షకులు లీనమైపోయారు. ఉపాధ్యాయులు పిల్లలకు పాఠాలు బోధించేందుకు అటంకం కల్గించే పరిసరాలను పరిస్థితులను చక్కగా ప్రతిబింబించారు.

'నేనోడిపోయాను' అనే ఏకపాత్రను ప్రతినిధుల్లోని నెల్లూరుకు చెందిన ఒక ఉపాధ్యాయుడు ప్రదర్శించాడు. నెల్లూరుకు చెందిన లీలావతి బృందం వారు నలుగురు పిల్లలతో దశావతారం నృత్యం చేశారు.

చివరిలో సలాది భాస్కరరావు చెప్పిన హరికథ ప్రేక్షకులను ఎంతగానో అలరించింది.

23 రాత్రి జరిగిన సాంస్కృతిక ప్రదర్శనల్లో జన విజ్ఞాన వేదిక నెల్లూరి వారి శాస్త్ర కళా ప్రదర్శనలు ఎంతో విజ్ఞాన దాయకంగా ఉన్నాయి.

ఇతర రాష్ట్ర ప్రతినిధులు

[illegible] వుంది. బొటనవేలు [illegible] దశల్లోని [illegible] కాలాలకు [illegible] సాగిన ఈ ప్రదర్శన నాటి ప్రదర్శనల్లో తలమానికం అని చెప్పవచ్చు.

ప్రతినిధుల దృశ్యం

తర్వాత ప్రదర్శించిన 'ఆసుపత్రి' నాటిక ప్రజానీకంలో వుండే అనేక రకాల దురభిప్రాయాలు, మూఢవిశ్వాసాలకు చెంపపెట్టుగా అద్భుతంగా సాగింది. రక్తదాన ప్రాధాన్యత, డీహైడ్రేషనుకు పరిష్కారాలు ఈ నాటికలో రసవత్తరంగా ప్రదర్శించారు.

నేటి విద్యా విధానంపై ప్రదర్శించిన నైరూప్య ప్రదర్శన మెరుపులా మెరిసింది.

వన సంరక్షణ ఇతివృత్తంగా సాగిన సంగీన నృత్య రూపకం చక్కటి జానపద బాణీలతో అడవుల ప్రాధాన్యతను తెలియజేసింది. ఈ కార్యక్రమం ప్రతినిధులను ఎంతగానో అలరించింది.

ప్రపంచ శాంతిని ఆకాంక్షిస్తూ ఒక వైపు స్లైడ్ ప్రొజెక్టర్, మరోవైపు చక్కటి పాట కలగలిసిన ప్రదర్శన డాక్యుమెంటరీ పద్ధతుల్లో సాగింది.

ప్రభుత్వ యంత్రాంగంలో ఉపాధ్యాయ వర్గాన్ని వేధించే సమస్యలను ప్రతిబింబించే ''ఆడిట్'' నాటికను ప్రదర్శించారు.

'ఆత్మ వేదన' అనే ఏకపాత్రను నెల్లూరుకు చెందిన ఎన్. వరలక్ష్మి, 'ఒడపంతులు' ఏకపాత్రను పశ్చిమగోదావరికి జిల్లాకు చెందిన కె. సూర్యనారాయణ ప్రదర్శించారు. నెల్లూరుకు చెందిన కృష్ణమూర్తి 'మిమిక్రీ' చేశారు.



24 రాత్రి ప్రదర్శించిన 'మాయల పకీర్' ఏకపాత్ర ప్రశంసలను ఆకట్టుకుంది. 'లోకం పోకడ చూడరబాబు' నృత్య నాటికను ప్రకాశం జిల్లా కళాకారులు ప్రదర్శించారు. 'హరిదాసు గంజాయి తాగితే?' హరికథ [illegible] కడుపుబ్బ నవ్వించింది.

ఆంధ్ర ప్రజానాట్యమండలి రాష్ట్ర దళం గాయనీ గాయకులు దేవేంద్ర, జగన్, మోహన్, ప్రభావతి, బేగమ్, లెనీనా ఈ మహాసభలు జరిగిన మూడురోజులూ అక్కడే వుండి పాడిన పాటలు ప్రతినిధులను ఎంతగానో ఉత్తేజపరిచాయి. ఒక్కోపాటను అనేక సందర్భాలలో ప్రతినిధులు కోరి మళ్ళీ మళ్ళీ పాడించుకున్నారు. ఆ పాటలన్నీ ఉన్న ఉద్యమగేయాల క్యాసెట్‌ను ప్రజానాట్యమండలి గాయకుల సహకారంతో రూపొందించి విడుదల చేశారు. అది ఎంతో ఆదరణ పాత్రమై, 500 క్యాసెట్లు క్షణాల్లో అయిపోయినయ్.

## మహాసభల సందర్భంగా 'అఖిల భారత చిత్రకళా ప్రదర్శన'

సమీక్ష :- 'చిత్రకళా ప్రపూర్ణ'

బాలబాలికలకు ఆటపాటలంటే ఇష్టం. వారికి చదువు సంధ్యలపై కన్నా తాము స్వయంగా ఏదో ఒకటి చేసి, తమ ప్రతిభను ప్రదర్శించుకోవాలనే వుత్సుతక ప్రతి విద్యార్థిలో వుంటుంది. బాలలు తమ భావాలను, అనుభూతులను, ఖుశయాలను గురించి చెప్పటం, వ్రాయటం, గీయటం, పాడటం, నర్తించటం వంటివి వారి సృజనాత్మకశక్తిగా భావించవచ్చును.

ఈ బాలల సృజనాత్మక శక్తిని పెంపొందించటానికి, ముఖ్యంగా వారిలోనిచిత్రకళాశక్తిని పెంపొందించుటకు, వారి కళాత్మక శక్తిని ప్రోత్సహించటానికి గుంటూరు జిల్లా వెల్లటూరులో నవరంగ్ చిత్రకళా నికేతన్ వారు గత 20 సంవత్సరముల నుండి ప్రతి ఏటా అఖిల భారత స్థాయిలో బాల చిత్రకళ పోటీలను - ప్రదర్శనలను నిర్వహించి కృషి చేస్తున్నారు.

### బాలల చిత్రకళా ప్రదర్శన

వివిధ రాష్ట్రాలకు చెందిన బాలలు ఎక్కువగా వారికి సుపరిచితాలైన నిత్య జీవిత సంఘటనలను, చిత్రాలను పంపారు. ఇంటికి సంబంధించిన కుటుంబ సమస్యలు, సంతోష, అనురాగాలతో బాటు, బడి చదువులు, ఆట పాటలు, స్కూలుకు వెళ్ళే దారిలో వారు చూస్తున్న మార్కెట్, ట్రాఫిక్ వత్తిడి, యాక్సిడెంట్స్, గారడీలు, స్కూలుబస్సు, ఐస్‌క్రీమ్ సెల్లర్, బెలూన్ సెల్లర్, బండి మీద వేరుశనగకాయలు అమ్ముకొనేవారు, ట్రాఫిక్ పోలీసు, పోస్టుమాన్, గాలిపటాల ఆటలు, క్రికెట్, దూరదర్శన్ వంటి చిత్రాలు వేసి పంపేరు.





భోజనశాల దృశ్యం.



ప్రకృతిలోని ఫలపుష్పాలను, పశు పక్షుల అంద చందాలను కూడా వారు చిత్రించారు.

వారికి చిత్రకళ నేర్పే టీచర్లు యిచ్చే శిక్షణను బట్టి బాలలు, వ్యాక్సు కలర్స్, ఆయిల్ పెన్సిల్సు, వాటర్ కలర్స్, పోస్టరు కలర్స్‌ను వాడారు. ఇందులో 5 సంవత్సరముల నుండి 16 సంవత్సరముల వయస్సు గల బాలబాలికలు తమ శక్తి కొలది చక్కని చిత్రాలను వేసి పంపారు. ఈ ఏటి అఖిల భారత స్థాయి ఉత్తమ చిత్రంగా మన రాష్ట్రంలోని అమలాపురం సెంట్ జాన్సు హైస్కూలు విద్యార్థి చి. కోటబాలయోగి (16 సం.) వేసిన 'గోపికా కృష్ణులు' అనే నీటి రంగుల చిత్రం ఎన్నికైనది. దీనికి నికేతన్ వారు కెప్టెన్ వై. విజయ ప్రసాద్ స్మారక గోల్డ్‌మెడల్‌ను బహుకరించారు. బాలల విభాగంలో ప్రతి రాష్ట్రానికి ఒక ఉత్తమ చిత్రాన్ని ఎంపిక చేసి ఆ పిల్లలకి రజత పతకాలను బహుకరించారు. అవి లూధియానాకి చెందిన చి. సుఖ్‌సంగమ్ సాహికి, అగర్తలాకి చెందిన కుమారి మనేమితాదాన్‌కి, బెంగుళూరికి చెందిన కుమారి కస్తూరి చంద్రశేఖర్‌కి, మద్రాసుకి చెందిన కుమారి జె. ఉమామహేశ్వరికి, బొంబాయికి చెందిన త్యాబ్‌జీ అన్వర్‌కి, హైదరాబాదుకు చెందిన ప్రవీణ్ సాయికి, కలకత్తాకి చెందిన నూరజలబిస్వాస్‌కి, నాగపూర్‌కి చెందిన మనోజ్ దేవాంశికర్‌కు, హర్యానాలోని గుర్‌గామ్‌కి చెందిన కుమారి నీలమ్‌గులాటీకి, మహారాష్ట్రకి చెందిన కుమారి అనితా సాంఖ్యికి, భోపాల్‌కి చెందిన జితేంద్ర సాగ్నేనాకి లభించినవి.



వీరు నిర్వహించిన బాలల, యువజనుల, ప్రౌఢ చిత్ర కళా పోటీలలో బహుమతులు పొందిన చిత్రాలన్నిటినీ మహాసభల సందర్భంగా రెండు గదులలో తీర్చిదిద్దేరు.



ఈ వర్ణ చిత్రాల ప్రదర్శనను వివిధ జిల్లాలకు చెందిన వేలాది ఉపాధ్యాయులు చూసి, బాల బాలికల లోని, యువకులలోని, ప్రౌఢవయసు వారిలోని చిత్రకళా నైపుణ్యాన్ని ప్రోత్సహించటానికి నిరంతరం కృషి చేస్తున్న ఈ చిత్రకళానికేతన్ వారిని అభినందించారు.

## గురువు !



– శ్రీ యానాల ఇంద్రసేనారెడ్డి
చిరుమర్తి, నల్గొండ జిల్లా

గురువు అంటే గుణాల నిచ్చే కల్ప తరువు
ఆకల్పతరువుకు రారాదు కరువు
కరువు వస్తే జాతికే కన్నీటి చెరువు
ఆ పై భావితరాల బ్రతుకే బరువు !

## నిలదీసి అడుగు !



– శ్రీ జి.కె. వీరాంజనేయులు
పెదకూరపాడు, గుంటూరు జిల్లా

క్లాసులు క్లబ్బు చేసి గబ్బు చేసే కంటే
సంతమార్కెట్‌గా మార్చి చదువుకు సున్నా చుట్టే కంటే
నిరుద్యోగులకు ఉపాధి కల్పించి
నిలువనీడ ఎందు కివ్వరు ?
విద్యా విలువల్ని పెంచే
సద్యో చర్యలు ఎందుకు తీసుకోరు ?



ప్రారంభ సభ

# విద్యా స్వరాజ్యం కోసం ఉద్యమించండి!

– జస్టిస్ కృష్ణయ్యర్, సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి

ఆంధ్రప్ర... ...యాలలనుండి వేల సంఖ్యలో నెల్లూరుకి ఉపాధ్యాయులు తరలివచ్చారు. జాతి భ...ష్యత్తును తీర్చి దిద్దడంలో కీలకపాత్ర నిర్వహించే విద్యారంగం ఎదుర్కొంటున్న సమస్యలను రానున్న మూడురోజులలో చర్చించి ఎన్నో ముఖ్యమైన నిర్ణయాలు చేస్తారని ఆశిస్తున్నా. ఉపాధ్యాయులు జాతి నిర్మాతలు గనుక జాతీయ సమస్యలు ఉపాధ్యాయులకు సంబంధించని సమస్యలు కావు.

## దారితప్పిన విద్యా రంగం

దేశం క్లిష్ట పరిస్థితులలో వున్నది. జాతి ఏ దిశలో పయనిస్తుందో నాకు అర్థం కావడంలేదు. మనం ఎక్కడో దారితప్పాం. జాతిని సరియైన మార్గంలోకి మరల్చవలసిన బాధ్యత ఉపాధ్యాయుల మీద వుంది. నిర్మాణం క్రిందినుంచే ప్రారంభమవుతుంది. వ్రాయడం, చదవడం నేర్పడమే కాదు, అంతకంటె ప్రాముఖ్యత గల విషయాలను కూడ ఉపాధ్యాయులు అవగతం చేసుకోవాలి. మీరు విద్య నేర్పుతున్నది కొద్దిమంది బిడ్డలకే గాదు, ఒక జాతికి, ఈ దేశానికి.

ఒకప్పుడు 'విద్య బోధించడమంటే దేశభక్తి ప్రేరేపించడం' అనే నినాదం వున్నది. ఆ నినాదానికి ఈనాడు యింకా ప్రాముఖ్యత పెరిగింది. ఉపాధ్యాయులుగా ముందుకి రండి. ఆర్థికశాస్త్రాన్ని అధ్యయనం చేయండి. సామాజిక శాస్త్రాన్ని అధ్యయనం చేయండి. రాజకీయాలను అధ్యయనం చేయండి. దేశం దారి తప్పడానికి కారణాలను అధ్యయనం చేయండి. మనం వివిధ రంగాలలో పురోగమించడానికి మారుగా ఎందుకు తిరోగమిస్తున్నాం? మన జాతీయ విధానాలేమిటి? ప్రపంచ నిరక్షరాస్యులలో సగానికి పైగా భారతదేశంలోనే ఎందుకున్నారు. స్వతంత్రం సాధించి 42 ఏళ్లు గడిచినప్పటికి యింకా నిరక్షరాస్యతను ఎందుకు నిర్మూలించ లేక పోయాం?

## తిరోగమిస్తున్న విద్యా రంగం

స్వాతంత్ర్యం సాధించిన తరువాత మన రాజ్యాంగం అమలులోకి వచ్చిన తరువాత 10 సంవత్సరాలలో నిరక్షరాస్యత నిరూలిస్తామని మన రాజ్యాంగంలోని 45 వ ఆర్టికలులో వ్రాసుకొన్నాం. ఇక 50 సంవత్సరాలకైనా నిరక్షరాస్యతకు నిరూలించగలమా? నిరక్షరాస్యతా నిర్మూలనా పథకం పురోగమించడానికి మారుగా తిరోగమిస్తున్నది. ఎందుకు? మనం ఈ దిశలో ఎలాంటి కృషి చేశాం? అందరినీ అక్షరాస్యులను చేయడం ప్రజాస్వామ్యం ప్రథమ కర్తవ్యం. సోవియట్ నూరు శాతం అక్షరాస్యతను సాధించింది. క్యూబా సాధించింది. సోషలిస్టు దేశాలు సాధించాయి. యుద్ధము, దోపిడీలకు గురయి అమెరికా ఆక్రమణలో వున్న దక్షిణకొరియా ...న్నదేశం, సోషలిస్టు దేశమూ కాదు. అయినా 97 శాతం అక్షరాస్యతను సాధించి... మన దేశానికి పట్టిన దౌర్భాగ్యమేమిటి? నెహ్రూ దేశం, గాంధీ + గాంధీ + గాంధీ దేశంలో 70 శాతం నిరక్షరాస్యత ఎందుకు కొనసాగుతున్నది? మనం ఎక్కడ దారి దప్పాం. ఏదో తీవ్రమైన జబ్బు మనదేశాన్నే పట్టిపీడిస్తున్నది. రోగ నిర్ణయం చేసి వైద్యం చేయకపోతే దేశం అంధకార బంధురం అవుతుంది.

## చిత్తశుద్ధి లోపించిన పాలకవర్గాలు

నిరక్షరాస్యతను నిర్మూలించాలన్న చిత్తశుద్ధి పాలకవర్గాలకు లేదు. నిరక్షరాస్యులున్న దేశాన్ని పాలించడం సులభం. నిరక్షరాస్యులైన ప్రజలు హేతుబద్ధంగా ఆలోచించలేరు. తమ కష్టాలకు, కన్నీళ్ళకు కారణాలేమిటో ప్రశ్నించలేరు. అందుకే పాలకులు నిరక్షరాస్యతని గురించి మాట్లాడుతారు. విద్యని గురించి మాట్లాడుతారు. కాని నిరక్షరాస్యతను పదిలంగా కాపాడతారు. పాలకవర్గం వారి ప్రయోజనాలను కాపాడుకొనడానికి కాకపోతే ఎందుకిలా చేస్తున్నట్లు? రాధాకృష్ణన్ కమీషన్, కొఠారీ కమీషన్ వగైరా కమీషన్ల మీద కమీషన్లని నియమించడం జరిగింది. ఇన్ని కమీషన్లని నియమించి నిరక్షరాస్యతని పెంచారు. ఆ పైన ఇటీవల కలవారికుపయోగించే నూతన విద్యా విధానం ప్రవేశ పెట్టబడింది. నిరక్షరాస్యతను నిర్మూలించాలనే చిత్తశుద్ధి పాలకవర్గానికి లేదని కార్యాచరణ స్పష్టం చేస్తున్నది.

నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్య అందజేయాలని, నిరక్షరాస్యతను 1960 నాటికి నిర్మూలించాలని రాజ్యాంగంలో వ్రాసుకొన్నాం. 1950లో కేంద్రబడ్జెటులో విద్యకి 7.2 శాతం నిధులు కేటాయించడంతో ప్రారంభించాం. ఈనాడు 1.2 శాతానికి దిగజారింది. విద్యారంగానికి పాలకవర్గం యిచ్చే ప్రాధాన్యతను ఈ నిధులకోత స్పష్టం చేస్తున్నది. ఇలా ఎందుకు జరుగుతున్నది? మీరు ఉపాధ్యాయులు, దీని ఫలితాలు ఎలా వుంటాయో అంచనా వేయగల మేధావులు. కేంద్రబడ్జెటులో విద్యా రంగానికి 10 శాతం నిధులు కేటాయించకపోతే నిరక్షరాస్యతను నిర్మూలించడం ఎప్పటికీ సాధ్యం కాదు.

ప్రజలను ఆలోచనా పరంగా ఎదగడానికి తోడ్పడే విద్యని నిర్లక్ష్యం చేస్తూ అణుపరీక్షలకు ఎక్కువ నిధులు కేటాయింపబడు తున్నాయి. ప్రజల జఠరాగ్నిని చల్లార్చేందుకు కృషి చేయాలిగాని 'అగ్ని'ని ప్రయోగించడానికి కాదు. మన శాస్త్రవేత్తల ప్రజ్ఞా పాటవాలు గర్వించ దగ్గవి. శాస్త్ర విజ్ఞాన పురోగమనానికి మనం వ్యతిరేకులం కాదు. మన శాస్త్రవేత్తలు ప్రతిభావంతులు గనుకనే అమెరికా లాంటి అభివృద్ధి చెందిన దేశాలలో కూడా వారికి గిరాకీ వున్నది. వారి సేవలను అమెరికా

ఉపయోగించుకొంటున్నది . కాని దేనికి ఎక్కువ ప్రాధాన్యత యివ్వాలి ? మన లక్ష్యం ఏమిటి? అభివృద్ధి, సామాన్య మానవుల అభివృద్ధి మానవుల శక్తియుక్తులను విద్యద్వారా అభివృద్ధి పరచి వినియోగించు కొనగలిగినప్పుడే దేశాభివృద్ధి సాధ్యపడుతుంది. మానవ వనరులను అత్యంత శక్తివంతమైనవిగా దేశాభివృద్ధికి తోడ్పడేవిగా గుర్తించక పోవడం పాలకవర్గం యొక్క అజ్ఞానాన్ని వ్యక్తం చేస్తుంది. విద్యావంతమైన జాతి విప్లవకరమైన జాతి అవుతుంది. అందుకే పాలకవర్గం నిరక్షరాస్యులను పెంచి పోషిస్తున్నది. ప్రజలు చైతన్యవంతులు కావడం పాలకవర్గం సహించలేదు. 'అధికారాలన్నీ ప్రజలకే' - అనే దాన్ని ఒక నినాదంగా ఉపయోగించుకొంటున్నది పాలకవర్గం. కాని ప్రజలు అధికారాన్ని చేజిక్కించుకొనడం ప్రారంభిస్తే ఆశ్చర్యకరమైన పరిణామాలు సంభవిస్తాయి. ప్రజలే చరిత్ర నిర్మాతలు.

## నిరక్షరాస్యతా నిర్మూలన అసాధ్యమా?

నూరుశాతం అక్షరాస్యతను సాధించడం అసాధ్యమా? భారత రాజ్యాంగ రచయితలు రాజ్యాంగంలోని ఆర్టికల్ 45 లో పొందుపరచిన నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్య ఆచరణ సాధ్యం కాదా? సంకల్పం వుంటే అన్నీ సుసాధ్యాలే!

కేరళ రాష్ట్రంలోని ఎర్నాకులం జిల్లా ప్రజలందరినీ అక్షరాస్యుల్ని చేసే కార్యక్రమం జిల్లా ప్రజలు చేపట్టారు. జిల్లాలో 70 శాతం అక్షరాస్యులు. మొత్తం నిరక్షరాస్యుల సంఖ్య 3 లక్షలు. ఈ ప్రజా ఉద్యమాన్ని విజయవంతం చేయడానికి 15000 మంది విద్యావంతులు స్వచ్ఛందంగా ముందుకి వచ్చారు. జిల్లా కలెక్టరు యితర అధికారులు ప్రోత్సాహం లభించింది. ఈ ఉద్యమానికి కేరళ శాస్త్ర సాహిత్య పరిషత్తు సహకరిస్తున్నది. అంతేగాదు బిషప్పులు, ముల్లాలు సహకరిస్తున్నారు. అచట చదువుకొనడానికి వచ్చే బిడ్డలు, పెద్దలు అంతా పగలంతా కష్టించి పనిచేసేవారే. ఎర్నాకులం జిల్లాలో నూరుశాతం అక్షరాస్యతను 26 జనవరి 1990 నాటికి అంటే రెండు సంవత్సరాలలో సాధించగలుగుతాము. ఇది ఒక ప్రజా ఉద్యమంగా సాగుతున్నది. నిరక్షరాస్యతను నిర్మూలించడానికి మనం ప్రజలపై విశ్వాసం వుంచాలి. ప్రజల వద్దకు వెళ్లాలి. వారిని కదిలించాలి. కదిలిన ప్రజలు, ఉద్యమించిన ప్రజలు అద్భుతాలను సాధించగలరు.

## నిర్లక్ష్యం చేయబడుతున్న బిడ్డలు

ఈ నాడు దేశంలో 5 - 14 వయోపరిమితిలో నున్న బిడ్డలలో 5 కోట్ల మంది వివిధ కర్మాగారాలలో కంట్రాక్టర్ల వద్ద యింకా వివిధ రకాల పనులు చేసుకొంటూ .. పొట్ట పోసుకుంటున్నారు. నవ్వుతూ, త్రుళ్ళుతూ, కేరింతలు గొడుతూ ఆటపాటలతో విద్యా బుద్ధులు నేర్చుకొనవలసిన బిడ్డలు నికృష్టమైన పరిస్థితులలో పడరాని పాట్లు పడవలసిన పరిస్థితులు ఎంత దారుణమో ఆలోచించండి. ఎదగవలసిన మానవ మేధస్సు ఎంత గిడసబారిపోతోందో, మానవ వనరులు ఎంతగా వృధా అవుతున్నాయో, జాతి పురోగతి ఆటంక పరచబడుతుందో ఆలోచించండి.

## అన్నీ పేపర్ల మీదే!

ప్రతి విషయాన్ని గురించి ప్రశ్నలు వేసి తెలుసుకోవాలనే ఆసక్తి బిడ్డలకు వుంటుంది. బిడ్డలు చదువుకొనడానికి అవకాశాలు కల్పిస్తే సమాజంలోని అస్తవ్యస్త పరిస్థితుల్ని గురించి ప్రశ్నిస్తారు. కొద్దిమంది వ్యక్తుల చేతులలోనే భూమి ఎందుకు కేంద్రీకరింప బడింది? తరతరాల నుండి కష్టించి పనిచేస్తున్నా మా బ్రతుకులు ఎందుకింత అధ్వాన్నంగా వున్నాయి? కనీసం కనీస వేతనాల చట్టం ఎందుకు తీసికొనిరారు? వెట్టిచాకిరి ఎందుకు కొనసాగు తున్నది? ప్రకృతి వనరులలో మా వాటా ఏమిటి? - లాంటి ప్రశ్నలు వేస్తారు. ఇలాంటి ప్రశ్నలకు యిప్పుడు పెత్తనం చలాయిస్తున్న పెద్దలు ఏం చెప్పవలసి వుంటుంది? "అవును భూముల్ని పంచాం. వెట్టి చాకిరిని నిర్మూలించాం, అది చేశాం, ఇది చేశాం. కాని అన్నీ పేపర్ల మీదే" అని చెప్పవలసి వుంటుంది. బిడ్డలు భయం భయంగాబెరుకు బెరుగ్గా నమ్రతతో ఈ దోపిడీ సమాజపు ఇనుప పాదాల క్రింద పడి నలిగి నుజ్జు నుజ్జయి పోవాలని కోరుకొనే వారు విద్యను గురించి మాట్లాడతారు. విద్యా వ్యాప్తిని నిరోధిస్తారు.

## కలవారి విద్య - కాని వారి విద్య

'భారతదేశం భవిష్యత్తు తరగతి గదులలో రూపొందింపబడుతుంది' అని కొఠారి కమీషన్ చెప్పింది. ఎంత గొప్పగా చెప్పింది? కాని జరిగిందేమిటి? భవిష్యత్తును రూపొందించే 'తరగతి గదులే లేకపోవడం!' ఇక 1989 నాటి పరిస్థితి ఏమిటి? ఆపరేషన్ బ్లాకు బోర్డు పథకం ప్రవేశ పెట్టడం. తరగతి గదులు లేని, బ్లాకు బోర్డులు లేని, సీమసుద్ద ముక్కలు లేని పాఠశాలలు వుండడం మనందరికీ సిగ్గుచేటు గాదా? ఏ రాజకీయ పార్టీకి వ్యతిరేకంగా గాని అనుకూలంగా గాని నేను మాట్లాడడం లేదు. మనకు ఏం చెప్పారు? నిర్బంధ ప్రాథమిక విద్య అందరికీ అందజేస్తామని, కాని ఇప్పుడేం చేస్తున్నారు. నవోదయ పాఠశాలలు అవీ జిల్లా కొకటి మాత్రమే పెడుతున్నారు. విద్యాబోధనలో కూడా డూన్ స్కూలు, ఇంగ్లీషు మీడియం స్కూలు, నవోదయ స్కూలు లాంటివి సంపన్న వర్గాలకు, తరగతి గదులు లేని, బ్లాకు బోర్డులు లేని, సీమసుద్దముక్కలు లేని పాఠశాలలు సాధారణ ప్రజానీకానికి ఏర్పాటు చేసి విద్యాబోధనలో కూడ వివక్షత పాటించడం గర్హనీయం. మహాత్మాగాంధీ అంత్యోదయ పాఠశాల నినాదం యిచ్చారు. అంటే సమాజంలో అట్టడుగున వున్నవారికి విద్య నందించే పాఠశాల. కాని ఈ గాంధీగారు జిల్లా కొకటిగా - అదీ వంద మందికి మాత్రమే చదువు చెప్పే నవోదయ పాఠశాలలు ప్రారంభించారు. విద్యా రంగంలో ఈ వివక్షత అంతరించాలి. అన్ని వసతులతో నవోదయ పాఠశాల జిల్లా కొకటి గాక గ్రామానికొకటి పెట్టగలిగితే అది ఆహ్వానింపదగిన పరిణామమే.

బిడ్డలను బడికి పంపక పోవడానికి, మధ్యలో చదువు మాన్పించడానికి ప్రధాన కారణం పేదరికం. తమిళనాడు ప్రభుత్వం మధ్యాహ్నభోజన పథకం అమలు జరుపుతూ అక్షరాస్యతను కొంతవరకు పెంచగలిగింది. అలాగే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. బీహారు, మధ్యప్రదేశ్ల పరిస్థితి ఆందోళనకరం. షెడ్యూలు కులాలు, షెడ్యూల్డు తెగలవారు పూర్తిగా విస్మరింపబడుతున్నారు.

## స్త్రీ విద్య – నిర్లక్ష్యం

పురుషాధిక్యత నెలకొనివున్న ఈ సమాజంలో స్త్రీలు ఉద్దేశపూర్వకంగా నిరక్షరాస్యులుగా వుంచబడుతున్నారు. పురుషుల అక్షరాస్యతా శాతం 30. స్త్రీల అక్షరాస్యతా శాతం 15. ఒక స్త్రీకి విద్య నేర్పితే ఒక కుటుంబానికి విద్య నేర్పినట్లే. స్త్రీలలో నిరక్షరాస్యత ఎక్కువగా వుండడం వలననే వ్యభిచారం, దేవదాసీలు, సతీసహగమనం – లాంటివి యింకా కొనసాగుతున్నాయి. కాబట్టి స్త్రీ విద్యకు అత్యంత ప్రాధాన్యత యివ్వాల్సిన అవసరం వున్నది.

## మేధోవలస

విద్యద్వారా ప్రజలలో మానవతా దృక్పథాన్ని శాస్త్రీయ దృక్పథాన్ని పెంచాలని, ప్రజలు కులమతాల కతీతంగా వ్యవహరించే విధంగా విద్యా విధానాన్ని తీర్చిదిద్దాలని రాజ్యాంగంలోని 51వ ఆర్టికల్‌లో వ్రాసుకొన్నాం. నోబెల్ బహుమతి గ్రహీతయైన శాస్త్రవేత్తకు మానవతా దృక్పథం లోపిస్తే అతడు సామాన్యుని కంటె ఎక్కువ ప్రమాదకారి కావచ్చు. మానవతా దృక్పథం లోపిస్తే అతడి శాస్త్ర విజ్ఞానం విధ్వంసకాండకు దోహదపడుతుంది. అలాగే నిపుణుడైన డాక్టరు మానవతా దృక్పథం, శాస్త్రీయ దృక్పథం లోపిస్తే మానవతా విలువల్ని మంటగలిపి రోగుల శరీరాలలో కాలేయాలు, కళ్ళు వగైరాలను విడి భాగాలుగా అమ్ముకొని డబ్బు చేసికొనే ప్రమాదం వుంది. ఉన్నత విద్య నభ్యసించిన వారు, వారి ప్రతిభకు మన దేశంలో గుర్తింపు లభించడం లేదనే సాకుతో విదేశాలకు వలస పోతున్నారు. ఈ విధంగా పరిణితి చెందిన మేధాసంపద ఎగుమతి చేయబడుతున్నది. దీనిపై ప్రభుత్వం ఎందుకు నిషేధం విధించదు? మనకు మేధావులు ఎక్కువయ్యారా! దేశం వీరి సేవలను వినియోగించుకోనవసరం లేకుండా శాస్త్ర విజ్ఞానం సాంకేతిక రంగాలలో ముందుకు పోతుందా? విద్య విజ్ఞానంతో పాటు జాతీయ భావాలు దేశభక్తి అలవడి వుంటే మేధావులు విదేశాలకు తరలి వెళ్లరు. కాబట్టి విద్య జాతీయ భావాలను దేశభక్తిని, మానవతాదృక్పథాన్ని శాస్త్రీయ దృక్పథాన్ని పెంచేదిగా వుండాలి.

## వృత్తి విద్య

మానవతా విలువలను పూర్తిగా విస్మరించి బహుళ జాతి సంస్థలకు చౌకగా శ్రామికులను సరఫరా చేసే విధంగా వృత్తి విద్యలు రూపొందింపబడుతున్నాయి. ఇదే తైవాన్‌లో జరిగింది. కొరియాలో జరిగింది. ఈనాడు ఇండియాలో జరుగుతున్నది. దీనినే అభివృద్ధి అంటున్నారు. మన ఆర్థిక పరిస్థితులు బహుళజాతి సంస్థల ప్రభావంలో నియంత్రణ చేయబడుతున్నాయి. జాతీయ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని అందరికీ ఉపాధి కల్పించే విధంగా వృత్తి విద్యా విధానం రూపొందింపబడాలి.

## విద్యా స్వరాజ్

మనదేశం వివిధ మతాలకు, సంస్కృతులకు నిలయం. ప్రాచీన సంస్కృతి నాగరికతలు విలసిల్లిన దేశం మనది. ఈ నాడు సామ్రాజ్యవాదుల ప్రోత్సాహంలో విచ్ఛిన్న కరశక్తులు వేర్పాటు వాద శక్తులు విజృంభించి దేశ సమగ్రతకు దేశ సమైక్యతకు ముప్పు తెచ్చి పెడుతున్నాయి. సమగ్ర భారత దేశాన్ని పునర్నిర్మించవలసిన బృహత్తర కర్తవ్యం ఈ నాటి మేధావుల, భుజ స్కంధాలపై వున్నది. దేశంలో విద్యా స్వరాజ్యం కోసం యుద్ధం అవసరం. ఈ యుద్ధమే భారత ద్వితీయ స్వరాజ్య పోరాటం కావాలి. రానున్న మూడు రోజులలో దేశ పునర్నిర్మాణానికి అవసరమైన విద్యావిధానాన్ని ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ చర్చిస్తుందని ఆశిస్తున్నాం.



## బాల్యం

– శ్రీ పి. నరసింహశర్మ,
శంఖవరం, తూ.గో

చదువుల ఆట తప్ప
ఏమీ తెలియని
ఆ చిఱుప్రాయమే నయం !

ఇప్పట్లా కులం దుప్పట్లో దాక్కోనక్కర లేదు
మతం కుంపటి దగ్గర చలి కాగ నక్కర లేదు
సాయం సంధ్య అలుం కున్నప్పుడల్లా
అహమ్మద్ తోను, ఆంథోనీ తోనూ ఆటలు మొదలు
మెదళ్ళు తినేస్తున్న ఈ ఆచారాలు
అప్పుడు మా స్నేహానికి దూరంగా ఉండేవి
మళ్ళీ మళ్ళీ ఆ బాల్యం వస్తే ఎంత బాగుండును?
తుళ్ళి తుళ్ళి తూనీగల్లా ... ఓహ్ !

విద్యా గోష్ఠి

# "టీచర్లకు శాస్త్రీయ ఆలోచన అవసరం"

- శ్రీ టి. వెంకారెడ్డి,
డైరక్టర్, పాఠశాల విద్య



శర వేగంతో ముందుకు పోతున్న శాస్త్ర సాంకేతిక రంగాలకు అనుగుణంగా విద్యారంగం కూడా పురోగమించాలి. సర్వశాస్త్రాలకు, విజ్ఞానానికి వేదాలే ప్రమాణమని ఈ నాటికీ విశ్వసించే కొందరు ఉపాధ్యాయులుండటం శోచనీయం. అది శాస్త్రీయ ఆలోచనతో కూడిన పురోగామి దృక్పథం కాదు. అట్టి శాస్త్రీయ ఆలోచన అవసరాన్ని గుర్తించి ఉపాధ్యాయుల్ని వారి వృత్తి పరమైన సమస్యలపై సమీకరించటమే గాక, విద్యా సంబంధ అంశాల పరిజ్ఞానాన్ని ప్రమాణాలను వారిలో పెంపొందించేందుకు యు.టి.యఫ్. 'అకడమిక్ సెల్' స్థాపించి కృషి చేయటం హర్షణీయం.

ఇటీవల కాలంలో కాన్వెంటులు, రెసిడెన్షియల్ పాఠశాలలు విపరీతంగా పెరిగాయి. ప్రస్తుత విద్యా వ్యవస్థకు పోటీ వ్యవస్థగా తయారయ్యాయి. పరిచయం లేని వ్యక్తులు బోర్డులు పెట్టి 'పాస్ గ్యారంటీ ... లేకపోతే ఫీజులు వాపస్!' అంటూ వివిధ రకాలుగా ప్రచారాలు చేస్తున్నారు. ఇలాంటి ప్రచారాలను అరికట్టేందుకు ఉపాధ్యాయులు అంకితభావంతో పనిచేయాల్సిన సమయం ఆసన్నమయింది. ప్రస్తుతం నడుస్తున్న ప్రభుత్వ పాఠశాలలు తల్లిదండ్రుల ఆశల మేరకు పనిచేయలేక పోవడం కూడా ఇందుకు కారణమే. అందువల్ల ప్రజల ఆశలకు, అవసరాలకు తగినట్టు విద్యా వ్యవస్థ మారి తీరాలి. పాఠశాలలో నేర్పే విద్యకు, సామాజిక అవసరాలకు సంబంధం ఉండాలి. అందుకే సోవియట్‌లో ఆర్థిక, పారిశ్రామిక, పాలనావసరాలకు అనుగుణ విద్యను పాఠశాలలో బోధిస్తు న్నారు. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ప్రాథమిక విద్యా రంగంలో ఉపాధ్యాయ సంఘాల సూచనలు, సలహాలు ప్రభుత్వానికి ఎంతో అవసరం. అందుకే విద్యా సంస్థల్ని నడపడంలో, విధాన నిర్ణయాల్లో ఉపాధ్యాయుల్ని భాగస్వాముల్ని చేయాలని మన ముఖ్యమంత్రి ప్రతిపాదించారు. కాన - ఉపాధ్యాయ సంఘాలు చేసే సూచనల్ని ప్రభుత్వం తప్పక పరిగణనలోనికి తీసుకొంటుంది.

ప్రస్తుతం 'మాస్ టీచర్స్ ఓరియంటేషన్ ప్రోగ్రాం' పేరుతోను, 'డిస్ట్రిక్ట్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎడ్యుకేషన్ ట్రయినీ' పాఠశాల క్రింద టీచర్లకు ప్రత్యేక శిక్షణ ఇచ్చేందుకు రాష్ట్ర ప్రభుత్వం కృషిచేస్తున్నది. ఇందుకు కోటి రూపాయలు ఖర్చవుతున్నది. ఈ శిక్షణ వల్ల విద్యారంగంలో వచ్చే అయిదేళ్ళలో మంచి ప్రగతి సాధించగల్గుతాము. కొన్ని జిల్లాల్లో మూడున్నర కోట్ల రూపాయల కేంద్ర ప్రభుత్వ సాయంతో వైజ్ఞానిక శిక్షణ కేంద్రాలు కూడా ఏర్పాటు చేయబోతున్నాము.

రాష్ట్ర ప్రభుత్వం అమలు చేస్తున్న 'దృశ్య శ్రవణ పరికరాల ద్వారా విద్యా బోధన' శాస్త్రీయంగా ప్రవేశ పెట్టటం జరిగింది. ఈ విద్యా బోధనను ఉపాధ్యాయులు శాస్త్రీయ అవగాహనతోనే చూడాలి. ఈ పద్ధతి విద్యా బోధనకు ఎంతో ఉపయోగకరం.

పరీక్షల నిర్వహణలో ఉపాధ్యాయులు ప్రత్యేక శ్రద్ధ వహించి, అవినీతికి ఆస్కారం లేకుండా కర్తవ్య నిర్వహణలో ఆదర్శ ప్రాయులు కావాలి. మనం బోధించే పాఠ్యాంశాలు విద్యార్థి అభివృద్ధికి ఎంత వరకు తోడ్పడతాయో, సిలబస్ నిర్ణయించేప్పుడు అది విద్యార్థి భవితవ్యానికి ఎంత వరకు ఉపయోగపడుతుందో ఆలోచించి మీ సూచనల్ని ప్రభుత్వానికి అందించండి.

రాష్ట్రంలో 48 వేల ప్రాథమిక పాఠశాలలున్నాయి. జాతీయ విద్యా విధానం అమలులో భాగంగా 250 మంది జనాభాకు ఒక పాఠశాల ఏర్పాటు చేయటం జరిగింది. వీటిని సమర్థవంతంగా మనం నడపాలి.

మధ్యాహ్నభోజన ప్రారంభ సమయంలో ఉదయం తొమ్మిది గంటలకే పాఠశాలల్ని ప్రారంభించాలని ఆదేశించటం జరిగింది. అయితే సమయాన్ని మార్చమని ఉపాధ్యాయులు డిమాండ్ చేయడం సమంజసంగా లేదు. శాస్త్రీయంగా ఈ విషయాన్ని విశ్లేషించి చెప్పే పక్షంలో దాన్ని తప్పక పరిశీలిస్తాము.

ప్రజల మాతృభాష తరగతి గదుల్లో బోధింపబడటంతో పాటు, దానిని అధికార భాషగా చేసి, అన్ని రంగాలలో ప్రవేశ పెట్ట నంతకాలం పరభాషా వ్యామోహం పోదు. కాన్వెంటుల మోజుకు అదే విరుగుడు.

ఈ అన్ని విషయాలను మీ 'అకడమిక్ సెల్' ద్వారా చర్చించి తగిన నిర్ణయాలు తీసుకోండి. నిర్మాణయుత సూచనలు అందించండి. అంకితభావంతో పనిచేసి కర్తవ్య దీక్షతో ముందుకు సాగండి!



## ఇదేం వైద్యం ?

- శ్రీ యం. సత్యనారాయణ
చీరాల, ప్రకాశం జిల్లా

చదువులమ్మ
కడుపులో పుండుతో కళ్లనీళ్లు పెట్టుకొంటే
రాజకీయ డాక్టర్లు
"ఎక్సరే" తీసి అసలు రోగానికి చికిత్స చేయక పోగా
చక్కగా కన్పించే చారెడేసి కళ్లకు
360 జి.ఓ. తో మేజర్ ఆపరేషన్ చేశారు
కడుపులో పోటు మాటేమోగాని
కళ్ల చూపు మాత్రం కొడిగట్టి పోయింది!



# విద్యా, సాంస్కృతిక రంగాల ద్వారా సోషలిజంపై సామ్రాజ్యవాదుల దాడి!

**యం. జె. మాణిక్యారావు,** ఫ్యాక్టా అధ్యక్షులు

ప్రపంచ శాంతి పరిరక్షకునిగా ఉన్న సోషలిస్టు వ్యవస్థను యుద్ధం ద్వారా ఎదుర్కోవటం సాధ్యం గాదని తెలుసుకొన్న సామ్రాజ్యవాదులు విద్యా సాంస్కృతిక రంగాల ద్వారా సోషలిస్టు వ్యవస్థపై దాడికి పాల్పడుతున్నారు. సోషలిజాన్ని నాశనం చేయటానికి అమెరికా సామ్రాజ్యవాదులు, వారి ఏజంట్లు విద్యార్థుల్లో జొరబడి సృష్టిస్తున్న కల్లోలం చైనాలో మనకు స్పష్టంగా కన్పిస్తోంది.

ఎక్కడైనా చూడండి. వర్గ రాజకీయాలకు అతీతంగా విద్య ఉండజాలదు. సమాజ అభివృద్ధికి విద్య ప్రధాన మయింది. అటువంటి కీలకమైన దాన్ని కూడా స్వార్థ పర వర్గాలు తమ ప్రయోజనాలకే ఉపయోగించుకొంటాయి. సోషలిజం ఉంటే విద్యా విధానం కూడా దానికనుగుణంగా రూపొందుతుంది. పెట్టుబడిదారీ విధానం, భూస్వామ్య విధానం ఉంటే విద్యను తమ ప్రయోజనాలకే మల్చు కొంటుంది.

మన దేశంలో టాటా, బిర్లా వంటి బడా గుత్తపెట్టుబడి దారుల ఆస్తులు ఓ వైపు విపరీతంగా పెరిగి పోతున్నాయి. మరోవైపు అత్యధిక జనాభా దారిద్ర్యంలో మ్రగ్గుతున్నది. ఫలితంగా అన్ని రంగాల్లో విపరీత సంక్షోభం వ్యాపించింది. ఆ సంక్షోభానికి విద్యా రంగం కూడా గురి అయింది. దాని ఫలితమే ప్రబలిపోతున్న నిరక్షరాస్యత, నిరుద్యోగం, నిష్ట దరిద్రం.

విద్యారంగ అభివృద్ధికై కొఠారి కమిషన్ చేసిన పలు సిఫార్సులను బుట్టదాఖలు చేసిన కేంద్ర పాలకులు ఈ రోజు నూతన విద్యా విధానమనే ఓ గాకోరు విధానాన్ని ప్రవేశ పెడుతున్నారు. రాజీవ్‌గాంధీ ప్రబోధిస్తున్న నూతన విద్యా విధానం భారత దేశంలో రూపొందింపబడలేదు. ఇది సామ్రాజ్య వాదులకు ఊడిగం చేసేందుకు వారి నుండి దిగుమతి అయిన విధానం. 1986 ఫిబ్రవరిలో 'ఫోర్డ్ ఫౌండేషన్' అధికారి ఒకరు ఆ డాక్యుమెంట్ తయారుచేశారు. దానిలో ఉన్న సూచనల మేరకు రాజీవ్ నూతన విద్యా విధానం రూపొందింది. అత్యధిక పాఠశాలల్లో కనీస వసతులు లేని స్థితిలో కంప్యూటరీ విద్య ప్రవేశ పెట్టటం దగా తప్ప మరొకటి కాదు. నవోదయ పాఠశాలల పేరిట విద్యార్థుల్లో ప్రతిభ గలవారు, తెలివిమాలిన వాళ్లనే చీలిక తెచ్చేందుకు కుట్ర సాగుతోంది. స్వయం ప్రతిపత్తి కళాశాలల ఏర్పాటు, ఉద్యోగాలకూ డిగ్రీలకూ సంబంధం లేకుండా చేయటం, ప్రైవేటీ కరణకు, ఆశ్రిత పక్షపాతానికి అవినీతికి దారి తీస్తుంది. విద్యా వ్యాపారం మరింత విచ్చలవిడిగా సాగటానికి తోడ్పడుతుంది. అమెరికాలో 1853 లోనే 'లాండ్ హెూల్డ్ కళాశాల'లుండేవి. అదే విధంగా మన రాష్ట్ర ముఖ్యమంత్రి మరో అడుగు ముందుకు వేసి సహకార కళాశాలలు ఏర్పాటు చేస్తున్నారు.

అందువల్ల మొత్తంగా సమాజాన్ని, దాని పరిణామాలను మనం జాగ్రత్తగా విశ్లేషించి చూడాలి. ఈ వర్గ సమాజంలో ఎవరు ఎవరి పక్షాన నిలుస్తున్నారో, గమనించాలి.

విద్యావంతులై సమాజాన్ని ప్రభావితం చేయగల ఉపాధ్యాయులు దేశాభివృద్ధి ప్రపంచశాంతి, సమసమాజ స్థాపనకు ఈ పెట్టుబడ దారీ వ్యవస్థపై సమరశంఖం పూరించాలి. ఆ ఆశయాలు నెరవేరిన నాడే విద్యారంగం వికసిస్తుంది. దేశాభివృద్ధి కొనసాగుతుంది. ప్రజలందరితో పాటు మనకూ ముక్తి లభిస్తుంది.



## జాతీయ ఘోష !

– 'బాలు'
గంగవరం, ప్రకాశం జిల్లా

'జనగణమన' ప్రతి బడిలో ఓ పాట
'అధినాయక జయహే!' కీర్తించు ఆట
'భారత భాగ్య విధాత!' మార్పు కోరు మాట

... ... ...

జనాన్ని గంగలో కల్పు తున్నారు
నాయకులు వినాయకులవుతున్నారు
'భాగ్యవిధాత' భోజ్య విధాత అయ్యాడు
పంజాబులో ఉగ్రవాదం
సింధులోయలో బందూకనాదం
గుజరాత్‌లో 'రిజర్వేషన్' వివాదం
మరాఠీలో 'శివసేన' మతోన్మాదం
ద్రావిడ, ఉత్కళ, వంగలలో
హక్కులు హరించే కుతంత్రాల పన్నాగం
వింధ్య, హిమాచలాలలో
బందిపోటుల జోరు
యమునా గంగలలో
కాలుష్యపు హెూరు
కీర్తించండిక భరత మాతను!
నర్తించండిక భగ్న భవితను!

# విద్యా రంగ ప్రాధాన్యతకై పోరాటం

– శ్రీ కాంతి బిశ్వాస్
పశ్చిమ బెంగాల్, విద్యాశాఖామంత్రి



దేశ భాషలలో మృదు మధురమైనదిగా ప్రసిద్ధి గాంచిన తెలుగులో మాట్లాడలేని నా అశక్తతను మన్నించవలసిందిగా ముందుగా మిమ్మల్ని అభ్యర్థిస్తున్నాను. దేశ స్వాతంత్ర్య సాధనలోను ఆ తరువాత ఎన్నో ప్రజాతంత్ర ఉద్యమాలలోను అగ్రభాగాన నిలిచిన ఆంధ్రప్రదేశ్ ప్రజలకు, నా అభినందనలు. పశ్చిమ బెంగాల్ ప్రజల పక్షాన ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్‌కు నా శుభాకాంక్షలు అందజేస్తున్నాను. ఇది ఉపాధ్యాయులకు సంబంధించిన బహిరంగ సభ గనుక విద్యారంగానికి మాత్రమే పరిమితమై ప్రసంగిస్తాను.

భారతదేశంలో వివిధ రాష్ట్రాల విద్యామంత్రులందరి కంటె నేను ఎక్కువ కాలం విద్యాశాఖామంత్రిగా పనిచేయడం వలన విద్యారంగంలో వచ్చిన మార్పులకు నేను సాక్షిభూతంగా వున్నాను. భారతదేశములో ప్రస్తుతం నెలకొని వున్న పరిస్థితులలో ఉపాధ్యాయులమైన మనం ప్రధానపాత్ర నిర్వహించవలసి వున్నది.

## పెరుగుతున్న నిరక్షరాస్యత

ప్రపంచ జనాభాలో 16 శాతం భారతదేశంలో వున్నారు. కాని ప్రపంచ నిరక్షరాస్యులలో 44 శాతం భారతదేశంలో వుండడం దురదృష్టకరం. బాధాకరం. మనకు చాలా సిగ్గుచేటైన విషయం. 1951 జనాభా లెక్కల ప్రకారం నిరక్షరాస్యులు 31 కోట్లు, 1961 జనాభా లెక్కల ప్రకారం 33 కోట్లు, 1971 జనాభా లెక్కల ప్రకారం 37 కోట్లు, 1981 జనాభా లెక్కల ప్రకారం 44 కోట్లు, 1991 నాటికి నిరక్షరాస్యుల సంఖ్య ఎంతకు చేరుకుంటుందో ఆ భగవంతుడికే (అతడంటూ వుంటే) తెలియాలి.

## విద్య సమాజాభివృద్ధికి సోపానం

విద్యాభివృద్ధి చెందకుండా ఏ దేశం గాని ఏ జాతిగాని అభివృద్ధి చెందలేదు. 'తమసోమా జ్యోతిర్గమయ' అంటే అదే. విద్యలోనే మానవునికి పరిపూర్ణత సిద్ధిస్తుంది. అరబ్ దేశాలకు చెందిన మత గురువులు కూడా పాత రోజులలో ఆనాటి ప్రజలు చైనా పోవడాన్ని ప్రోత్సహించారు. వ్యవసాయకంగా, ఆర్థికంగా, వైజ్ఞానికంగా అభివృద్ధి చెందాలంటే అది విద్యాభివృద్ధి ద్వారా మాత్రమే సాధ్యపడుతుందని అన్ని దేశాల మేధావులు అంగీకరించే వాస్తవం.

## అందరికీ విద్య అందని గగన కుసుమం

దేశం స్వాతంత్ర్యం సాధించిన తరువాత 5 - 14 వయో పరిమితిలో గల బిడ్డలకు నిర్బంధ ఉచిత విద్య జరపాలని, విద్యాబోధన మాతృభాషలోనే జరగాలని అఖిల భారత కాంగ్రెసు 1906 లోనే తీర్మానం చేసింది. ఆ తరువాత జరిగిన కాంగ్రెస్ మహాసభలలో కూడా విద్య యొక్క ప్రాధాన్యతను నొక్కి చెప్పడం జరిగింది. కాని దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత రూపొందించుకొన్న రాజ్యాంగములో విద్య పొందే హక్కు ప్రాథమిక హక్కులలో గాక ఆదేశిక సూత్రాలలో చేర్చబడింది. ఆస్తిహక్కును ప్రాథమిక హక్కులలో చేర్చి జాతి భవితవ్యానికి అత్యంతావశ్యకమైన అందరికీ విద్య సందజేయడం ఆదేశిక సూత్రాలలో చేర్చడం విచారకరం.

మనదేశంలో అక్షరాస్యత శాతం 36. చీకటి ఖండంగా భావించబడే ఆఫ్రికా ఖండంలోని దేశాలలో అక్షరాస్యత శాతం 40. మనదేశ జనాభాలో సగ భాగంగా వున్న స్త్రీల అక్షరాస్యత శాతం 1981 జనాభా లెక్కల ననుసరించి 24.8. బీహార్‌లో అక్షరాస్యత శాతం 12. రాజస్థాన్‌లోని కొన్ని జిల్లాలలో అక్షరాస్యత శాతం కేవలం 1.5 మాత్రమే.

## మాటలు తప్ప నిధులేవి?

పశ్చిమ బెంగాల్‌లో వామపక్ష ప్రభుత్వం అధికారంలోకి వచ్చినప్పటినుండి అంటే 1977 నుండి ఢిల్లీలో జరిగే విద్యామంత్రుల సమావేశాలలో, విద్యకు అత్యధిక ప్రాధాన్యత యివ్వాలని, విద్యని సాంఘిక సేవా కార్యక్రమంగా గాక అభివృద్ధి కార్యక్రమంగా గుర్తించాలని కేంద్రప్రభుత్వానికి చెపుతున్నాము. జాతీయ ప్రణాళికా సంఘం సామాజిక అడవుల పెంపకాన్ని ఉత్పత్తి కార్యక్రమంగా గుర్తిస్తున్నదిగాని అంతకంటె ఎక్కువ ప్రాధాన్యతగల బిడ్డలను, స్త్రీలను అక్షరాస్యులను చేయడం ఉత్పత్తిని సాధించే కార్యక్రమంగా గుర్తించక పోవడం విచారకరం. భారతదేశపు మొట్టమొదటి విద్యాశాఖామంత్రి రానున్న సంవత్సరం నుండి కేంద్ర బడ్జెటులో విద్యకి 10 శాతం కేటాయిస్తామని 1948లో చెప్పారు. కాని ఆచరణలో ఏం జరుగుతున్నది? గడిచిన సంవత్సరం వరకు కేంద్ర వార్షిక బడ్జెటులో విద్యకు 2 శాతం పైగా కేటాయించబడుతూ వుండేది. కాని ఈ సంవత్సరం అది 1.8 శాతానికి తగ్గించబడింది. విద్యారంగం యింతగా నిధుల కోతకు గురవుతున్నది ఒక్క భారతదేశంలో మాత్రమే. 1984-85 నాటికి చదువుకునే వయస్సు గల బిడ్డలలో 80 శాతానికి పైగా విద్యావంతులవుతారని కొఠారి కమీషన్ జోస్యం చెప్పింది. కాని ఆ జోస్యం ఫలించ లేదు. 1966-67 ధరల స్థాయిన బిడ్డకు తలకు రు.56లు ఖర్చు పెట్టాలని సూచించింది కమీషన్. కాని 1966-67 ధరల స్థాయిలో పోల్చినప్పుడు ఈనాడు తలకు రు.3.10 లు మాత్రమే ఖర్చుపెట్టబడు తున్నది. ఈ మాటలు

రాజకీయ ప్రయోజనం కొరకు గాని ఎవరిపైనా వెక్కసంతో గాని చెప్పడం లేదు. నేను కూడా 1977 లో వామపక్ష ప్రభుత్వంలో విద్యామంత్రిగా నియమింపబడక పూర్వం 25 సంవత్సరాలు ఉపాధ్యాయునిగా పనిచేశాను. ఈనాడు దేశాన్ని, ప్రజలను ప్రేమించేవారు దేశాభివృద్ధిని ఆకాంక్షించే వారు విద్య యొక్క ప్రాధాన్యతను గుర్తిస్తున్నారు.

నిరక్షరాస్యతా నిర్మూలనకు మా రాష్ట్రంలో తలకు 156 రూపాయలు ఖర్చు చేస్తున్నాం. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రు. 151 లు. కాని కేంద్ర ప్రభుత్వం ఖర్చు కేవలం రు.19లు మాత్రమే. విద్య కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల ఉమ్మడి జాబితాలో వుంది గనుక కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు విద్యాభివృద్ధి యెడల శ్రద్ధ వహించాలి. కాని కేంద్ర ప్రభుత్వం విద్యాభివృద్ధికి తలకు 19 రూపాయలు మాత్రమే వెచ్చిస్తూ ఎంత నిర్లక్ష్యం చేస్తుందో గమనించండి. ప్రధానమంత్రి కేంద్ర విద్యామంత్రులైన శ్రీయుతులు షీలాకౌల్, నరసింహారావు, కె. సి. పంత్, శివశంకర్‌లతో నేను రాష్ట్ర విద్యాశాఖమంత్రిగా చాలా సార్లు మాట్లాడాను. విద్యకు తగిన ప్రాధాన్యత యివ్వక పోతే ఈ దేశ ప్రజలు చైతన్యవంతంగా రాజకీయాలలో పాల్గొని దేశాన్ని సోషలిష్టు సెక్యులర్ దేశంగా తీర్చిదిద్దడంలో భాగస్వామ్యం వహించగలరని మీరలా ఆశించగలరు? - అని నేను చాలాసార్లు ప్రశ్నించాను. సమాధానం శూన్యం.

## నవోదయ పాఠశాలల కథ కంచి కేనా?

విద్యాశాఖ మంత్రిగా మీరు నవోదయ పాఠశాలలను ఎందుకు వ్యతిరేకిస్తున్నారు? అని ప్రధానమంత్రి శ్రీ రాజీవ్ గాంధీ నన్ను ప్రశ్నించారు. "దేశంలో 56 వేల సెకండరీ పాఠశాలలు వున్నాయి. చదువుకొనే వారిలో 99.9 శాతం ఈ పాఠశాలల్లోనే చదువుతున్నారు. 0.1 శాతం బిడ్డలకు మాత్రమే అవకాశం కల్పించే 400 నవోదయ పాఠశాలలకు 500 కోట్లు రూపాయలు ఖర్చుపెడుతున్నారు. విద్యాభివృద్ధికి దేశాభివృద్ధికి ఏ విధంగా ఈ నవోదయ పాఠశాలలు దోహదపడతాయని అడిగాను. అంతేగాక అతికొద్ది మంది కొరకే పెట్టబడిన నవోదయ పాఠశాలల్లోని బిడ్డలకు బిరియాని, మాంసాలు అందచేస్తే మా కభ్యంతరం లేదుగాని దేశంలో గల 56 వేల పాఠశాలల్లో చదువుతున్న బిడ్డలకు చపాతి, పప్పు అందజేయగలిగితే సంతోషిస్తామని చెప్పాను. 1989-90 విద్యా సంవత్సరానికి నవోదయ పాఠశాలలకు ఎలాంటి కేటాయింపులు జరుగలేదు గనుక నవోదయ పాఠశాల విధానం విఫలమయినట్లేనని భావిస్తున్నాను.

ఇక ఉన్నత విద్యా రంగంలో కొన్ని కళాశాలలకు మాత్రమే స్వతంత్ర ప్రతిపత్తి యిస్తానంటుంది కేంద్రప్రభుత్వం. కాని చాలా కొద్ది కళాశాలలకు మాత్రమే స్వతంత్ర ప్రతిపత్తి యివ్వడం ద్వారా అవి యిచ్చే డిగ్రీలకు మాత్రం విలువ వుంటుందని మిగిలిన కళాశాలలు నిర్లక్ష్యం చేయబడతాయని, అవి యిచ్చే డిగ్రీలకు విలువ వుండదని నేనూ మరికొన్ని రాష్ట్ర ప్రభుత్వాల విద్యా శాఖామంత్రులం చెప్పాం.

## విశ్వ విద్యాలయాల్లో ప్రజాతంత్ర వ్యవస్థపై దాడి

భారతదేశంలో 156 యూనివర్శిటీలు వున్నాయి. వాటిలో ఒక్క పశ్చిమబెంగాల్‌లోని విద్యాసాగర్ యూనివర్శిటీకి మాత్రమే కేంద్రప్రభుత్వము గాని యూనివర్శిటీ గ్రాంట్స్ కమీషన్‌గాని నిధులు సమకూర్చకపోవడానికి కారణమేమిటి? పాఠశాల, కళాశాల, విశ్వవిద్యాలయం లాంటి విద్యా సంస్థల యాజమాన్యంలో విద్యార్థుల ఉపాధ్యాయుల బోధనేతర సిబ్బంది అలాగే ఆ ప్రాంతంలోని కార్మిక కర్షక ప్రతినిధులకు ప్రాతినిధ్యం వున్నప్పుడు మాత్రమే అవి ప్రజాస్వామ్య బద్ధమైన విద్యాసంస్థ లవుతాయి. విద్యాలయాలు క్రమబద్ధంగా నడుస్తాయి. పరీక్షలు సకాలంలో జరుగుతాయి. ఫలితాలు సకాలంలో ప్రకటించ బడతాయి. విద్యావ్యాప్తికి అనుకూలమైన వాతావరణం ఏర్పడుతుందని మా విశ్వాసం. కేవలం విశ్వాసమే గాదు, పశ్చిమ బెంగాల్ మా అనుభవం. విద్యాసాగర్ యూనివర్శిటీ యాజమాన్యపు హక్కులన్నీ ఛాన్సలర్ అయిన గవర్నరు చేతిలో కేంద్రీకరింపబడ్డాయి. యూనివర్శిటీ యాజమాన్యంలో విద్యార్థులకు గాని, అధ్యాపకులకు గాని, అసెంబ్లీకి గాని ఎవరికీ ఎలాంటి ప్రమేయం వుండకూడదనే షరతులకు మేమంగీకరిస్తేనే కేంద్ర ప్రభుత్వంగాని యూనివర్శిటీ గ్రాంట్స్ కమీషన్‌గాని నిధులను విడుదల చేస్తామంటున్నారు. యూనివర్శిటీ యాజమాన్యంలో విద్యార్థుల, అధ్యాపకుల ప్రజాప్రతినిధుల ప్రాతినిధ్యం వున్నప్పుడు మాత్రమే ప్రజాస్వామ్య యుతంగాను, క్రమబద్ధంగాను పనిచేస్తాయని కేంద్రప్రభుత్వంచే నియమింప బడిన గజేంద్రగడ్కర్ కమీషన్ రిపోర్టు స్పష్టం చేసింది. ఈ విషయం యూనివర్శిటీ గ్రాంట్స్ కమీషన్ ఛైర్మన్ అయిన యశ్‌పాల్‌గారికి గుర్తుచేస్తూ "గజేంద్రగడ్కర్ కమీషన్ సిఫార్సులను అమలు చేయనైనా చేయండి లేదా ఆ కమీషన్ రిపోర్టు పనికి మాలినదని ప్రకటించి చెత్తబుట్టలోనైనా వేయండి. ఈ రెంటిలో ఏదో ఒకటి చేయడం సబబు" అని వారికి మనవి చేశాను. ఎంత హేతుబద్ధంగా వ్యవహరించినప్పటికీ ఫలితం శూన్యం. విద్యాసాగర్ యూనివర్శిటీ ప్రారంభించినప్పటి నుండి అంటే 1981 నుండి కేంద్ర ప్రభుత్వంగాని యూనివర్శిటీ గ్రాంట్స్ కమీషన్‌గాని నిధులు విడుదల చేయలేదు. యూనివర్శిటీ నిర్వహణ కయ్యే ఖర్చంతా రాష్ట్రప్రభుత్వమే భరిస్తున్నది.

## మా సూత్రబద్ధ వైఖరి

నిధులకు ఏదోవిధంగా విడుదల చేయించుకొనేందుకు మేము విశ్వవిద్యాలయం ప్రజాస్వామ్య నిర్వహణను త్యాగం చేయలేమని ఢిల్లీలో జరిగే విద్యామంత్రుల సమావేశాలలో నేను చాలాసార్లు స్పష్టంచేశాను. కొన్ని రాష్ట్రాల విద్యామంత్రులు నా వాదనను సమావేశం వెలుపల ఆమోదించారు. అభినందించారు. "సమావేశములో మీ అభిప్రాయాలకు ఎందుకు వ్యక్తం చేయరు?" అని అడిగితే "మేము మంత్రులుగా కొనసాగడం మీకు యిష్టం లేదా?" అని ప్రశ్నించి తప్పుకు పోయారు.

## కేంద్రం కలిసి రావాలి

ఈనాడు కేరళ ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వ బడ్జటులో 40 శాతం విద్యాభివృద్ధికి వినియోగిస్తున్నది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 23 శాతం, పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం 26 శాతం ఖర్చు చేస్తున్నాయి. విద్యకి యింకా ఎక్కువ కేటాయిస్తే రాష్ట్రాలలోని యువకులకు ఉపాధి కల్పించే పథకాలు యితర అభివృద్ధి పథకాలు పూర్తిగా కుంటుపడతాయి. జాతిభవిష్యత్తుకి అత్యంతావశ్యకమైన ఈ బృహత్తర కర్తవ్యాన్ని కేంద్ర

ప్రభుత్వం సహాయం లేకుండా రాష్ట్ర ప్రభుత్వాలు నిర్వహించడం ఎలా సాధ్యపడుతుందో మేధావులు మీరూ ఆలోచించండి.

## ఉపాధ్యాయులు - సామాజిక బాధ్యత

నిరక్షరాస్యత ఎక్కువగా వున్న మనదేశంలో ఉపాధ్యాయులపై ప్రధానమైన సామాజిక బాధ్యత వున్నది. ఉపాధ్యాయులకు వృత్తిపరమైన, ఆర్థికపరమైన సమస్యలు వున్నాయి. సమస్యల సాధన కొరకు ఉద్యమాలు చేపట్టవలసిన అవసరమూ వున్నది. అంతేగాక ఉపాధ్యాయులు తరగతి గదులకే పరిమితం గాక స్వాతంత్ర్య పోరాటకాలంలో చైతన్యయుతంగా ఉవ్వెత్తుగా లేచి ఉద్యమించిన ఉజ్జ్వల ఘట్టాలను, దేశ సమైక్యత సమగ్రతలను గురించి సామాన్య ప్రజానీకానికి చెప్పి వారిని చైతన్యపరచవలసిన బాధ్యత గూడా వుంది.

ఈనాడు శిధిలావస్థకు చేరువలో నున్న కుళ్లు సంస్కృతి, కులమత విచ్ఛిన్నకర వేర్పాటు ధోరణులు విద్యార్థులను యువకులను పెడదారులు పట్టిస్తున్నాయి. ఈ అవలక్షణాలకు మూలమైన సామాజిక కారణాలను ఓపికగా విద్యార్థులకు వివరించి వారిని సక్రమ మార్గంలో నడిపించవలసిన సామాజిక బాధ్యత కూడా ఉపాధ్యాయులపై వుంది.

ఇక్కడ ఎన్ని రాజకీయ పార్టీలు వున్నప్పటికి మనమందరం భారతీయులం. కాబట్టి రాజకీయ విభేదాలను విస్మరించి విద్యారంగ పురోభివృద్ధికి తద్వారా దేశపురోభివృద్ధికి అందరూ కలిసికట్టుగా కృషిచేయాలని విజ్ఞప్తి చేస్తూ, ఈ కృషిలో కూడా ఎప్పుడూ మీతోనే వుంటానని మనవి చేస్తూ మీనుండి శలవు తీసుకొంటున్నాను.

## బేసిక్ నీడ్స్!

- పి. రమాదేవి (నన్నపనేని)
నెల్లిపాక, ఖమ్మం జిల్లా

ఆల్ఫా బీటాలు తెలియవు - వాడు పరమ మొద్దు
సైన్ తీటాలు తెలియవు - వాడుత్త అజ్ఞాని
పబ్లిక్ స్కూళ్ళనేవి వుంటాయనే వాడికి తెలియదు -
వాడికి లోకజ్ఞానం శూన్యం
పరమపటాలు, ఆదేశమవటాలు అంటే అర్థం తెలియదు -
వాడు చాకిరీ చక్రానికి కట్టిపడేసిన గానుగెద్దు
సగటు అవసరాలకే సంకటపడేవాడు వాడు -
విలాసాల ఆర్థిక శాస్త్రాలేమో - "అగ్ని" ప్రయోగాలేమో
"రోజ్‌గార్ పథకాల" నేమో - ఏమి ఏమీ తెలియదు వాడుత్త బైతు
వాడి ఎండిన పేగులకి -
వాడి బక్క చిక్కిన దేహానికి -
వాడి రెక్కల కష్టానికి -
వాడి అలసటకి -
తెలిసింది .... నాలుగే పదాలు!
ఆకలి!
అంగీ!!
గునపం!!!
గుడిసె!!!!



# "చిత్తశుద్ధి లోపం వల్లే విద్యా రంగ వైఫల్యం"

– శ్రీ యస్. జైపాల్ రెడ్డి, యం.పి. జనతాదళ్.

విద్యా విధానం మార్పులపై ప్రసంగాల్లో లోపం లేదు. నిపుణుల ఆలోచనల్లో లోపం లేదు. సిఫార్సులలో లోపం లేదు. కాని దానికి తగిన రాజకీయ సంకల్పం కొరవడింది. నిజాయితీ లోపించింది. అందుకే అన్ని రంగాల్లో లాగే విద్యా రంగంలో కూడా ఘోర వైఫల్యాలు మనకు ఎదురవుతున్నవి.

విద్యకు అధిక ప్రాధాన్యం ఇవ్వాలని సూత్రప్రాయంగా అందరూ అంగీకరించినా ప్రణాళికల్లో విస్మరించటం జరుగు తున్నది. నిధుల కేటాయింపులో కోతలు కొనసాగుతున్నవి. అందుకే మాటలు మాత్రం కోటలు దాటుతున్నాయి. కాళ్లు గడపలు దాటటం లేదు.

కొఠారి కమిషన్ నివేదిక సమర్పించి 23 సంవత్సరాలు గడిచింది. కేంద్రం దాన్ని అంగీకరించి కూడా రాజకీయ సంకల్పం లేని కారణంగా ఇంత వరకు ఆ సిఫార్సుల్ని అమలు జరపలేదు. ఆ నివేదికకు వ్యతిరేకంగా రాజకీయ పార్టీ కూడా ఏదీ లేదు. ఇంకెవరు దానికి అడ్డు?

జాతీయాదాయంలో 6 శాతం విద్యకు కేటాయించాలని కొఠారి కమిషన్ సూచించగా ప్రస్తుతం 1.2 శాతం మాత్రమే కేటాయించారు. దానిలో కూడా పునాది విద్య అయిన ప్రాథమిక విద్యకు ఎక్కువ కేటాయించాల్సింది పోయి మరింత తగ్గిస్తున్నారు.

గత 40 ఏళ్ల నుండి విద్యా విషయంలో దేశంలో ఏకాభిప్రాయమున్నది. రాజ్యాంగం రచించే సమయంలో కూడా మహాత్మాగాంధీ ఆదేశం మేరకు 'విశ్వ జనీన ప్రాధాన్య విద్య'ను పొందు పరిచారు. 1950 నుండి పదేళ్లలోనే 14 సంవత్సరాల వయసు లోపు వాళ్లని ప్రాథమిక విద్య కోసం పాఠశాలలకు వెళ్లే పరిస్థితి కల్పించాలని రాజ్యాంగ బద్ధంగా ఆదేశించారు. కాని పాలకవర్గం దాన్ని అమలు జరపలేదు.

విద్యా రంగంలో దేశం మొత్తం వెనుకబడి ఉండగా ఆంధ్రప్రదేశ్ మరింత వెనుకబడి ఉన్నది. 1971లో రాష్ట్రంలో 24 శాతం అక్షరాస్యులుండగా, 1989 నాటికి 29 శాతం మాత్రమే పెరిగింది. ఆంధ్రప్రదేశ్‌ను 'అన్నపూర్ణ' అనుకొన్నా విద్యా విషయంలో మాత్రం 'అవిద్యపూర్ణ' అయింది.

అక్షరాస్యత ఉన్న దేశాల్లో జనాభా పెరుగుదల తక్కువగా ఉన్నది. ఆ సమస్యను చదువు, విజ్ఞానం పరిష్కరిస్తుంది. ప్రస్తుతం చైనాలో ఆ ప్రయత్నమే జరుగుతున్నది. అందుకే జనాభా పెరుగుదలకు, విద్య తరుగుదలకు అవినాభావ సంబంధమున్నది.

మనకు శాస్త్రీయ దృక్పథం పెరగాలి. హేతుబద్ధమైన ఆలోచనలు అలవడాలి.

దేనికి ఏది కారణమో అర్థం కావాలి. ఆ విచక్షణాజ్ఞానాన్ని ఇచ్చేదే విద్య. అలా విజ్ఞానవంతులు కావటం పాలక వర్గానికి ఇష్టం లేదు. అందుకే యీ తిరోగమనం. ప్రజలెంత అజ్ఞానంగా ఉంటే .. వాళ్లనంత భ్రమల్లో ముంచవచ్చు. తమ అధికారాన్ని నిరంకుశంగా కలకాలం కొనసాగించవచ్చు. ఆ వర్గ ప్రయోజనమే మాటల్ని ఒక తీరు .. చేతల్ని మరొక తీరుగా మార్చుతుంది. పగటి మోసానికి దారి తీస్తుంది. నిజాయితీ లోపింప జేస్తుంది. ఆ దగాలో నవోదయ పాఠశాలలు ఒక భాగం. వాటిల్లో ఉన్నది ఒక్కటే సూత్రం. కలవారికే అన్నం .. మిగిలిన వారందరికి సున్నం !



## బడి !

– శ్రీ ఎ. యస్. యస్. శంకరరావు,
రేపల్లె, గుంటూరు జిల్లా

కాన్వెంట్ బళ్ళు
బరువుమోయటం నేర్పుతున్నయ్ !
కాలేజి బళ్ళు
చదువుకే బరువై కూర్చున్నయ్ !



# విద్యార్థులలో చైతన్యం కలిగించటం ఉపాధ్యాయుల కర్తవ్యం !

— శ్రీ పి. చంద్రశేఖర్, రాష్ట్ర పంచాయితీ రాజ్ శాఖా మంత్రి

విద్యార్థులలో శారీరక, మానసిక ఆరోగ్యంతో పాటు, సామాజిక స్పృహ కల్గించి వారిలో చైతన్యం తీసుకు రావటానికి ఉపాధ్యాయులు విశేషంగా కృషి చేయాలి. దేశ అభ్యున్నతికి ఎంత వరకు తోడ్పడుతున్నాము. తోటి మానవుల్ని ఏ విధంగా ఆదరిస్తున్నాము అని విద్యార్థులంతా ఆత్మ విమర్శ చేసుకొనేలా వారిలో సామాజిక స్పృహను, దేశభక్తిని పెంపొందించాల్సిన కర్తవ్యం ఉపాధ్యాయ వర్గం పై ఉంది.

ఏ వ్యక్తీ శారీరక, మానసిక ఆరోగ్యం సరిగా లేకుండా సామాజిక చైతన్యం పొందలేడు. కాన ఉపాధ్యాయులు మారుమూల ప్రాంతాలలో సైతం, తమ విధి నిర్వహణలో అశ్రద్ధ చూపకుండా, విద్యా విషయాలనే గాక ఆరోగ్య విషయాలను కూడా తెలియజెప్పాలి. కులతత్వం .. మతతత్వం నేడు సామాజిక జీవితాన్ని సంక్షుభితం చేస్తున్నాయి. విద్యార్థులను ఆ సంకుచిత తత్వాలకు దూరంగా సత్పౌరులుగా తయారు చేయాల్సిన బాధ్యత ప్రధానంగా ఉపాధ్యాయులదే.

చాలా మంది ఉపాధ్యాయులు మారుమూల ప్రాంతాలలో పనిచేసేందుకు ఇష్టపడటం లేదు. అది సరియైన ఆలోచన కాదు. ఎక్కడ నియమించినా వృత్తి ధర్మాన్ని చక్కగా నిర్వహించాలి. అక్కడ విద్యాభివృద్ధికి తోడ్పడి గ్రామాలలో చైతన్యం తీసుకురావాలి.

ఆగస్టులోగా మరో 2 వేల బి.యిడి పోస్టుల్ని భర్తీ చేస్తాము. బదిలీలపై ప్రస్తుతమున్న నిషేదాజ్ఞలు కొనసాగు తాయి. అయితే రిక్వెస్ట్ బదిలీలను మ్యూచువల్ బదిలీలను పరిశీలిస్తాము. 370 జి.ఓ. రద్దు విషయం ఆలోచిస్తాము. సొంత రెవిన్యూ డివిజన్లలో పనిచేయరాదనే నిబంధనలు ఇప్పటికే సడలింపబడ్డాయి. ఏది ఏమైనా దీర్ఘకాలిక ప్రయోజనాల దృష్ట్యా, గ్రామీణ ప్రాంతాల్లో పనిచేసేందుకు ఉపాధ్యాయులు తమ వ్యక్తిగత సుఖాలను త్యాగం చేయాల్సి ఉంది.

ఇది ఆరోగ్య సదస్సుగాక నా అభిప్రాయాలు కూడా కొన్ని చెప్తున్నాను. మనం పాత ఆచారాలు, సంప్రదాయాలను కూడా పరిశీలించాలి. వాటి వెనుక ఉన్న శాస్త్రీయతను గుర్తించి విద్యార్థులకు బోధించాలి.

## విద్యా ప్రహసనం

అప్‌గ్రేడ్ చేసిన హైస్కూళ్లలో ఎదురవుతున్న ఇబ్బందుల్ని శ్రీ యేన్. చంద్రశేఖరరెడ్డి హాస్య ధోరణిలో వివరిస్తూ సభలో నవ్వుల జల్లులు కురిపించారు.

'అడగటమే తడవు .. అందరికి హైస్కూళ్ళు ఇస్తున్నారు ... మంచిదే .. యు.పి. స్కూళ్లను అప్‌గ్రేడ్ చేసి అక్కడి సిబ్బందిని జడ్.పి.కి స్వాధీనం చేస్తున్నారు.

ఇక అక్కడి నుండి తిప్పలు ప్రారంభమవుతున్నాయ్.

ఆ స్కూల్లో సరిపడా పంతుళ్లుండరు .. సిబ్బంది అసలే ఉండరు.

డొనేషన్లు ఇచ్చిన వాళ్లు ఊరుకొంటారా .. సర్పంచ్‌ని నిలేస్తారు.

ఆయనేమో మండలాధ్యక్షుని అడుగుతాడు. చివరికి జడ్.పి. చైర్మన్ దగ్గరికి వెళ్తారు.

ఆ చైర్మన్ డి.యి.ఓ.కి ఫోన్ చేస్తాడు. ఇంత జరిగినా సబ్జక్ట్ వారీ టీచర్ల నియామకం గాని .. నైట్ వాచర్ .. స్వీపరో ఎవరో ఒకరి నియామకం గాని జరగటం లేదు.

దానితో ఆందోళన .. అసంతృప్తి .. హైస్కూలుగా మార్చు కొన్నందుకు శాపంగా భావిస్తున్నారు పిల్లల తల్లిదండ్రులు.

అంతటితో కథ ఆగదు.

స్కూల్లో ఊడ్చేవాళ్లు లేక దుమ్ము .. ధూళి.

పాపం హెడ్మాష్టర్ ఏం చేస్తాడు.

స్వీపరూ .. గార్డెనరూ .. నైట్ వాచరూ అన్నీ ఆయనేగా

కాస్త ఎదిగిన అమ్మాయిని చూసి 'చిమ్ము తల్లీ ' అంటాడు.

పేద పిల్ల అయితే సర్దుకు పోతుంది.

పెద్దింటి పిల్లయితే .. ఆమె రిపోర్టుతో తల్లిదండ్రులు వచ్చి హెడ్మాష్టరు డొక్క చించి డోలు కడతారు.

మంచి నీళ్ల సంగతీ అంతే .. ఎక్కడో నూతి దగ్గరికి వెళ్లి తేవాలి.

మళ్లీ పై ప్రహసనం రిపీట్ అవుతుంది.

## హోల్‌సేల్ శిక్ష

తప్పు చేసిన వాళ్లని శిక్షించటం .. బదిలీ చేయటం న్యాయం

అంతేదప్ప ఈ హెూల్‌సేల్ శిక్ష ఏమిటి? - 370 జి.ఓ. గురించి వ్యాఖ్యానం

## బిడ్డలందరికీ తిండి

నేను 5 సం.ల క్రితం యు.యస్.ఎ. పోయాను. అక్కడ మధ్యాహ్నభోజనం ఖర్చు ప్రభుత్వమే భరిస్తుంది. తల్లి దండ్రులు ఉద్యోగాల కెళ్తారు. పిల్లలు ఉన్నవాళ్లయ్యేది లేని వాళ్లయ్యేది అందరికీ స్కూల్లోనే ఆహారం అందిస్తారు.

## వైద్యం ఉచితం

వైద్యం సంగతి కూడా అంతే. డాక్టర్ పరీక్ష చేసి మందు చీటీ ఇస్తే చాలు .... దానిమీద సంతకం పెట్టి షాపులో ఇస్తే మందులు ఫ్రీగా ఇస్తారు. బిడ్డల ఆరోగ్యం ప్రభుత్వ బాధ్యతగా వాళ్లు ఆ నిర్ణయం తీసుకొన్నారు.

ఇక మనదేశంలోనే మందు కొనుక్కోలేక పేదవాడు చస్తాడు. భాగ్యవంతుడు అమెరికా పోయి చికిత్స చేయించుకొని మరీ వస్తాడు.

ఆరోగ్య సదస్సు :-

# ప్రజారోగ్య ప్రచారానికి తోడ్పడండి!

- డా. జె. శేషారెడ్డి,
ప్రజావైద్యశాల, నెల్లూరు.



మానవ చరిత్రలో ఎన్నడూ లేని అభివృద్ధి నేడు వైద్య శాస్త్రంలో వచ్చింది. అసలు జబ్బులు రాకుండా చూసుకోవటం, ఒక వేళ వస్తే వాటిని నయం చేసుకోవచ్చనే విశ్వాసం ప్రజల్లో పెరిగింది. దీనివల్ల ప్రపంచ వ్యాప్తంగా నూతన పరిణామాలు వైద్య రంగంలో చోటు చేసుకొన్నాయి. రేడియోల ద్వారా .. పత్రికల ద్వారా .. టెలివిజన్ల ద్వారా .. అడ్వర్‌టైజ్‌మెంట్ల ద్వారా వైద్య సమాచారం ప్రజలకు అందుతున్నది. అదే సందర్భంలో, ప్రజల్లో ఆరోగ్యాన్ని గురించి అనవసర భయాందోళనలు రేకెత్తించే ప్రచారం కూడా అధికమయింది. ఎంత చిన్న జబ్బయినా ప్రతి దానికీ మందు తీసుకోవాలనే ప్రచారం, సక్రమంగా జీవిస్తున్న వాళ్లల్లో కూడా వ్యాధుల్ని గురించి వాస్తవాల్ని పూర్తిగా చెప్పకుండా పక్కదార్లకు మళ్లించే ప్రచారం ప్రజల్ని గందర గోళ పరుస్తున్నది. దానితో భీతావహం వ్యాపించడం. మందుల అమ్మకాల ద్వారా లాభాలు సంపాదించటం పరిపాటి అయింది.

'అసలు జబ్బులు రాకుండా నిరోధించటం' అనే దాన్ని విస్తృతంగా ప్రచారం చేయాలని ప్రపంచ ఆరోగ్య నిపుణులు, వైద్య శాస్త్రజ్ఞులు అందరూ అంగీకరించిన విషయం. అయితే ఈ ప్రచారం మనదేశంలో జరుగుతున్నదా?

'నూటికి ఎనభై జబ్బులు కొన్ని ఆరోగ్య సూత్రాలు పాటించటం ద్వారా నిరోధించవచ్చు. దీనికయ్యే ఖర్చు కూడా చాలా తక్కువ' అనే ప్రచారానికి బదులు జబ్బుల లక్షణాలు అరకొరగా చెప్పి విపరీత భయభీతుల్ని వ్యాపింప జేయటం .. వివిధ కంపెనీల మందుల్ని గురించి ఊదరగొట్టటం విరివిగా సాగుతున్నది. దానితో సామాన్యులు కూడా హాస్పెటళ్ల పాలవటం .. విపరీత ఖర్చు మీదబడి తమకూ, తమ కుటుంబానికి భారం కావటం జరుగుతున్నది. ఏ హాస్పెటల్‌కు వెళ్లినా ముక్కుల్లో .. చెవుల్లో .. నోట్లో .. సందు ఉన్న చోటల్లా ట్యూబులతో నింపు కొనే దృశ్యాలు మనకు కన్పిస్తూ ఉంటాయి. ఈ దుస్థితి ఇలా కొనసాగవలసిందేనా?

ఆరోగ్యశాఖ కూడా వ్యాధి నిరోధక ప్రచారానికి బదులు 'సెంటర్స్ ఆఫ్ ఎక్సలెన్స్' గురించీ, గుండె మార్పిళ్లూ .. శస్త్ర చికిత్సలపైనా, ప్రత్యేక వైద్య నిపుణ కేంద్రాల ప్రచారానికే ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నది. వైద్య శాస్త్రంలో వచ్చిన అభివృద్ధిని నేను వ్యతిరేకించటం లేదు. భారతదేశంలాంటి పేద దేశంలో 'దేన్ని ఏ విధంగా ఉపయోగించు కొంటే ఎక్కువ మంది ప్రజలకు ఉపయోగం?' అనే విచక్షణ ఇక్కడ ముఖ్యం. ఈ విషయంలో అటు కేంద్రం .. ఇటు రాష్ట్రాలు పూర్తిగా విఫలమైనయ్. చేయాల్సింది చేయటం లేదనేదే నా ఆరోపణ.

మన దేశంలో సామాన్యంగా వచ్చే జబ్బులేమిటి? వాటిని నివారణ పద్ధతులేమిటి? వైద్య విద్యలో ఏ మార్పులు తీసుకు రావాలి? అసలు జబ్బు రాకుండా ఎలా నిరోధించాలి? అనే విషయంపై పలు కమీషన్లు రిపోర్టు లిచ్చినప్పటికీ అవి అమలు జరగక చిత్తు కాగితాల బుట్ట పాలవుతున్నాయి.

అంతేగాక బ్రిటిష్ కాలంనాటి వైద్య విద్యా విధానమే నేటకీ కొనసాగుతున్నది. అప్పుడు బ్రిటిష్ వాళ్లు తమదేశ పరిస్థితుల్ని బట్టీ ఆ విద్యా విధానాన్ని రూపొందించారు. స్వతంత్రం వచ్చినా ఆ విధానంలో మార్పు రాలేదు. మనదేశ పరిస్థితుల కనుగుణంగా దాన్ని రూపొందించలేదు. కాలం మారినా దాని కనుగుణమైన మార్పురాలేదు. ఈ దుస్థితినివారించేందుకు ఉపాధ్యాయులుగా మీరు కూడా తోడ్పడాలి.

మీలో చాలా మంది గ్రామీణ ప్రాంతాల్లో ఏ వైద్య సౌకర్యం లేని మారుమూల ప్రాంతాల్లో కూడా పనిచేసేవాళ్లున్నారు. మీకు వైద్య విషయంలో సామాన్య సూత్రాలు అవగాహన అయితే, అతి తక్కువ ఖర్చుతో, తేలిగ్గా, ప్రజలకు ఉపయోగ పడవచ్చు. అంతేగాక మీరు చదువు చెప్పే పిల్లలకు ఆరోగ్య పాఠాలు చెప్తే వాళ్ల భవిష్యత్తు కూడా సుఖవంతంగా సాగుతుంది.

అందువల్లే 'ఆరోగ్యం కోసం సైన్సు' అనే నినాదంతో జన విజ్ఞాన వేదిక ఉద్యమం సాగిస్తున్నది. సామాన్యంగా వచ్చే జబ్బులూ .. వాటి నివారణోపాయాలూ అసలు రోగాలే రాకుండా చూసుకొనే రక్షణలూ .. చిన్న చిన్న పుస్తకాల ద్వారా .. ప్రదర్శనల ద్వారా విస్తృత ప్రచారానికి పూనుకొన్నది. ఆ కార్య క్రమాలకు మీరంతా సహకరించండి. దానిలో భాగస్వాములు కండి. ప్రజల్లో మమేకమై .. అజ్ఞానం ఫలితంగా వేళ్లుదన్ను కొన్న మూఢాచారాల్ని గురించి వివరించండి. నచ్చచెప్పి సరియైన ఆరోగ్య ప్రచారానికి తోడ్పడండి. ఆరోగ్యమే మహా భాగ్యమన్న సూక్తిని ఆ విధంగా సార్థకం చేయండి! అకాల మరణాల్ని నివారిస్తూ భారత సౌభాగ్యాన్ని కాపాడండి !



నిజం కథ

# ఎవరిది విజయం?

– 'మైనేని'

సిగరెట్ వెలిగించి వ్యాసం ప్రారంభించాడు రచయిత.

దాని పేరు 'ధూమపానం దుర్మరణానికి సోపానం!'

సిగరెట్‌పైన సిగరెట్ కాలుతూనే ఉంది .. వ్యాసం నిరాఘాటంగా సాగుతూనే ఉంది.

'పొగతాగితే గుండెజబ్బు, ఊపిరితిత్తుల క్యాన్సర్, క్రొనిక్ బ్రాంకైటిస్, శ్వాసకోశ వ్యాధులు ఎంఫైసెమా మొదలైన ప్రమాదకరమైన జబ్బులు వస్తాయి. పొగతాగే వాళ్ళకే గాక, ఆ పొగ పీల్చే ఇంట్లో అర్ధాంగికి, బిడ్డలకు ప్రక్కన కూర్చున్నవాళ్ళకీ ... అందరికీ ఆ జబ్బులు అంటుకొంటాయి. ఈ వ్యసనం పిల్లల్లో కూడా శీఘ్రంగా వ్యాప్తి చెందుతున్నది. విద్యార్థుల్లో 22 శాతం ఈ వ్యసనానికి బానిసలవుతున్నారు. ఈ తరం బాలికల్లో అది 24 శాతానికి పెరిగింది.

సిగరెట్ కంపెనీలు తమ సిగరెట్ల పేరుతో కార్లపోటీ పందేలు, క్రీడోత్సవాలు, టి.వి. ప్రకటనలు గుప్పిస్తూ పరోక్షంగా ఈ వ్యసనాన్ని ప్రోత్సహిస్తున్నారు. యువతరం ఆ ఆకర్షణలకు లోనవుతున్నది. తమ అభిమాన క్రీడాకారుడో, సినిమా నటుడో తాగే 'బ్రాండ్' కు ముచ్చటపడుతున్నారు. ప్రభుత్వం కిమ్మనకుండా ఊరుకొంటున్నది. విదేశీ కంపెనీల వత్తిడికి లోబడుతున్నది.

ఈ మహమ్మారిని అరికట్టాలంటే సిగరెట్ ప్రచారంపై, ప్రకటనలపై పూర్తి నిషేధం, 16 సం.ల లోపు పిల్లలకు సిగరెట్ల అమ్మకం నిషేధించటం, ధూమపాన ప్రమాదంపై విస్తృత ప్రచారం, అన్నిటికంటె ప్రభుత్వాల రాజకీయ నిర్ణయం – ఇవన్నీ ముఖ్యం.

అందుకే 'ఓ రోజు అయినా ధూమపానం మానండి! అని ప్రపంచ ఆరోగ్య సంస్థ పిలుపిచ్చింది.

– ఇలా అన్ని వివరాలతో వ్యాసం వ్రాసి, మరో ఐదు సిగరెట్లతో ఫెయిర్‌చేసి పత్రికలకు పోస్టు చేయటానికి బయటికి వెళ్ళాడు రచయిత ... ఆఖరి సిగరెట్ వెలిగించి.

అప్పటి దాకా ఆ యిరుకు కొంపలో పొగలో ఉక్కిరి బిక్కిరయి, మగడు కాల్చిన సిగరెట్ పీకలు లెక్కేసింది ఇల్లాలు .. చీపురుతో నుసీ ... మసీ పోగేస్తూ ...

ఇరవై పీకలు !

మసిబారిన కింగ్ సైజ్ గోల్డ్‌ఫ్లాక్ 20 ఎంగిలి పీకలు!

తమ బ్రతుకును నరకం జేస్తున్న దుర్వ్యసన పిశాచి తోకలు !

పాఠకుడా నువ్వే చెప్పు .....

విజయం వ్యసనానిదా ? వ్యాసానిదా ?

# స్వాగతం !

– మైనేని

ఇదే ... విక్రమ సింహపురీ ...
ఐక్యోద్యమ చైతన్య ఝురీ ...
యు.టి.యఫ్. సోదరా స్వాగతం!
యు.టి.యఫ్. సోదరీ స్వాగతం!!

'పెన్న' పిల్లగాలి మిమ్ము–సేద దీర్చునోయీ
జాలువారు తేటనీట – చల్ల బఱచు నోయీ
ఇసుక తిన్నె తల్పాలను – పొసగ గూర్చునోయీ
పురాస్మృతుల మదికి తెచ్చి – పులక రేపు నోయీ ||ఇదే||

ఎగువ వేదగిరీ – దిగువ జొన్నవాడా ....
భక్తి, ముక్తి, రక్తి గూర్చు – గోపురాల జాడా
గుడి గంటల నాదాలు – సింహపురికి వేదాలు
హరి హర నాధుని సృష్టితో – తొలగినవీ భేదాలు ||ఇదే||

కలం కత్తి ... ఇక్కడే ... కలిశాయి ...
కవి తిక్కన .. ఖడ్గ తిక్కన వెలిశారు ...
తేట తెలుగు మాటల – పూదోటగా ...
విరిసిందీ ఇక్కడే – మహాభారతం ...! ||ఇదే||

'కవి కోకిల' దువ్వూరీ – కావ్యగాన మిచటనే
పొట్టి శ్రీరాములు – పుట్టినదీ ఇచటనే
విశాలాంధ్ర వేగు చుక్క – సుందరయ్య జన్మభూమి
ప్రజావైద్యశాల శిల్పి – 'రామ్' ను గన్న పుణ్యభూమి ||ఇదే||

ఎటు జూచిన పైరు పంట – పచ్చనీ తోటలూ
గాలికూగు 'మొలకొలుకుల' – వరికంకుల ఆటలూ
చైతన్యం వెల్లివిరియు – ఉత్తేజపు పాటలూ
అనురాగం, ఆత్మీయత – కలగలిపే తేటలూ ||ఇదే||

మన చదువులు, మన సాహితి – మన సమాజ గతుల గూర్చి
చర్చించగ ఉద్యమించి – ఐక్య వాణి విన్పింపగ
మన జెండా రెపరెపలే – మన గుండెల చప్పుళ్ళుగ
కడలి తరంగాల్లా .. కదన తురంగాల్లా

కదలి రండంటున్నది సింహపురీ!
ఆహ్వానం పలుకుతోంది సింహపురీ!!

(మహాసభల్లో పలుమార్లు పాడించుకొని మన్ననలందుకొన్న ప్రజా నాట్యమండలి కళాకారుల పాట)



# 'భారత దేశంలో ఆరోగ్య పరిస్థితి – మన కర్తవ్యాలు'

– డా. వై. రాధాకృష్ణ మూర్తి
పీపుల్స్ నర్సింగ్ హోం, ఖమ్మం.

విద్యకు వైద్యానికి అవినాభావ సంబంధం ఉంది. అందుకే మీ మహాసభల్లో 'వైద్య సదస్సు' కూడా ప్రత్యేకంగా ఏర్పాటు చేశారని భావిస్తున్నాను. మన రాజ్యాంగంలో విద్యా ప్రాథమిక హక్కు కాదు. వైద్యమూ ప్రాథమిక హక్కు కాదు. రెండు ఆదేశిక సూత్రాల్లోనే ఉన్నవి. విద్యా హక్కు ప్రాథమిక హక్కుగా ఉండాలని మీరెలా పోరాడుతున్నారో .. వైద్యానికీ అంత ప్రాధాన్యత ఉండాలని ప్రపంచ ఆరోగ్య సంస్థ ఉద్ఘాటిస్తున్నది. అలాగే విద్య, ఆరోగ్యం పెంపొందాలంటే దాని వెనుక ఉన్న సాంఘిక ఆర్థిక సమస్యలు పరిష్కరింపబడాలనేది మన అందరి ఆందోళన. కాన ఈ సదస్సు ఆ విధంగా అర్థవంతం, సందర్భోచితం అని నా భావన.

## 'ఆరోగ్యాన్ని గురించి చర్చిద్దాం రండి'

1948 ఏప్రియల్ 8 ప్రపంచ ఆరోగ్య సంస్థ ప్రభవించిన రోజు. దాని ఆవిర్భావానికి గుర్తుగా ఆ రోజున ఆరోగ్యానికి చెందిన ఒక నినాదాన్ని, ప్రతి సంవత్సరం ప్రపంచ ప్రజల ముందు పెట్టటం ఒక సంప్రదాయంగా, ఆనావాయితీగా వస్తున్నది. ఆ రోజునే గాకుండా సంవత్సరం పొడవునా ఆ విషయంపై ప్రజల్లో .. మేధావుల్లో .. ప్రణాళికా వేత్తల్లో .. చర్చలు సాగాలి. అధ్యయనం కొనసాగాలని ప్రపంచ ఆరోగ్య సంస్థ యొక్క ఉద్దేశం. దానిలో భాగంగానే ఈ సంవత్సరం' ఆరోగ్యాన్ని గురించి చర్చిద్దాం పదండి!' అనే నినాద మిచ్చింది. ఈ నినాదమిచ్చిన సందర్భంగా ప్రపంచ ఆరోగ్య సంస్థ డైరక్టర్ జనరల్ 'డా. హిరోషీనకాజిమా' ఇలా విజ్ఞప్తి చేశారు.

'ప్రపంచంలోని అన్ని వర్గాల ప్రజలూ .. డాక్టర్లు, లాయర్లు, ఉపాధ్యాయులూ, మేధావులూ అంతా ఒక సామాజిక కర్తవ్యంగా భుజం భుజం కలిపి ఆరోగ్యాన్ని గురించి చర్చించాలి!'

– ఈ విజ్ఞప్తిలో ఉపాధ్యాయుల్ని కూడా పేర్కొనటం గమనార్హం. అందువల్ల ఉపాధ్యాయ మహాసభలో ఆరోగ్యాన్ని గురించి కూడా చర్చించటం అసందర్భమేమీ కాదు.

## ఆరోగ్య మంటే

అసలు ఆరోగ్యమంటే ఏమిటో ముందు చర్చిద్దాం. ఈ సమస్య చాలా మందికి వింతగా కన్పించవచ్చు. ప్రపంచ ఆరోగ్య సంస్థ దీని నిర్వచనానికి చాలా కాలం సిగపట్లు పట్టి చివరికి ఓ నిర్ణయానికి వచ్చింది. 'జబ్బు లేకపోవడమే ఆరోగ్యం కాదు శారీరకంగా .. మానసికంగా .. సామాజికంగా స్వస్థత కల్గి ఉండటమే ఆరోగ్యమని నిర్వచన మివ్వటం జరిగింది. ఆ తర్వాత 1984 లో 'వరల్డ్ హెల్త్ అసెంబ్లీ' పేరుతో జరిగిన సమావేశంలో 'ఆధ్యాత్మిక స్వస్థత' (స్పిరిట్యువల్ డైమన్షన్)ను కూడా నాలుగో అంశంగా చేర్చటం జరిగింది. (1) మన జ్ఞాన కర్మేంద్రియాలు పనిచేసే తీరు నార్మల్‌గా ఉండాలి (2) మన మనసుల్లో అంతరంగికమైన ఘర్షణలూ, వైరుధ్యాలూ లేకుండా మనకు అదుపు ఉండాలి. (3) ప్రతి మనిషీ, ఇటు కుటుంబంలోనూ, అటు సమాజంలోనూ సభ్యుడుగాన కలతలు లేకుండా పది మందితో కలిసి మెలిసి ఉండే స్వభావం ఉండాలి. (4) మంచి ఉద్దేశాలు ఆలోచనలు .. ప్రవర్తనలు కలిగి ఉండాలి. ఈ విధంగా శారీరక, మానసిక, సామాజిక, ఆధ్యాత్మిక స్వస్థత కల్గి ఉండటమే ఆరోగ్యం తప్ప, జబ్బుల్లేకుండా ఉండటమే ఆరోగ్యం కాదని ప్రపంచ ఆరోగ్య సంస్థ నిర్వచన మిచ్చింది. ఈ రకమైన నిర్వచనం మనం ఆమోదించినట్లయితే ఇక్కడున్న వేలాది మందిలో ఎంతమంది సరియైన ఆరోగ్యంతో ఉన్నామని చెప్పుకో గలరు?

మన శారీరక ఆరోగ్యం సంగతి చర్చించుకోబోయే ముందు .. ఆరోగ్యాన్ని గురించి ప్రజలకున్న హక్కేమిటో మొదట పరిశీలిద్దాం.

## ఆరోగ్యం ప్రజల ప్రాథమిక హక్కు

ప్రపంచ సంస్థయైన ఐక్యరాజ్యసమితి ఆరోగ్యాన్ని ప్రాథమిక హక్కుగా గుర్తించింది. అదే సందర్భంలో వివిధ ప్రభుత్వాలు ప్రజల ఆరోగ్యాన్ని గురించి పరిరక్షించాల్సిన బాధ్యతను కూడా దానిలో నొక్కి చెప్పబడింది.

అన్ని సోషలిస్టు దేశాల్లోనూ .. కొన్ని పెట్టుబడిదారీ దేశాల్లోనూ వారి రాజ్యాంగాల్లో ప్రాథమిక హక్కులుగా గుర్తించటమేగాక .. బాధ్యతగా ప్రజలందరికీ ఉచితంగా వైద్యం అందింపబడుతున్నది. ముఖ్యంగా సోషలిస్టు దేశాల్లో రోగికి వైద్యం అందించటం అత్యవసర సర్వీసు. రోగి సంగతి తెలియగానే మన ఫైర్ సర్వీసు ఉన్నట్లు వైద్య బృందం ఆఘమేఘాల మీద వెళ్లి వైద్య సదుపాయం కల్గిస్తున్నది. తాము కళ్లారా చూసిన ఈ విషయాన్ని పశ్చిమదేశాల మేధావులు పుస్తకాల్లో .. పత్రికల్లో ఉదహరించారు. అలాగే న్యూజిలాండ్, ఇంగ్లాండు మొదలగు పెట్టుబడి దారీ దేశాల్లో కూడా ప్రభుత్వాలు ప్రజల ఆరోగ్య విషయంలో పూర్తి బాధ్యత తీసుకొంటున్నాయి. ఉచిత వైద్యం అందిస్తున్నాయి. ఈ విషయాన్ని మనదేశంలోని మేధావులు ఉపాధ్యాయులు దృష్టిలో ఉంచుకోవాలని కోరుచున్నాను.

## ఇక మన దేశం లోనే...

మన రాజ్యాంగంలో వైద్యం ప్రాథమిక హక్కుగా కాకుండా .. ఆదేశిక సూత్రాల్లో ఉన్నది. ఆలస్యంగానైనా 82 నవంబరు 2న నేషనల్ హెల్త్ పాలసీకి చెందిన డాక్యుమెంట్‌ను మన ప్రభుత్వం రూపొందించింది. ఓ సంవత్సరం తర్వాత 83 డిశంబరు 16న దాని మంచిచెడులు చర్చించటానికి పార్లమెంటు పూనుకొన్నది. ఇది చర్చకు రావటానికి ఓ సంవత్సరం పడితే .. ఆ రోజు పార్లమెంటులో 540 మంది సభ్యులకుగాను 25 మంది మాత్రమే హాజరయ్యారని పత్రికల వార్త. మనం ప్రజా ప్రతినిధులుగా ఎన్నుకొని పంపిన పెద్ద మనుషులకు ప్రజారోగ్యం పట్ల ఎంత శ్రద్ధ ఉన్నదో ఈ విషయం రుజువు చేస్తున్నది.

ఇక మనదేశ ఆరోగ్య పరిస్థితి గురించి తెలుసుకోవాలంటే దానికి కొన్ని కొలబద్దలున్నాయి. జనాభా లెక్కల వివరాల ద్వారా విశ్లేషించటం ఒక పద్ధతి, కుటుంబ నియంత్రణ వివరాలు మరో పద్ధతి. ఇది మనదేశంలో ఓ ప్రహసనంలా తయారయింది. లెక్కల్లో జననాల రేటు ప్రభుత్వం ప్రకటించినట్టుగా లేదని, ఏ మాత్రం తగ్గలేదని అనధికార అంచనాలు తెల్పుతున్నాయి.

కుటుంబ నియంత్రణం ప్రహసనంగా మారిన తీరు చూడండి. ఈ మధ్య ఓ ప్రఖ్యాత పత్రిక ఓ వ్యాసం ప్రకటించింది. 'అది ఉత్తర ప్రదేశ్‌లో ఓ ప్రైమరీ హెల్త్ సెంటర్, అక్కడ ఆపరేషన్ చేయించుకొన్నవారి లిస్టులో 'రాజీవ్‌గాంధీ' పేరున్నది. ఆ పైన 'సన్ ఆఫ్ ఫిరోజ్‌గాంధీ' అని కూడా నిర్ధారింపబడి ఉంది. దీన్నిబట్టి ఇది ఎంత ఫార్స్ .. కాకుల లెఖ్ఖో మనకు అర్థమవుతుంది.

ప్రభుత్వ మిచ్చిన లెఖ్ఖల ప్రకారమే రోజూ ప్రతి వేయి మందికీ 37 జననాలు తోడవుతున్నాయి. మరో 11 సం.ల్లో మన జనాభా 100 కోట్లు అవుతుంది. దీన్ని పరిష్కరించటమనేది ప్రభుత్వాలకు ఓ పెద్ద సమస్య అయి కూర్చున్నది. అయితే ఎక్కువ జనాభాగల సోషలిస్టు చైనాలో సమర్థవంతంగా .. ప్రతిభావంతంగా ఇది అదుపు చేయబడుతున్నట్టు వార్తలు వస్తున్నాయి.

మనదేశంలో పుట్టిన బిడ్డల్లో ప్రతి వేయి మందికి 90 మంది సంవత్సరం తిరక్కుండానే చనిపోతున్నారు. ప్రసూతి సౌకర్యాలు లేక వేలాదిమంది మరణిస్తున్నారు. నూటికి 60 మంది సరియైన పోషకాహారం లేక అంటు వ్యాధుల పాలవుతున్నారు. దీనంతటికీ మూలం దరిద్రం. దరిద్రానికి అనారోగ్యానికి అవినాభావసంబంధం ఉంది. సి.గోపాల్ వంటి ప్రఖ్యాత శాస్త్రజ్ఞులు ప్రామాణికమైన ఉదాహరణలతో దీన్ని నిరూపించారు.

అందుకే జవహర్‌లాల్ నెహ్రూ 'అనారోగ్యం మీద యుద్ధం చేయాలంటే, దరిద్రం మీద కూడా యుద్ధం చేయాలని అన్నారు'.

## ఆరోగ్య ఉద్యమం

ప్రపంచ ఆరోగ్యాన్ని గురించి సోవియట్‌లో ఇటీవల జరిగిన ఒక సమావేశంలో ఒక వ్యూహం రూపొందింపబడింది. దానిలో 2 వేల సంవత్సరం నాటికి 'అందరికీ ఆరోగ్యం' అనే నినాదం ప్రకటింప బడింది. దానికి (1) ప్రాథమిక ఆరోగ్య సంరక్షణ (2) రోగనిరోధక శక్తిపై అవగాహన (3) పోలియో మొదలగు 6 జబ్బుల్ని బి.సి.జి. ద్వారా జీవన కాలంలో రాకుండా చేయటం (4) ప్రజల్ని ఆరోగ్య విషయంలో చైతన్యవంతుల్ని చేయటం (5) ప్రభుత్వంలోని వివిధశాఖల సమన్వయం (6) రాజకీయ దీక్ష మొదలగునవి ఆ వ్యూహంలో భాగాలుగా ఉన్నాయి. నిరక్షరాస్యతా నిర్మూలన కూడా అందులో ఓ ప్రధానాంశం.

ఇప్పుడు ఆలోచించండి, విద్యకు, వైద్యానికి, ఆరోగ్యం మహాభాగ్యం కావటానికి ఎంత దగ్గరి సంబంధం ఉన్నదో మనకు స్పష్టమవుతున్నది. ఉపాధ్యాయులు ఓర్పు – నేర్పు గల వాళ్లు. ఈ ఆరోగ్య ఉద్యమంలో ఓర్పుతో పాల్గొనండి. నేర్పుతో విజయ వంతం చేయండి.

### ఓ ఉత్తేజ తరంగం!

–పి. రమాదేవి నన్నపనేని)
నెల్లిపాక, ఖమ్మంజిల్లా



ఓహ్ .. అది .. ఏమని చెప్పను ... ఎలా చెప్పను ...
ఉల్లాసమననా? ఉత్తేజమననా?? ఉద్వేగమననా???
అనిర్వచనీయానుభూతి యననా?
నవనవోన్మేష చైతన్యగీతి యననా?
వెల్లువై పొంగిన హర్షాతిరేకరీతి యననా?
పావని అయినది పినాకినా?
ఆతిథ్యం పొందిన ప్రజావాహినా?
పొంగింది మమతల మందాకినా?
నాటి నెల్లూరే ఓ దివ్యమోహినా??
'సింహపురిని' అరుణరాగ రంజితంగా తీర్చినారు!
'సర్వోదయ'ను సర్వశోభితగా దిద్దినారు!
"చంద్రమౌళి నగరి"ని సుందర వధూటిగా మార్చినారు!
'ప్రసంగాల' రసార్ణవ ఝరిలో ఓలలాడించి నారు!
అపర ధన్వంతరులు – సాహితీ విశారదులు
కళా కోవిదులు – గాన గంధర్వులు
ప్రజా సంఘాల నాయకులు – పాలక వర్గ ప్రతినిధులు
ఎందరెందరో విశ్లేషించారు విద్యా రంగాన్ని, వివేకాన్ని
ఆలోచనల అలలతేల్చి – మంధర మథనం సాగించారు
జడత్వాన్ని వదిలించి – చైతన్యం రగిలించారు
దేశవ్యాప్త ఉద్యమానికి – బీజా వాపం చేశారు
ఎక్కడో ... మరెక్కడో – పాఠాలు చెప్పే బడి పంతుళ్ళు
ఇక్కడ మాత్రం – బుద్ధిమంతుల్లా వినే బడి పిల్లలయ్యారు
అధ్యయనం అన్ని విధాలా – సార్థకమైన అద్భుత సన్నివేశమది!
అధ్యాపనానికి ఆలంబనంగా సమకూర్చిన మహదవకాశమది!!
ధవళ చంద్రిక లోకవైపు !
రుధిరవర్ణ కేతనాల రెపరెప లోకవైపు !
సింహపురిలో సింహనినాదాలై మిన్నుముట్టాయి !
అభివృద్ధినోర్వని ఈర్ష్యాళువుల కళ్ళుకుట్టాయి !!
ప్రతిధ్వనించాయి పురవీధులు !
తనిసి విరిశాయి రహదారులు !!
విరిసి మురిశాయి వదనాలు !
మురిసి కురిశాయి పవనాలు !!
సంప్రోక్షణలతో సంభావించె మేఘమాల !
ప్రదర్శకుల ఎడదల్లో మిగిల్చె ఆనంద హేల !!
పురజనుల మానసాలూగె రసరమ్యడోల !
ఒక్క ప్రత్యర్థుల గుండెల్లోనె రగిలె అగ్నికీల !!
క్రమశిక్షణె యు.టి.యఫ్. ప్రాణం !
శ్రమశక్తే దాని ధ్యేయం !!
హక్కుల సాధనే అసలు లక్ష్యం !
సర్వసౌభ్రాతృత్వమే చరమాశయం !!
కొన ఊపిరి "జిందాబాద్" నినాదంలో ఆగిపోవాలనీ !
ఈ మహోద్యమంలో చిరుసమిధ కావాలని !!
ప్రతి స్పందించింది గుండెలో ప్రగాఢాభిలాష !
మధురసరాగిణుల కవితామంజూష !!

# వైద్య విధానాల్లో మూఢనమ్మకాలు

— డా. విజయకుమార్
ప్రజా వైద్యశాల, నెల్లూరు.



ఈ నాడు 'గ్యారంటీ చికిత్స'ల గురించి కరపత్రాలు, పత్రికా ప్రకటనలు, వివిధ పట్టణాల్లో తేదీల వారీ క్యాంపులు, లాడ్జీగది నంబర్లతో సహా ప్రకటనలు వస్తున్నాయ్. జనంలో ఉన్న అమాయకతను, అజ్ఞానాన్ని, భయభీతుల్ని వాడుకొని 'భిషగ్గత్నలు .. వైద్య శిఖామణులు ..' విచ్చలవిడిగా విజృంభి స్తున్నారు. వివిధ ఆకర్షణలతో సొమ్ము చేసుకొంటున్నారు. ప్రజారోగ్యంతో ఆటలాడు కొంటున్నారు. ప్రజల్లో ఉన్న మూఢ నమ్మకాల్ని స్వార్థానికి ఉపయోగించుకొంటున్నారు. ఇల్లు ఒళ్లు గుల్లవటం దప్ప .. మరిన్ని జబ్బులు .. మరింత అనారోగ్యం పెరగటం తప్ప ఈ 'గ్యారంటీ చికిత్స'ల వల్ల ప్రయోజనమేమీ లేదు.

## మూఢనమ్మకాల విశ్వరూపం

ప్రశ్నలకూ .. ప్రయోగాలకూ నిలవని, .. శాస్త్రం ఒప్పు కోని .. సైన్సు సహించని విషయాల్ని మనం మూఢ నమ్మకా లంటున్నాం. ఏదయితే సిద్ధాంతీకరింపబడి, ప్రయోగానికి నిలబడుతుందో .. తిరిగి మళ్లీ మళ్లీ ప్రయోగాల్లో ఒకే విధమైన ఫలితాన్నిస్తుందో దాన్ని శాస్త్ర విజ్ఞానం , అంటున్నాం.

వాన కురిస్తే .. మెరుపు మెరిస్తే .. చెట్టు కదిలితే .. పుట్ట పగిలితే .. గ్రహాలు కనిపిస్తే .. సముద్రం పొంగితే .. భూకంపాలు వస్తే– ప్రతి దానికి భయపడ్డాడు ఆదిమ మానవుడు. తెలియని ప్రతి దానికి చేతులెత్తి నమస్కరించాడు. ప్రకృతికి బానిసగా ప్రవర్తించాడు.

దానికి తగినట్లు అర్థంగాని వన్నీ పుక్కిటి పురాణాల రూపంలో .. కాకమ్మ కథలన్నీ రూపొంది సమాజ జీవితంలో గాఢంగా .. తరతరాలుగా రక్తంలో జీర్ణించినయ్. ఈ అజ్ఞానం యొక్క, అశాస్త్రీయ భావాల యొక్క ప్రతిరూపాలే మూఢనమ్మకాలు.

చదువుకొన్నంత మాత్రాన ఈ మూఢనమ్మకాలు పోవు. ఉద్యోగం వస్తే తలనీలాలర్పించటం.. పరీక్ష ప్యాసయితే మొక్కులు చెల్లించటం .. జబ్బులు వదలటానికి .. అదృష్టం వరించటానికి తాయెత్తులు కట్టుకోవడం .. క్షుద్రదేవతల్ని పూజించటం ఈ 20 వ శతాబ్దపు చివరిలో కూడా మనం చూస్తున్నాం.

మా డాక్టర్ల సంగతే చెప్తాను. ఆపరేషన్ థియేటర్ అతి పరిశుభ్రంగా అద్దంలా ఉంచాలి అందుకే అన్ని జాగ్రత్తలు తీసుకుంటారు. ముక్కుకు మాస్క్, తలకు టోపి, చేతులకు తొడుగులూ .. పరిశుభ్రంగా వెళ్ళి ఆపరేషన్‌కు పూను కుంటారు. కాని థియేటర్ ప్రారంభోత్సవ సమయంలో కొబ్బరి కాయలుకొట్టేవాళ్లు .. అక్కడే పూజా పురస్కారాలు జరిపే వాళ్లు. తోరణాలు .. పూలూ .. ఆ చెత్తంతా అక్కడే ఉంటేవాళ్లు ప్రొఫెసర్ల ర్యాంకుల్లో కూడా ఉన్నారు. వాటి నలాగే ఉంచి ఆపరేషన్, ప్రారంభించటం మూఢాచారం కిందే వస్తుంది. అందు కనే చదువులేని మూఢులు కొందరయితే .. చదువుకొన్న మూఢులు కొందరుంటారని పెద్దలంటారు.

ఎన్నికల్లో గెలిస్తే తిరుపతికో ఎక్కడికో పరుగెత్తుతాడు. పరిశ్రమలు, వంతెనలు, బళ్లు, హాస్పెటళ్లు ఏది ప్రారంభించినా కొబ్బరి కాయలు కొట్టటం, .. హారతులివ్వటం మనం చూస్తున్నాం. ఇది ప్రభుత్వ స్థాయిలో అవలంబిస్తున్న మూఢాచారాలు.

విజ్ఞాన రహస్యాలు ఛేదింపబడుతున్నా .. ఈ చదువుకొన్న మూఢులు 'వేదాల్లోనే అన్నీ ఉన్నా యష !' అనే సూత్రంలో ప్రారంభించి పుక్కిటి పురాణాలన్నిటిని.. నిజాలుగా నిర్ధారించటానికి ప్రయత్నిస్తారు .

చదువుకొన్న వాళ్లల్లోనే ఇన్ని మూఢనమ్మకాలుంటే .. చదువు రాని వాళ్లల్లో ఇంకా ఎన్ని ఉండాలి ? మానవరూపం సృష్టింపబడనినాటి నుండి .. నేటి వరకు ఈ మూఢాచారాలు ప్రగతికి మోకాలడ్డుతూ ప్రజల్ని పీడిస్తూనే వున్నాయి.

ఇన్ని పెళ్లిళ్లు జరిగి .. కాపురాలు చేస్తూ, గంపెడు సంతానాన్ని గని, .. కోట్లాది జనాభా పెరుగుతున్న యి రోజుల్లో కూడా 'బిడ్డలు ఎలా పుడతారో .. తెలియని వాళ్లున్నారు. సంతానం కోసం వాళ్లు ఉపవాసాలుంటారు.. దేవాలయాల చుట్టూరా దొర్లుతారు.. సంతాన చెట్టుకు పీలికలు వ్రేలాడ గడతారు. సంతానం రొట్టెలు వదులుతారు. ఈ విశ్వాసాలకు మూలమేమిటి? తుమ్మితే .. దగ్గితే .. ముక్కుల్లో నుండి .. చెవుల్లో నుంచి .. కుండల్లో నుండి .. రెల్లిదుబ్బుల్లో నుండి సంతానం కలిగిన పురాణకథలు కాదా? ఆ కాకమ్మ కథలు కాదా? విజ్ఞాన మంతా వాటిల్లోనే ఉన్నదంటే మనమేం చెప్పాలి ?

గర్భం ధరించినపుడు .. బిడ్డ పుట్టినప్పుడు .. పెరుగుతున్నపుడు తల్లులకు అనేక భయాలుంటాయి. వాటిని పోగొట్టే ప్రయత్నం విస్తృతంగా చేయకపోతే, వాళ్లు అడుగడుగునా మూఢ విశ్వాసాలకు గురి అవుతుంటారు. మోటు వైద్యాల బారిపడి ప్రాణాలకే ముప్పు తెచ్చు కొంటారు.

ఆ యింట్లో ఉన్న ముసలమ్మే పెద్ద వైద్యురాలవుతుంది. దానికి పసిగందులు బలి అవుతుంటారు. ఏ తుప్పు పట్టిన కత్తితోనో బిడ్డ పుట్టగానే

బొడ్డు కోస్తారు. ఆపైన ఓ పేడ ముద్ద అంటిస్తారు. బూడిద పులుంతారు. దానితో సూక్ష్మజీవులు చేరి ధనుర్వాతం కమ్ముతుంది.

కొందరు తల్లులకు కాన్పుకాగానే పాలు పడవు. అప్పుడు ఖచ్చితంగా బిడ్డకు నీళ్ళు పట్టాలి. పాలు పడితే ఆ ముర్రు పాలను పిండి పారబోస్తారు. అదీ మూఢనమ్మకమే. ఆ పాలల్లో కావల్సిన పోషకాహారాలన్నీ ఉంటాయి. కాన తప్పక తాగించాలి.

విరేచనాల అయి బిడ్డ నీరసిస్తుంటే కనీసం నీళ్లు కూడ ఇవ్వరు. ఇస్తే ఇంకా ఎక్కువ అవుతాయని నమ్మకం. విరేచనాల ద్వారా శరీరంలోని ద్రవమంతా బయటికి పోతుంది. శరీరం పోషక లవణాలు అనేకం బయటికి పోతాయి. అందువల్ల పంచదార -ఉప్పు కలిపిన ద్రవాన్ని తాగిస్తేగాని ఆ బిడ్డ బ్రతకడు అదే 'పానీయ పద్ధతి'.

'లంఖణం పరమౌషధం' అంటారు. ఈనాటి వైద్య విధానం దాన్ని ఒప్పుకోదు. జ్వరం ఉన్నా ఆహారం పెట్టాలి. స్నానం చేయించాలి. లోపించిన శక్తిని శరీరానికి ఇస్తూ .. రోగ నిరోధక శక్తికి దోహదం చేయాలి తప్ప, ఉపవాసాలుంచి మరింత నీరస పరచకూడదు.

వయసువచ్చినప్పుడు ప్రకృతి సిద్ధమైన పలు సందేహాలు వస్తుంటాయి. వాటిని తీర్చేవాళ్ళు ఎవరూ ఉండరు. కన్నవాళ్ళు చెప్పరు. గురువులూ బోధించరు. దానితో సెక్సుకు సంబంధించిన మూఢనమ్మకాలతో యువతరం కొట్టుకు పోతున్నది. అందుకే సెక్సు వైద్యుడుగొంది కొకడు సందుకొకడు తయారవుతున్నాడు. డబ్బు గుంజి మరింత అజ్ఞానానికి, భయానికి గురిచేస్తున్నాడు.

అమ్మాయి పుష్పవతి అయితే .. మూల కూర్చోబెడ తారు. తలదిప్పితే తప్పు .. కన్నెత్తితే తప్పు .. సర్వ స్వేచ్ఛలూ హరింపబడతాయి. కట్టుబాట్ల పేరుతో బానిసలా బ్రతుకు తుంది. వంటయింటి కుందేటిగా మారుతుంది.

చెవిలో చీము వస్తే బీడీలు తాగించటం, పచ్చకామెర్లు వస్తే కళ్ళల్లో పసర్లు, మణికట్టు వద్ద కాల్చటం .. ఇలా చెప్పుకొంటూ పోతుంటే పెద్ద లిస్టు అవుతుంది.

ఇవన్నీ వైద్యం పేర చలామణీ అవుతున్న మూఢ విశ్వాసాలు .

చదువుల్లో శాస్త్రీయ విజ్ఞానం లేకపోవడం .. నిరక్ష రాస్యులు ఎక్కువగా ఉండటం .. పుక్కిటి పురాణకథలు నమ్మకాలు ఇంటింటా వ్యాపించటం ఈ విశ్వాసాలకు మూలం .

అందువల్ల ఉపాధ్యాయ వర్గం సందర్భం వచ్చినపుడల్లా, నిస్సంకోచంగా వీటన్నిటిని విడమరచి చెప్పాలి. శాస్త్రజ్ఞానాన్ని పెంపొందించి మూఢ విశ్వాసాల బారి నుండి బావి పౌరుల్ని కాపాడాలి.

# ప్రజల ఆరోగ్యమా?
# మందుల కంపెనీల సౌభాగ్యమా

— డా. వి. బ్రహ్మారెడ్డి
పీపుల్స్ హెల్త్ సొసైటీ, కర్నూలు



అది 1965 నాటి సంగతి. ఒక రోజు మా స్కూల్లో జరిగిన సంగతి మీకు తెలియజేస్తాను .. ఇంకొద్ది సేపట్లో క్లాసు మొదలు కాబోతుంది. మా హెడ్మాష్టరు ఒక బక్క వ్యక్తిని తన వెంట తీసుకొని మాక్లాసురూంలోకి వచ్చారు. అందరూ లేచి నిటబడ్డాము. అందరినీ కూర్చోమని చెప్పి " ఈయన సోషల్ స్టడీస్ మాష్టరు. ఈయనకు క్షయ జబ్బు వచ్చింది. దానికి వైద్యం చేయించుకోవటానికి ఆర్థికవసరులు లేక యిలా స్కూళ్లన్నీ తిరిగి విద్యార్థులను, ఉపాధ్యాయులనూ ఆర్థిస్తున్నారు. మీకు తోచినంత సహాయం చేయండి" అని ముగించారు.

శనగపప్పులు కొనుక్కోటానికి యింట్లో పోరుపెట్టి తెచ్చుకొన్న పదిపైసలు యిచ్చాము. ఆనాడు మాకు తెలియని అనేక విషయాలు ఈ ఇరవైనాలుగేళ్లలో అర్థమయ్యాయను కోండి. ఆ ఉపాధ్యాయునికి క్షయరోగం ఎందుకొచ్చింది? ఎందుకు వైద్యం చేయించుకోలేకపోయాడు? భవిష్యత్తరానికి విద్యాదానం చేస్తున్న ఉపాధ్యాయుడు ఆరోగ్యదానం కోసం ఎందుకని దేబిరించాల్సిన గతి పట్టింది? ఆస్థిహక్కు ప్రాథమిక హక్కుగాగల ఈ దేశ రాజ్యాంగంలో ఆరోగ్యంగా బ్రతికే హక్కు ప్రాథమిక హక్కులనుండి పరుగెత్తి ఆదేశిక సూత్రాలలో ఎందుకు తలదాచుకోవాల్సి వచ్చింది? - ఇలాంటివే కొన్ని వందల ప్రశ్నలు తలను బ్రద్దలు చేస్తుంటాయి.

## రోగాలెందుకొస్తాయి ?

రోగనిరోధకశక్తి తగ్గితే శరీరం రోగాల పాలవుతుంది. రోగ నిరోధకశక్తి సమృద్ధిగా ఉండాలంటే తిండి పొట్టనిండా ఉండాలి. మంచినీళ్లు, మంచి పరిసరాలు, ఆరోగ్యం గూర్చిన కనీస విద్య, యివన్నీ సంపాదించుకోటానికి డబ్బు, ఆడబ్బు కావాలంటే "పని" కావాలి. వచ్చే జీతం చాలని ఉపాధ్యాయుడు తను తనీతినక కనీసం పిల్లలకన్నా కడుపునింపుదామనుకున్నాడు. శరీరంలో రోగ నిరోధక శక్తి తగ్గిన మాష్టారు, రోజూ నల్లబల్ల మీద చాక్‌పీసుతో రాసి రాసి, రాలినంత చాక్పీసు పొడి నేలమీద రాలగా, మిగిలిందల్లా తను పీల్చాడు. పీల్చి పీల్చి ఊపిరితిత్తులు మరింత పాడు చేసుకొన్నాడు పాడయిన ఊపిరితిత్తులను పరమాన్నంగా భావించి క్షయరోగ క్రిములు ఆశ్రయించాయి. ఆయన డాక్టరు దగ్గరకెళ్ళాడు. "మీరు మంచి తిండి తినాలి, విశ్రాంతి తీసుకోవాలి, నేను రాసిచ్చే మందులు క్రమం తప్పకుండా ఒకటిన్నర సంవత్సరాలు తినాలి" అన్నాడు. "విశ్రాంతి తీసుకొంటే జీతం ఎవరిస్తారు? ఇప్పుడు తినేతిండే గుండుసున్నా అవుతుంది కదా? మంచి తిండెలా తినాలి? మందు లెలాకొనాలి ?" యిలా స్వగతంలో అనుకొని , బ్రతకాలనే కోరిక చావక ప్రభుత్వాన్నడిగాడు. 'నీ ఉద్యోగం పీకేస్తామని' చెప్పింది ప్రజాస్వామ్య ప్రభుత్వం. గత్యంతరం లేక స్కూలు పిల్లల ముందు చేయిచాచాడు .

## అడిగేదొకటి ! యిచ్చే దింకొకటి !!

తిండిలేక రోగాలు వస్తున్నాయి. వారికి తిండి అందించాలి, కాని తిండి బదులు " మాటానిక్కులు త్రాగండి, మా బూష్టు, బోర్నవిటాలు, హార్లిక్సులు త్రాగండి, మా లాక్టోడెక్సు, మా పారెక్సు తినిపించండి " అని వెంటబడ్డాయి కంపెనీలు. ఇరవైఅయిదు రూపాయలు పెట్టి కొనే టానిక్కులో 20 పైసల సారాయి, మరో ఇరవై అయిదు పైసలకు ఎందుకు, ఎలా పనిచేస్తుందో ఎవరికి తెలియని గ్లీజరు ఫాస్పేట్లు, ఇంకో ఐదుపైసలకు విటమిన్లు ఉంటాయి. అంతా కలిపి యాభై పైసలు ఖర్చు అవుతుంది. "ఆకర్షణీయమైన టోపీలు, అంద మైన ప్యాకింగులు, ప్రలోభపరిచే వలల'తో ముస్తాబై వచ్చిన" టానిక్‌ను త్రాగకపోతే యిక నాబ్రతుకెందుకూ? అనుకునేట్లు ఉంటుంది ఆర్భాటం.

'డాక్టరుగారూ! మా టానిక్‌లు రాయండి. మీకు స్కూటరు యిస్తాము. కాదంటే కలర్ టి.వీ యిస్తాము' అంటే పాపం ఏ డాక్టరు మడికట్టుకొని కూర్చొంటాడూ !

ఇలాంటి దండగ మారి మందులు టానిక్కులొక్కటే అనుకోవద్దు. ఎంజైము సిరప్‌లు, బి కాంప్లెక్సు సిరప్‌లు, దగ్గు మందులు, జలుబు మందులు .. యివి యిలా హనుమంతుని తోకంత ఉన్నాయి. కేవలం 256 మందులు చాలని ప్రపంచ ఆరోగ్య సంస్థచెప్తే, ఈరోజు మనదేశంలో 65,000 రకాల మందులున్నాయి. మనదేశంలో ఏటా రెండువేలకోట్ల రూపాయలు మందులకోసం ఖర్చు చేస్తున్నాము. ఈ అనవసరపు మందులు మూత్రంలోకి పోతాయి. మూత్రం డ్రైనేజి కాలువలోనికి పోతుంది. ఈ పేద భారతదేశం 500 కోట్ల రూపాయలు అనవసరమైన మందుల కోసం 1500 కోట్ల రూపాయలు డ్రైనేజికాలువల బలం కోసం వాడేంత విలాసంగా జీవించగల్గుతుందన్న మాట !

... మురుగ్గుంటలు పూడ్చెయ్యండి దోమలు పెరగవు. దోమలు పోతే మలేరియా పోతుంది అని మనం అంటే ...

"జ్వరమా ? మలేరియా కావచ్చు. క్లోరోక్విన్ బిళ్ల మ్రింగండి " అంటారు. డి.డి.టి. చల్లుతాము అంటారు. అలా చల్లి చల్లి చివరకు దోమలు డి.డి.టి తిని బలవటం మొదలెట్టాయి. క్లోరోక్విన్ తయారు చేసేమందులు కంపెనీ బాగు పడాలంటే మలేరియా ఉండాలి, పెరగాలి.

రక్షిత మంచినీళ్లు సరఫరాచేస్తే టైఫాయిడ్, అమీబి యాసిస్,

పొట్టలో పురుగులు, పచ్చకామెర్ల జబ్బు, పోలియో, అతిసారవ్యాధి, కలరా మాయమై పోతాయి. మాయమై పోతే ఎలా? ఈ జబ్బులు కోసం మందుల తయారుచేసే మందుల కంపెనీలేమైపోవాలి ?

చక్కెర గ్లూకోజ్ రెండూ శరీరంలోకి పోయాక ఒకటే అని చెప్తే, జనం అంతా ఈరెండు మాటలూ విని గ్లూకోజ్ తినటం మానేస్తే "గ్లూకోన్- డి" ని తయారు చేసే 'గ్లింజియా' కంపెనీ ఏం కావాలి ? 11/2 లక్షల పెట్టుబడితో వచ్చిన గ్లాక్సు ఇప్పుడు (దీని పేరు గ్లింజియా కంపెనీ) ఒక్క 1984 లోనే 11 కోట్లకు పైగా లాభాలు తమ మాతృదేశమైన బ్రిటన్‌కు తీసుకెళ్లింది. 200 సంవత్సరాల పైచిలుకు దేశాన్ని దోచుకుతిన్న బ్రిటిష్ పాలకులు పోయారుగాని దోపిడీమాత్రం కొనసాగుతూనే ఉంది.

మూడు పైసలు ఖరీదు చేసే "య్యాస్ప్రిన్" బిళ్లను "డిస్ప్రిన్" పేరుతో "రికెట్ కోల్‌మన్" కంపెనీ 22 పైసల కమ్ముతుంది. ఐదుపైసల ఖరీదు చేసే పారాసిటమాలిన్ "కాల్పాల్ " పేరుతో వెల్‌కం కంపెనీ పావలకు అమ్ముతుంది. "బ్రాండ్ నేమ్‌తో గ్రాండ్ మోసం" చేయటానికి ప్రభుత్వం ఎందుకు అనుమతించినట్లు ?

## నీరో ప్రభుత్వం

'ఇ.పి. పార్టు లాంటి మందులు గర్భిణీ స్త్రీలకు ప్రమాదకరమని నిపుణులు చెప్పి, నానా గొడవ చేసింతర్వాత చెవుడు నటిస్తున్న ప్రభుత్వం 1981 లో నిషేధించింది. దానిమీద ఆ మందులు తయారుచేసే కంపెనీలు హైకోర్టులో స్టే ఆర్డర్లు తీసుకొచ్చుకున్నాయి. ఈ సమస్య మీద తగిన చర్య తీసుకోటానికి మన కేంద్రప్రభుత్వానికి 1988 వరకు తీరిక దొరకలేదు !

కిలో రూ. 1810 రేటు చొప్పున అమ్మాల్సిన "బరాల్గన్" ను "హెక్ట్స్" కంపెనీ రూ. 20,000 అకు అమ్ముతుందని గుర్తించిన ప్రభుత్వము ఆ కంపెనీకి తాఖీదు పంపింది. రూ. 20,000 నుండి రూ.2000 కి తగ్గిస్తామన్నది కంపెనీ." రాట్ కుదరదు రూ 1810 లకే అమ్మాలి" అన్నది ప్రభుత్వం. హెక్ట్స్ కంపెనీ ఢిల్లీ హైకోర్టుకెక్కి 1984 లో స్టే ఆర్డరు తెచ్చుకొన్నది. ఇంతదాకా ఈ ప్రభుత్వము ఈ స్టే ఆర్డరు వెకేట్ చేయలేదు. 1984 నుంచి యిప్పటివరకు బరాల్గన్ కిలో రూ. 20,000 కే అమ్ముడు పోతున్నది.

1986 లో కేంద్రప్రభుత్వము నూతన మందుల విధానం ప్రకటించింది. అందులో... 1 వ రకం మందుల ధరల్ని 40 శాతం నుంచి 60 శాతంకి పెంచుకుంటామని మందుల కంపెనీలు అడిగితే, ప్రభుత్వం 75 శాతంకి పెంచుకోవటానికి అనుమతి యిచ్చింది.

2 వ రకం మందుల్ని 55 శాతం నుండి 90 శాతం పెంచుకోనిమ్మని కంపెనీలు అడిగితే 100% పెంచుకోవటానికి ప్రభుత్వం అనుమతి యిచ్చింది.

3 వ రకం మందుల్ని 100% నుంచి 15% పెంచు కొమ్మని కంపెనీలడిగితే "అపరిమితంగా" పెంచుకోమన్నారు.

"మరో వైపు ... నూటికి 60 మంది పేదరికం గీత క్రింద మగ్గుతున్నారు. వీరినుద్ధరించండి, ఈ దేశంలో పేదరికమే అన్నింటి కన్నా పెద్దరోగం . పేదరికం పోతే నూటికి 75 రోగాలు మాయమయిపోతాయి " అని అడిగితే "శభాష్" నూటికి అరవై మందిని 40 మందికి తగ్గిస్తున్నాం అన్నారు ప్రభుత్వ నేతలు ఎలా? పేదరికం తొలగించికాదు ... పేదరికం గీతను క్రిందకు లాగి.

మందుల కంపెనీల యజమానులుగా ఉండే ప్రజల కోసం, ప్రజలయొక్క ప్రజలచేత పరిపాలించబడుతున్న ప్రభుత్వం దృష్టిలో ప్రజల ఆరోగ్యం కన్నా ప్రజల రోగాలకే ప్రాధాన్యత ఉంటున్నది. రోగాలుంటే మందులమ్ముకోవచ్చు. మందులమ్ముకొంటే మందుల కంపెనీలు సౌభాగ్యంగా ఉండవచ్చు. ఆగండి ! ఆలోచించండి !! ఈ పరిస్థితి మార నక్కరలేదా?



# సూత్రబద్ధ వైఖరే ఉద్యమాభివృద్ధికి ప్రాణం !

– శ్రీ మోటూరు హనుమంతరావు, యం.పి.

గాలివాటంలకు కొట్టుకు పోయేవాళ్ళు, అవకాశవాదం అవలంబించే వాళ్ళు, కాలపరీక్షకు నిలవ నేరు. వాళ్ళ నాయకత్వం వహించే ఉద్యమాలు కూడా అంతంత మాత్రంగానే ఉండి క్రమ క్రమంగా నిర్వీర్యమవుతాయి.

. ప్రాంతాయ విభేదాలతో ..ఓ ప్రక్క జై తెలంగాణా.. మరో ప్రక్క జై ఆంధ్ర ఉద్యమాలు పెచ్చరిల్లిన వేళ ..అన్ని సంఘాలూ దానికి మోకరిల్లితే యు.టి.యఫ్.మాత్రం సూత్రబద్ధ వైఖరితో నికరంగా రాష్ట్ర సమైక్యతకు నిలబడింది. కాబట్టే అది నానాటికీ పెరిగి పెద్దదై సమైక్యతా సూత్రంతో పటిష్ఠమయింది. ఎన్నో అగ్ని పరీక్షల్లో నెగ్గి పీడితోపాధ్యాయులకు ఆశాజ్యోతిగా వర్ధిల్లుతున్నది. అటువంటి ఆశయోత్సాహం .సూత్రబద్ధ వైఖరీ, అపార దీక్ష, త్యాగ దృక్పథాన్ని నేను అభినందిస్తున్నాను.

ఉపాధ్యాయులు, ప్రజలకు బాధ్యత వహించాలి.ప్రజలంటే కార్మిక, కర్షకులు. వాళ్ళల్లో అధికులు పొట్టబొడిస్తే అక్షరం ముక్క రాని వాళ్ళు. అజ్ఞానంతో, దారిద్యంతో కునారిల్లే వాళ్ళు. వారికి సేవల్ని అందించటం మీ విధ్యుక్త ధర్మం. వృత్తి ధర్మాన్ని సక్రమంగా నెరవేర్చినపుడే ప్రజాదరణ లభిస్తుంది. ప్రజల అండఉంటే ఏ ఉద్యమమయినా జయిస్తుంది.

. ఉపాధ్యాయులు దానితో పాటు జాతీయ, అంతరాత్జీయ పరిణామాలను విశ్లేషించి వివరించే బాధ్యత తీసుకోవాలి. మీ అధ్యయనాన్ని, అధ్యాపనాన్ని, అలా విస్తరింప జేయాలి. ఉదాహరణకు చైనాలో ఇటీవల జరిగిన పరిణామాల్ని ఒక్క సారి గమనంలోకి తెచ్చుకోండి.

నిజంగా అక్కడ విప్లవ ప్రతీత శక్తులు విజయం సాధించి ఉంటే సోషలిష్టు వ్యవస్థకు, అలీన విధానానికి, ప్రపంచ శాంతికి తూట్లు పడి ఉండేవి. ఈనాడు సోషలిష్టు శిబిరం లేకుంటే ప్రపంచం సామ్రాజ్యవాదుల వేటభూమిగా మారి ఉండేది. పీడనాతాడనా..దోపిడీ రాపిడీ విచ్చల విడిగా సాగుతుండేవి.

చైనాలో జరిగిన పరిణామాలను జాతీయ, అంతర్జాతీయ వార్తా సంస్థలు, స్వదేశీ, విదేశీ పత్రికలు చిలవలు పలవలు చేసి భయంకరంగా చిత్రించాయి. చైనాలో ప్రజాస్వామ్యం లేదనే కేకలువేసే వాళ్ళను నేను కొన్నిప్రశ్నలడుగుతాను.

ఇండోనేషియాలో ఐదులక్షలమంది ఊచకొత కోసి నపుడు మీకేకలు ఏమయ్యాయి? చిలీలో అలెండీని హత్యచేసినపుడు మి ప్రజాస్వామ్యం ఏమయింది ? గ్రెనడాపై అమెరికా దాడి చేసినపుడు నోరు విప్పలేదేమి ? దక్షిణాఫ్రికాలో జాత్యహంకార ప్రభుత్వం నల్లజాతి వాళ్ల ప్రాణాలు హరిస్తుంటే మి కలాలు ఏమయ్యాయి? ఇజ్రాయిల్ పాలకులు పాలస్తీనియన్లను చంపుతున్నప్పుడు మీ గళాలు ఎందుకు మూగ బోయాయి ?

ఇవన్నీ ఆలోచించినపుడే ఈ ధుమారానికి మూలం అర్థమవుతుంది. ఒక్క మాటలో చెప్పాలంటే ఎన్ని దుమారాలు రేగినా సోషలిజం అజేయం. అనుభవాలనుండి గుణపాఠాలు తీసుకొంటూ ముందుకు సాగుతూనే ఉంటుంది. ప్రజాస్వామ్యమనే పంచదార పూసి ఉక్రోషంకొద్ది ఎన్ని గావుకేకలు పెట్టినా సామ్రాజ్యవాదం . వారికి వత్తాసు పలికేవాళ్లు కాలగర్భంలో కలిసి పోతారు. ఈ నిజాల్ని ఎప్పటి కప్పుడు అధ్యయనం చేసి ప్రజల్ని నిత్య జాగరూకుల్ని చేయవలసిన బాత్యత మీపై ఉంది.

మరో ఆరు నెలల్లో లోక్‌సభ ఎన్నికలు జరగ బోతున్నాయి. ఇప్పుడు వచ్చింది పంచాయితీ బిల్లు. ఇన్నేళ్ల నుండి తమ అధికారంలోఉన్న రాష్ట్రాల్లో అసలు పంచాయితీఎన్నికలే జరవని వాళ్ళు, గ్రామీణ ప్రజల్ని పట్టించు కోని వాళ్లు ఇప్పుడు సరాసరి సహాయమంటూ రాజ్యాంగ సవరణ జేసి రాష్ట్రాల హక్కుల్ని హరిస్తున్నారు. మొసలి కన్నీరు కారుస్తూ ఓట్ల కోసం వలలు విసురు తున్నారు. అలాగే జవహర్ రోజ్ గార్ యోజన. ఇంటింటికీ ఉద్యోగ మిస్తారట, దారిద్ర్యాన్ని రూపుమాపుతారట! నలభై రెండేళ్ల నుండి గుర్తుకు రాని ప్రజా సంక్షేమం, నిరుద్యోగ నిర్మూలన, దారిద్ర్య నిర్మూలన ఇప్పుడు గుర్తుకు వచ్చాయి. పార్లమెంటు ఎన్నికలు వచ్చే సరికి వరాలు కురిపిస్తున్నారు. ఈ మోసాన్ని, చౌకబారు ప్రచారాన్ని ఉపాధ్యాయులు నిత్య అధ్యయనంతో అర్థం చేసుకోవాలి. ప్రజలకు వాటిని విడమరచి చెప్పాలి. ఆశాపాశాల ఉచ్చుల వలల్లో పడకుండా చూడాలి. మన క్కావల్సింది నిజం చెప్పటం.. విద్యార్థుల్ని ఆ విధంగా మల్చటం ఉపాధ్యాయుల నుండి నేను ఆశిస్తున్నదదే!



# సాహిత్యం సమాజాభివృద్ధికి తోడ్పడాలి!

– డా. ఎ.పి. విఠల్
అధ్యక్షుడు,
ఆంధ్రప్రజానాట్యమండలి.

సాహిత్యమనేది ఏభావ ప్రపంచానికో అలౌకిక తత్వానికో చెందింది కాదు. అది సమాజానికి అతీతంగా ఏనాడూ లేదు. భావ ప్రపంచం, భౌతిక ప్రపంచం నుండే ప్రభవిస్తుంది. సమాజ పరిణామానికి అనుగుణంగానే సాహిత్య పరిణామం కూడా ఉంటుంది.

మన ఆలోచనలన్నీ మన భౌతిక పరిస్థితికి అనుగుణం గానే వస్తాయి. రైలో .. బస్సో ఎక్కితే మన ఆలోచనలన్నీ ఆ ప్రయాణాన్ని గురించే ఉంటాయి. డబ్బు సంపాదించే డాక్టర్ ఆలోచనలైతే 'మీ ఆరోగ్యమే నా మహాభాగ్యం' అన్నట్టుంటుంది. కాన మన ఆలోచనలనండి .. సాహిత్యమనండి భౌతిక ప్రపంచా నికి అతీతంగా ఉండవు.

## అసలు సాహిత్య మంటే ఏమిటి ?

తెలంగాణా ప్రాంతంలో ' బ్రాహ్మడొచ్చాడు .. ఇంత సాహిత్యం తెచ్చి పెట్టు' అంటాడు ఇంటాయన. ఆవిడ విస్తరాకులో బియ్యం .. పప్పు .. ఉప్పు .. చింతపండు కూరగాయలు పట్టుకొస్తుంది. దాని ప్రకారం సాహిత్యం అంటే 'తిండి' అనేది స్పష్టం. కాన ఏ సాహిత్యం ఎట్లా ఉన్నా తిండి అనేది ముఖ్యం. పస్తులు ఉండే వాళ్లకు సాహిత్యమూ అఖ్కర లేదు.. చట్టుబండలూ అఖ్కరలేదు. కాన సాహిత్య మనేది పూర్తిగా భౌతిక ప్రపంచానికి చెందిందనేది పై ఆచారం పరోక్షంగా మనకు చెప్తుంది.

సాహిత్యం అంటే 'హితం' తో కూడినది. 'మంచి' తో కూడినదని మరో అర్థం. అయితే ఏదిమంచి ? ఎవరికి మంచి ? అనే ప్రశ్నలు వస్తాయి. సర్వకాల సర్వావస్థల్లో ఈ మంచి అనేది ఒక విధంగా ఉండదు. మామూలుగా అయితే మనిషిని చంపటం నేరం. అదే యుద్ధంలో అయితే వీరకృత్యం. కాన నీతినియమాలుగాని, న్యాయాన్యాయాలుగాని ఆయా కాలమాన పరిస్థితిని బట్టి మారుతూ ఉంటాయి. అలాగే సాహిత్యంకూడా మారుతూ ఉంటుంది.

సమాజం సమానంగా ఉండే దశ నుండి, కష్టపడి పనిచేసే వాళ్లు .. వాళ్ల కష్టం మీద ఆధార పడే వాళ్లూ బానిస, రాచరిక వ్యవస్థలు వచ్చాయి.

రాచరిక వ్యవస్థ బ్రతకాలంటే రెండే రెండు మార్గాలు న్నాయి. ఎదురు తిరిగిన వాళ్లను ఆయుధాలతో హతమార్చి అణగ త్రొక్కటం ఒక మార్గం. మనసుల్ని వాళ్ల భావాల్ని తమవైపు తిప్పుకొని ఆకట్టు కోవటం రెండోమార్గం.. రాజు సాక్షాత్తు విష్ణువు, "నావిష్ణుః పృథివీ పతిః" అనేది అప్పుడే పుట్టింది. దేవుడికి ఎదురు తిరిగితే నాశనమై పోతావు. అలాగే రాజుకు ఎదురు తిరిగితే పుట్టగతులుండవు అని దాని భావం.

ఈవిధంగాతమ పెత్తనం నిలబెట్టే కవిత్వాన్ని రాచరిక వ్యవస్థ పెంచి పోషించింది. ఆస్థాన కవుల్ని సృష్టించుకొన్నది. అగ్రహారాలిచ్చి పోషించింది. ఇక ఆ కవులు ఏరచన చేసినా ఆరాజు 'ఇంద్రుడూ .. చంద్రుడూ.. మన్మథుడూ ! ఆడింది ఆట పాడింది పాట !'

శ్రీనాథుడంతటి వాడు రాచరిక వ్యవస్థలో అణగి మణగి ఉండక తప్పలేదు. రాజాశ్రయంలోనే ఆకవి సార్వభౌముని జీవితమంతా గడిచింది. 'మంచినీళ్లు కావాలి' అనటానికి' "సిరిగలవానికి చెల్లును .. పరమేశా గంగ విడుము పార్వతి చాలున్," అని కవిత్వం చెప్పిన మహాకవి శ్రీనాథుడు తక్కువ వాడేమీ కాదు.

కాని అదే సందర్భంలో ఆ రాచరిక వ్యవస్థకు వ్యతిరేకంగా దానిన ఈసడిస్తూ "కర్ణాటకరాటకీచకులకు సరస్వతిని అమ్మను" అని ఎదురు తిరిగాడు పోతన.

అలాగే భక్తి తత్వ కవిత్వం రాచరిక నిరంకుశత్వానికి వ్యతిరేకంగా ఆవిర్భవించిందే. వేమన, తుకారాం, పోతులూరి వీరబ్రహ్మం వంటి వారంతా ఆనాటి సమాజ దుర్లక్షణాలకు వ్యతిరేకంగా నిలబడ్డారు. వాళ్లువెనుకబడిన వర్గాల వారవటం యాదృచ్ఛికంగాదు. ఆ విధంగా ప్రభువుల్ని పొగిడే సాహిత్యం .. వాళ్ళ నిరంకుశత్వాన్ని తెగిడే సాహిత్యం పుట్టాయి.

ప్రజా ఉద్యమాల నుండి ఉద్భవించే సాహిత్యం సజీవంగా ఉంటుంది. మా కొద్దీ తెల్లదొర తన మనే గేయం .. భరత ఖండంబు చక్కని పాడి యావు అనే పద్యం అప్పుడు పుట్టినవే.

అలాగే తెలంగాణా సాయుధ విప్లవ పోరాటం ఎందరినో రచయితలుగా తీర్చిదిద్దింది. ఎంతో సాహిత్యాన్ని సృష్టించింది. ఆ పాటలు .. ఆ కథలు .. ఆ నవలలు ఇప్పటికీ సజీవాలే. అలా సాహిత్యం ప్రజల నుండి పుట్టి ఉద్యమాలకు బాసటగా నిలుస్తుంది.

ప్రస్తుత యుగంలో ఇప్పుడున్న వ్యవస్థ ఇలాగే ఉండాలనే వాళ్లు .. అది మారాలనే వాళ్లు ఉన్నారు. సెక్స్, క్రైం, క్షుద్ర సాహిత్యాలు ప్రజల చైతన్యాన్ని ప్రక్కదార్లు పట్టించి సొమ్ము చేసుకొనే విధంగా దోపిడీవ్యవస్థను పరోక్షంగా బలపరుస్తు న్నాయి. అవాస్తవిక జీవితాల్ని చిత్రిస్తూ పుంఖాను పుంఖాలుగా నవలలు, సీరియల్స్‌గా వెలువడుతున్నాయి.

'స్త్రీ అనుభవం ఎలా ఉంటుందో తెలుసు కోవాలని ఓ నవల మూల కథ. అది ఓ పత్రికలో 20 వారాలు సీరియల్ గా నడిచింది.

ఇదే సందర్భంలో మంచి కథలు నవలలు రాకపోలేదు.

'ఆరోజు ఆగష్టు పదిహేను
బ్యాడ్జీ పది పైసలన్నారు తోటి వాళ్లు
అమ్మనడిగేడు పదిపైస లిమ్మని
ఆమె లేదన్నది
దారిలో దొరికిన బ్యాడ్జీ అతనికి హుషారిచ్చింది
అయితే దానికి గుండు సూది లేదు
తుమ్మముల్లు కోసం వెతికేడు

తీరా చూస్తే ఆ ముల్లుతో బ్యాడ్జీని గుచ్చుకోవటానికి అతనికి చొక్కాలేదు 'ఛీ ... ఈ స్వాతంత్ర్యం నాకఖ్ఖరలేదని విసిరి కొడతాడు బ్యాడ్జీని. - ఇదీకథ. చిన్నదైనా ఎవరి గుండెల్లో నైనా గుచ్చుకొని చిరకాలం గుర్తుండే కథ.

బస్సులో ప్రయాణం చేసే దంపతుల కథా అంతే

ఒక చిన్న టికెట్టు, ఒక పెద్ద టికెట్టు ఇవ్వ మంటాడు ఆ పల్లెటూరి రైతు. కండెక్టర్ నివ్వెర పోతాడు

రెంటి ఖరీదూ ఒకటే .. చిన్నవి పెద్దవీ ఉండవంటాడు

అయితే పొలం పనికి నా భార్యకు అయిదూ .. నాకు ఎనిమిది ఇచ్చారు ఎందుకని? నిలదీస్తాడు ఆ కష్టజీవి.

- ఈకథలో ఎంత యదార్థం ?

ఎంత శిల్పం ?

ప్రజల అసంతృప్తికి తగినట్టు ప్రజా ఉద్యమాలు లేకపోతే అడ్డదారిలో దొడ్డిదారిలో పుడతాయి. అదే నక్సలిజం! ఏహ్య భావాలు పుడతాయి.. అదే దిగంబర కవిత్వం !

సమాజ చైతన్యం చూడటం గాక, ఉద్యమాలు నిర్మించటం గాక అలా కొట్టు కవిత్వాలు తిట్టు కవిత్వాలు పుడతాయి.

మీరంతా జాతి నిర్మాతలు . మీలో కవులూ .. సృజనాత్మక శక్తిగల కళాకారులు ఉండొచ్చు. మనకి ప్రజా కవిత్వం గావాలి. మజా కవిత్వం అక్కర్లేదు.

మీది కష్టాలకు, కన్నీళ్లకూ స్పందించే ఉద్యమం.

దేశ దుస్థితిని కళ్లారా చూస్తున్న ఈ దశలో అభ్యుదయం, సామ్యవాద దృక్పథం గల సాహిత్యం రావాల్సిన అవసర మున్నది.

కాన కులమత విభేధాలకు వ్యతిరేకంగా, పాశవిక రాక్షసత్వాలకు వ్యతిరేకంగా మూఢ విశ్వాసాలకు వ్యతిరేకంగా బిడ్డల్ని తీరుగా మల్చండి.

సమాజాభివృద్ధికి తోడ్పడే విధంగా వాళ్ల భావాల్ని ప్రగతి పథంలోకి మరల్చండి. వారిలో ఉన్న సాహితీ పిపాసను సమాజాభివృద్ధికి తోడ్పడే విధంగా తీర్చి దిద్దండి.



'నేతపని' ఉత్తమ పాఠ్య ప్రణాళిక రచయిత
శ్రీ దోగిపర్తి రమణయ్య

కవిత్వం ...
ఏ అవరోధాలనూ లెక్కి
కవిత్వం ...
సాయుధం, స్వేచ్ఛాయు

కవిత్వానికి భయం లేదు
బాగా పరికించి చేడండి
- మయకోవ్ స్కీని, హిక్‌మత్ నూ
పాబ్లో నెరూడానూ, లూటీ అంగానూ

మీ కవిత్వాన్ని
పరాజయం పాలు కానివ్వ లేదు మేం
దేశం దేశమంతా కలిసి
ఓ మహాకావ్యాన్ని వ్రాసే
ప్రయత్నంలో ఉంది
అన్ని అలంకారాలూ
"పోరాటం అనే ఛందస్సులోనే
లిఖించబడుతున్నాయి !

"సమకాలిన్ జనమత్" వార పత్రిక సౌజన్యంతో

## స్పందన - అభినందన !

శ్రీ ఇల్లూరి నాగరత్నం
బెళగళ్, కర్నూలు జిల్లా



వందనాలు ... వందనాలు
అభినందన నందనాలు
సురభిళ హరి చందనాలు
ఐక్యోద్యమ బంధనాలు
అరుణారుణ కేతనాలు

ఆటపాటల పోటీలు
నేత సందేశాలు
సాహిత్యపు సౌరభాలు
సంగీతపు మధురిమలు
చిందెను ఆనందాలు
ఎద ఎదలో ఉత్సాహం
పొంగి పొరలే ఉత్తేజం

యు.టి.యఫ్. నేతలార !
ఉద్యమ ప్రతినిధులారా !
అందుకోండి అభినందన !
ఉప్పొంగిన ఎద స్పందన !

సమీక్ష

# విజ్ఞానం వెల్లివిరిసిన వస్తుప్రదర్శన

-శ్రీ టి.జి. సంజీవరావు
డైరెక్టర్, యు.టి.యఫ్ అకడమిక్ సెల్

ఉపాధ్యాయుల్లో విద్యార్థుల్లో సృజనాత్మక శక్తిని ప్రోత్సాహిస్తే అది ఒక ఉద్యమంగా సాగిస్తే ఎటువంటి మంచి ఫలితాలు వస్తాయో యు.టి.యఫ్ మహాసభల సందర్భాన ఏర్పాటుచేసిన వస్తుప్రదర్శన రుజువు చేసింది.

ఈ ప్రదర్శనలో ముఖ్యంగా 5 విభాగాలున్నవి. వివిధ జిల్లాలకు చెందిన ఉపాధ్యాయులు, విద్యార్థులు రూపొందించిన పాఠ్యాంశాలకు సంబంధించిన వస్తువులేగాక, విద్యావిధానాలపై స్పందించిన విమర్శనాత్మకమైన కార్టూన్‌లూ, చరిత్రపరిశోధనా కృషిని సూచించే వస్తువులూ ఈ ప్రదర్శనలో చోటు చేసుకొన్నవి. ఏకోపాధ్యాయుడు మొదలు, కళాశాల అధ్యాపకుల దాకా దీనిలో పాల్గొనటం విశేషం.



వెజిటబుల్ రడాల్

నెల్లూరు పట్టణంలోని కస్తూరి దేవి బాలికల ఉన్నత పాఠశాల, జిల్లాలోని గ్రామీణ ప్రాంత పాఠశాలలు, ప్రకాశం, గుంటూరు,ఖమ్మం యం.నగర్, ప.గో.జిల్లా, తూ.గో.జిల్లాలకు చెందిన వెల్లటూరు, కొత్తగూడెం, ఆమన్‌గల్, భీమవరం, కరప, మొదలగు వివిధ ప్రాంతాల నుండి వివిధ వస్తువులు ఈ ప్రదర్శనకు వచ్చాయి. పురుషులతోపాటు మహిళలుకూడా ప్రదర్శనలో పాల్గొని బహుమతులు పొందారు. మహాసభలకు వచ్చిన వేలాది మంది ప్రతినిధులేగాక, పట్టణ ప్రజలు తండోపతండాలుగా వచ్చి దీనిని దర్శించారు.

## (1) చిత్రకళా ప్రదర్శనం

దీనిలో యస్.ఎ.యల్.సి.యం. హైస్కూలు, నాయుడు పేట చిత్రకళోపాధ్యాయిని శ్రీమతి మేరీ ఫిలిప్స్ సుమారు వంద చిత్రాలు ప్రదర్శించారు. వీటిలో స్వర్గీయ చెన్నుపాటి లక్ష్మయ్యగారి వర్ణచిత్రం, 'నిరీక్షణ' మకుటంతో ఆదివాసీచిత్రం, గ్రాంఫోన్‌రికార్డులపైన వర్ణచిత్రాలు, డిజైన్లు ప్రేక్షకుల్నివిశేషంగా ఆకర్షించాయి.

పెదపుత్తేడు ఉపాధ్యాయుడు శ్రీఎ.గజేంద్ర తయారు చేసిన 'సుద్దముక్కలో వినాయకుడు' 'కోడిగుడ్డులో గీతోపదేశం' వంటి సబ్బుతో చేసిన చిత్రాల్ని భూతద్దంతోనే చూడాలి.

తెలుగు పాఠ్యగ్రంథంలోని 'పామునెత్తిన భూగోళం' లాంటి అశాస్త్రీయ విషయాల్ని పైకెత్తి చూపిన ఉపాధ్యాయుడు శ్రీ పి. శ్రీనివాసులరెడ్డి వ్యంగ్య చిత్రంబాగున్నది. కొడవలూరు ఉపాధ్యాయిని శ్రీమతి కె.సి.లలితగీసిన 'దొంగవచ్చిండో .. బడిదొంగవచ్చిండో'! అనే వ్యంగ్య చిత్రం తమవిధిని నిర్లక్ష్యంచేసే ఉపాధ్యాయుల్ని విమర్శించకుండా వదిలిపెట్టరాదన్న యు.టి.యఫ్ విధానాన్ని చక్కగా చూపెట్టింది.

అన్నిటికంటె ఆకర్షణీయమైనది నవరంగ చిత్రకళానికేతన్, వెల్లటూరి వారి చిత్రకళాప్రదర్శన. వారు గత పాతికేళ్ళుగా బాలబాలికల్లో చిత్రలేఖనాన్ని ప్రోత్సహించటానికి అఖిలభారత పోటీలు నిర్వహిస్తూ అవిరళకృషి సాగిస్తున్నారు. దీని నిర్వాహకుడు శ్రీ వెల్లటూరి పూర్ణానందశర్మగార్కి ప్రత్యేక బహుమతి ఇవ్వబడింది.

చిత్రకళా ప్రదర్శనలో ప్రథమబహుమతి శ్రీమతి మేరీ ఫిలిప్స్, ఇతర బహుమతులు పూసపాడు ఉపాధ్యాయుడు శ్రీలంకా ప్రసాద్, ఎ.గజేంద్ర, మైకాలేబర్ వెల్ఫేర్ ఉన్నత పాఠశాల, తలుపూరు ఉపాధ్యాయుడు శ్రీ జి. శంకరయ్య, శ్రీమతి కె.సి.లలిత పొందేరు.

## (2) చేతిపనులు

హస్తకళల విభాగంలో మట్టి నమూనాలు, కొయ్యవస్తువులు, ఈ తాకుతో చేసిన వస్తువులు, ఎంబ్రాయిడరీ చేసిన గుడ్డలు, కాగితాలతో,.. అట్టలతో,.. ప్లాస్టిక్‌తో చేసిన నమూనాలు ప్రదర్శింపబడ్డాయి.

ఈ విభాగంలో కస్తూరిదేవి బాలికల ఉన్నత పాఠశాల, భీమడోలు పాఠశాల, కోదండరామాపురం, ఉపాధ్యాయిని శ్రీమతి సి.రుక్మిణీ దేవి బహుమతుల్ని పొందేరు.

## (3) పురావస్తు విభాగం

నెల్లూరు జిల్లా,ఊటుకూరు ఉపాధ్యాయులు శ్రీ సి.వి.కృష్ణయ్య, శ్రీ చినిగిపా 'గనికలపాడు' వద్ద త్రవ్వకాలు జరిపి, పాతరాతి యుగం, కొత్తరాతి యుగాలకు చెందిన పనిముట్లు, మట్టి పాత్రల్ని సేకరించారు. దక్కన్,రాజస్థాన్ లాంటి ప్రాంతాల్లో ఇనుప ఖనిజాన్ని కరిగించే మధ్యయుగాలనాటి మట్టి గురుగుల్ని (క్రూసిబుల్స్) నుసేకరించి ప్రదర్శించారు. ఉపాధ్యాయులు నిత్యపరిశోధకులు గా కూడ ఉండాలని వారి ఆశయం.

ఈ విభాగంలో శ్రీ.సి.వి. కృష్ణయ్య, చినిగీపాగార్లు, గురజాల ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడు శ్రీ కె.జె.చంద్రపాల్ (అరుదైన నాణేలు, స్టాంపుల సేకరణకు) బహుమతులు పొందేరు.

## (4) విజ్ఞానశాస్త్రం

ఖమ్మంజిల్లా కొత్తగూడెం ఉపాధ్యాయులు శ్రీ మురళీమోహన్ నాయకత్వాన శ్రీ ఎన్.వి.ఆర్ పురుషోత్తం (మణుగూరు) శ్రీ వి.అజయకుమార్ (వెంకటాపురం) శ్రీకె. వేణుగోపాలకృష్ణ) (చింతపల్లి 'ఆటల సరదాలో' 'చిట్టి విజ్ఞానం' పుస్తకాల ఆధారంతో తయారుచేసిన అనేక విజ్ఞాన శాస్త్ర వస్తువులు ప్రదర్శించారు. ఖరీదైన బోధనోపకరణాలు లేకుండానే విజ్ఞానశాస్త్రాన్ని గణితాన్ని విద్యార్థులకు ఎలానేర్పవచ్చో నిరూపించారు. కొండమీదికొండూరు ఉపాధ్యాయులు ప్రదర్శించిన గురుత్వాకర్షణ ఆట వస్తువులు, అగ్గిపుల్లలతో రేఖాగణిత రూపాలు, ఉపాధ్యాయులకు మార్గదర్శకాలుగా ఉన్నాయి.

జన విజ్ఞానవేదిక వారి ప్రత్యేకవిభాగం వేలాది మందిని విశేషంగా ఆకర్షించింది. మానవపరిణామం నుండి సామాజికశాస్త్రం, వైద్యశాస్త్రం, ఆర్థికశాస్త్రం, విజ్ఞానశాస్త్రాలకు చెందిన ఎన్నో విషయాలు దీనిలో చోటుచేసుకొన్నవి.

## (5) గణితశాస్త్రం

భీమవరం, డి.యన్.ఆర్.కాలేజి లెక్చరర్ డా.టి.సత్యనారాయణరాజు 'వేదగణితం' అన్నపేరుతో,గణితంలో సులభ పద్ధతుల్ని కనుగొనటానికి విశేష కృషిచేసి, ఆ ఫలితాల్ని ఛార్టులద్వారా, వివిధ ఉపకరణాల ద్వారా ప్రదర్శించారు. గణిత మంటే విద్యార్థులలో కలుగుతున్న భయాన్ని, సరయిన బోధనా విధానాలద్వారా ఎలా పోగొట్టవచ్చో, గణితంపట్ల ఆసక్తిని ఎలా పెంచవచ్చో వారు తమ ప్రదర్శనద్వారా నిరూపించారు.



# స్వాగతోపన్యాసం

—డా. జె. శేషారెడ్డి
ఆహ్వాన సంఘ అధ్యక్షులు

గౌరవనీయ సభాధ్యక్షులకు వేదిక నలంకరించిన ప్రముఖులు నమస్కారాలు !

ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ 5వ రాష్ట్ర మహాసభలో పాల్గొనుటకు నెల్లూరు పట్టణానికి విచ్చేసిన ప్రసిద్ధులు, ప్రతినిధులు, ఆహ్వానితులు, తదితర మిత్రులకు ఆహ్వాన సంఘ పక్షాన హృదయ పూర్వక స్వాగతాంజలి !

ప్రాచీన కీర్తిమయ చరిత్ర గలిగిన సింహపురి పక్షాన ఇదే మా సుస్వాగతము. ఆంధ్ర వాఙ్మయ మహాసాధనమున మా తిక్కన ఒక మహిమోపేత భాగము. ఆంధ్రావళికి మోదము గూర్చిన ఈ మహాకవి, హరిహర నాథ ఐక్య పూజావిధానముతో మత సామరస్యము నెలకొల్పిన మత ప్రవక్త. ఖడ్గ తిక్కన తన వీర ఖడ్గమును కడిగినది మా పినాకినీ నదీతోయములందే. ఆ సార్వభౌముడు - కాకతి గణపతిదేవుని సహాయముతో, తన బాల్య మిత్రుడు - మనుమసిద్ధి సింహాసనాన్ని భద్రపరచినది, రాజనీతి చతురుడైన మా కవి తిక్కనయే ! ఆయన తర్వాత ఎందరో కవులు, పండితులు, రాజనీతి కోవిదులు సింహపురి పోతుగడ్డపై పుట్టి పేర్గాంచినారు. స్త్రీ జన గౌరవ పతాకాన్ని ఎగురవేసిన మొల్ల కవయిత్రి - మా ఆడ పడుచు. ఈ తరంలో, కళాప్రపూర్ణ వేదం వేంకట రాయశాస్త్రి, కవికోకిల దువ్వూరి రామిరెడ్డి మా కీర్తి తోరణంలో ప్రఖ్యాత సుమ మంజరులు.

మానవతా వాది ఆంగ్లేయ ఇంజనీరు - సర్ ఆర్ధర్ కాటన్ ఆంధ్రను అన్న పూర్ణను జేసి, మా పినాకినీ నది ద్వారా మా మండలాన్ని కూడా సస్యశ్యామలం చేసినాడు.

రాజకీయ రంగమున, వివిధ పక్షాల నాయకులు సామరస్యంతో మా మండలాభివృద్ధికి పాటుపడినారు. సామరస్య సమైక్యతలే మా ప్రత్యేకత. మా రాజకీయ నాయకులు రాష్ట్ర - జాతీయ స్థాయిలో పేర్గాంచినారు.

ఇట్టి కీర్తితో దేశ విద్యా వైజ్ఞానిక ప్రగతికై పాటుబడుతున్న పెద్దలకు. ఈ సమావేశంలో పాల్గొనుచున్నందులకు స్వాగత పూర్వక కృతజ్ఞతలు.

## అభినందనలు

ఈ ఐక్య ఉపాధ్యాయ సంఘం సాగించిన పద్నాలుగేండ్ల కృషి ఫలితంగా. ఉపాధ్యాయులలో అధికసంఖ్యాకులను ఒకే వేదికపైకి సంఘటితపరచి కార్యోన్ముఖులుగా చేయగలిగినది. ఇంతే కాకుండా, దేశ సమగ్ర ప్రయోజనాల దృష్ట్యా , విద్యా విధానం ఒక అభివృద్ధికరమైన పోకడలో నడిచేదానికి అవసరమైన గట్టి కృషిని మీ సంఘం సాగించుట అభినందనీయం.

ఈ ఉపాధ్యాయ సంఘం ఇప్పటికే అనేక విజయాల సాధించినప్పటికిన్నీ, ఇంకను ఎన్నో కర్తవ్యాలు పరిష్కారానికై ఎదురుచూస్తున్నవి. విద్యార్థులు, ప్రజలు అందరూ, మీరు వీటిని పరిష్కరించగలరన్న ఆశతో మీ వైపు చూస్తున్నారు. కొందరు ఉపాధ్యాయులు పవిత్రమైన ఈ అధ్యాపక వృత్తికి కళంకం తెచ్చేటట్లు వ్యవహరిస్తూ, సమిష్టి ఉపాధ్యాయ సంఘానికే చెడ్డపేరు తెస్తున్నా, దేశ ప్రజలు, విద్యార్థులు ఈనాడు విద్యావిధానంలో మనం ఎదుర్కొంటున్న అనేక సమస్యలను తృప్తికరమైన చక్కటి మార్గంలో మీరే పరిష్కరించగలరన్న ఆశతో మీ వైపే దృష్టి లగ్నం చేస్తున్నారు.

## పరిష్కారం కొరకు ఎదురుచూస్తున్న సమస్యలు

నేటి విద్యావిధానంలో మనలను ఎదుర్కొంటున్న సమస్యలను కొద్దిమాటలలో మీ ముందు పెడుతున్నా. వీట పరిష్కార మార్గాలను మీరే అన్వేషించ వలసి ఉన్నది.

(1) భారతదేశ రాజ్యాంగములో, ప్రజలందరకీ నిర్బంధ ఉచిత ప్రాధమిక విద్యను కొంతకాలపరిమితిలో పూర్తిగా అందజేయాలని ప్రతిపాదించి ఉన్నప్పటికిన్నీ, ఇప్పటివరకు ఆ ఆశ ఎండమావిగానే నిలిచిపోయి ఉన్నది.

(2) వయోజన విద్యను ప్రజలకు అందించడంలో చెప్పుకోదగిన కృషిలేదు. అది సాధించవలెనన్న దీక్ష, కార్యా చరణ విధానం గూడ కొరవడి వున్నవి.

(3) స్త్రీ విద్య : గార్గి కాత్యాయని మొదలైన ప్రాచీన మహిళలు వేదాంత ప్రవచనాలు చేసినారని, స్త్రీ మాతృమూర్తి అని ప్రగల్భాలతో నిండిన అర్ధరహిత గంభీరోపన్యాసాలు, లేని ప్రోగ్రాముల ప్రకటనలేగాని, స్త్రీ విద్యాభివృద్ధి విషయంలో నేడు చెప్పుకోదగినంత మార్పు కనిపించడంలేదు. ఇంతేగాక ఇతర అన్ని రంగాలలో గూడ స్త్రీలను చిన్న చూపు చూడటం కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నది.

(4)వృత్తి విద్య : దేశ సౌభాగ్యాన్ని పెంచుటకు ఉత్పత్తి పెంచవలసిఉన్నది. దీనికిగాను అనేక శాఖలలో ఆయా వృత్తి నిపుణులు ఎందరో కావలసిఉన్నది. కాని వృత్తి విద్యలు పూర్తిగా నిర్లక్ష్యం చేయబడినవి. ఇది విషాదకర విషయం.

(5) మాతృభాషలో విద్యాబోధన : ఇది అన్ని దశలలో శ్రేయస్కరమని అందరూభావించి ఆశించినప్పటికిన్నీ ఆ విషయంలో జరిగిన కృషి నిరాశాజనకంగా ఉన్నది. అనేక పాశ్చాత్యభాషల్లో దినదినము కుప్పు - తిప్పలుగా వచ్చి పడు తున్న శాస్త్ర పరిజ్ఞానాన్ని మాతృభాషలలోనికి కనీసం తర్జుమా చేసుకొని అయినా బాగుపడదామంటే, దానికి తగిన యంత్రాంగమే లేకపోవడం శోచనీయం.

(6) జన బాహుళ్య విద్య : ప్రజలందరికి విద్యను గరపడం ప్రతి నాగరక ప్రభుత్వ కనీస ధర్మం. దానిని నిర్వర్తించ డమే గాక, తామర తంపరలుగా పుట్టి ఎదుగుతున్న ప్రైవేటు విద్యా సంస్థల అభివృద్ధికి ప్రభుత్వం దోహదం చేస్తున్నది. వీటిలో ఎక్కువ సంస్థలు భారతీయ సంప్రదాయాలను, సంస్కృతిని ప్రక్కకునెట్టి పాశ్చాత్య విద్యా విధానాల అనుకరణమే ప్రధాన లక్ష్యంగా, తమ విద్యా విధానాలను రూపొందించి సాగిస్తున్నవి. ఈ దుష్ట విధానం, కాన్పు కాకముందే కడుపులో ఉన్న బిడ్డకు స్కూలు సీటు రిజర్వు చేసుకోవడంతో ప్రారంభమౌతున్నది. లక్షలకు లక్షలు విలువచేసే వైద్య - ఇంజనీరింగు సీట్లవరకు ఈ విద్యా వ్యాపారం, విశృంఖలంగా సాగిపోతూనే ఉన్నది - ప్రభుత్వం చూస్తూనే ఉన్నది.

(7) ఎదగని అక్షరాస్యత : 40 ఏండ్ల స్వాతంత్ర్యానుభవం తర్వాత ఎన్నో విద్యాప్రణాళికలు, ఎన్నో నూతన విద్యా విధానాలు సాగింపబడినా, మొత్తం దేశంలో అక్షరాస్యత 36.17 శాతంగానే నిలిచిపోయినది. అందులో ఆంధ్రప్రదేశ్ శాతం 29 మాత్రమే. ఈ కొద్దిపాటి చదువులకైనా ఒక లక్ష్యం ఒక ఆదర్శం ఉన్నవా అంటే - వాటికీ కరువైనది. సామాన్య సాంప్రదాయికచదువులు (బి.ఎస్‌సి., బి.కాం., బి.ఎ. వగైరాలు) మనదేశంలో దాదాపు 70 శాతం ఉండగా, జాతి ప్రగతికి, దేశ సౌభాగ్యాభివృద్ధికి కీలకమైన సాంకేతికవిద్య (మెడికల్, ఇంజనీరింగ్, పాలిటెక్నిక్ మొదలైనవి) 30 శాతానికి లోపుగానే ఉన్నది. ఇది అభివృద్ధి చెందవలసిన దేశాల లక్ష్యాలకు భిన్న మైనది. ఈ విధానమే అపసవ్యంగా సాగుతున్నది.

ఎక్కడైతే విద్య సామాజిక పరంగా సంపూర్ణంగా ఉంటుందో, అక్కడే సర్వతోముఖ అభివృద్ధి వుంటుంది. ఆ సమాజంపై చైతన్య పూర్ణంగా ఉంటుంది. ఒక్క చిన్న ఉదాహరణ చూడండి :- మొత్తం భారతదేశంలో కన్న కేరళలో అత్యధిక అక్షరాస్యత ఉన్నది. మనదేశ ఇతరప్రాంతాలలో పోల్చిచూస్తే, అక్కడ పసి బిడ్డల మరణ ప్రమాణం (Infant Mortality rate) చాలా తక్కువ. ఇది అభివృద్ధి చెందిన పాశ్చాత్య దేశాలలో పోల్చదగి ఉన్నది. దాని ఫలితంగానే కుటుంబ నియంత్రణం లాంటి కార్యక్రమాలు కేరళలో చాలా చురుకుగా సాగుతున్నవి.

ఈ అపసవ్య విద్యా విధానాన్ని సరిచేసి, ఒక సక్రమ మార్గాన్ని చూపవలసిన బాధ్యత అధ్యాపకులదే ! మీరు ఈ విషయం విద్యార్థులతో, ఇతర పౌరులతో నిరంతరం చర్చించి, ఒక ప్రత్యామ్నాయ శాస్త్రీయ విద్యా విధానాన్ని రూపొందించి ప్రతిపాదించాలని కోరుతున్నాను.

మీ అనుదిన సమస్యలు, జీత భత్యాలు ఉపాధ్యా సంఘాలపై ప్రభుత్వం తెచ్చిపెట్టుతున్న ఒత్తిడులు మొదలైన వాటితో పోరాడుతూనే విద్యా విధానంలో నిర్మాణాత్మకమైన ప్రయోజనకారి అయిన కృషి చేయాలని. అందుకు ఈ రాష్ట్ర మహాసభ వేదిక ఉపయోగపడాలని కోరుకుంటున్నాను.

## చివరిమాట

: అతిథి సత్కార ప్రియులైన సింహపురి వాసులు ఇంతమంది మేధావులను, అధ్యాపకులను, వివిధ రంగ ప్రముఖులను ఒకే ప్రాంగణంలో చూడగలగడం ఒక గౌరవమని ఆనందిస్తున్నారు. మిమ్ము గౌరవించుట మానగర సంస్కారానికి ఒక భూషణమని మురిసిపోతున్నాము.

**మరొకసారి మీ అందరకు హృదయపూర్వక స్వాగతము !!**
**"తెలుగుతల్లికి ఇవే మల్లె పూ దండలు"**



# అధ్యక్షోపన్యాసం

– శ్రీ డి. రామిరెడ్డి
అధ్యక్షుడు. యు.టి.యఫ్

వేదిక నలంకరించిన పెద్దలారా !

మహాసభ ప్రతినిధులారా; సౌహార్ద ప్రతినిధులారా !

సోదర సంఘ నాయకులారా !

పురప్రముఖులారా; విద్యావేత్తలారా !

ఎన్నో వ్యయ ప్రయాసలకోర్చి సుదూర ప్రాంతాల నుండి ఈ సభలకు విచ్చేసిన మీకందరకు స్వాగతం! సుస్వాగతం!

రాష్ట్రంలో ప్రముఖ విద్యా కేంద్రంగా విలసిల్లు తున్న ఈ నెల్లూరు పట్టణంలో ఈ మహాసభలు జరుపుకొనడం ముదావహం. అడిగినదే తడవుగా అన్ని ఏర్పాట్లు చేసిన ఆహ్వాన సంఘం వారికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం.

1975 ఆగష్టు 10 న విజయవాడలో ఆవిర్భవించిన మనసంఘం దినదిన ప్రవర్ధమానమవుతూ 1975 అక్టోబరులో రాజమండ్రిలో మొదటి మహాసభ, 1977 ఆగస్టులో ఖమ్మంలో ద్వితీయ మహాసభ, 1981 ఆగస్టులో భీమవరంలో తృతీయ మహాసభ, 1986 జనవరిలో విజయవాడలో నాల్గవ మహాసభ జరుపుకున్నాం .

ఐదవ మహాసభ జరుపుకుంటున్న ఈనాటికి మనకు ప్రభుత్వ గుర్తింపు లభించినది. సభ్యత్వము 53 వేలు దాటింది. మన పత్రిక ఐక్య ఉపాధ్యాయ చందాలు 17 వేలు దాటాయి. ప్రధానమైన అన్ని జిల్లాలలో శాశ్వత జిల్లా కార్యాలయాలు కూడ నిర్మించుకున్నాం.

ఈ మహాసభ రాజకీయంగా, ఆర్థికంగా భిన్నమైన వాతావరణంలో జరుపుకుంటున్నాం.

ప్రపంచశాంతి ఉద్యమం సోషలిస్టు దేశాల చొరవతో యుద్ధాలను నిలిపివేసే స్థాయికి పెరిగింది. కాని సామ్రాజ్యవాదం నిరంతరం దీనిని భగ్నం చేయడానికి ప్రయత్నిస్తూనే వుంది.

మనదేశంలో పార్లమెంటు ఎన్నికల వాతావరణం ప్రారంభమైంది. అందుకనే పాలకవర్గాలు పాతవిధానాలే కొత్త సీసాలతో మార్చి మార్చి ప్రజలకు భ్రమలు కలిగించే ప్రయత్నాలు చేస్తున్నారు.

ఎన్ని గారడీలు చేసినా అన్ని వస్తువుల ధరలు రోజు రోజుకు పెరుగుతున్నాయి. కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు రెండూ పోటీపడి పన్నులభారం పెంచుతున్నాయి. దేశంలో ద్రవ్యోల్బణం పెరిగిపోయింది. రూపాయి విలువ 11 పైసలకు పడిపోయింది. విదేశీ ఋణభారం కోట్లకు పెరిగింది. తలసరి అప్పు పెరిగిపోతున్నది.

దేశ సమైక్యతకు ముప్పు వచ్చే విధంగా విచ్ఛిన్న కర శక్తులు విజృంభిస్తున్నాయి. పంజాబు సమస్య, గూర్ఖాలాండు ఉద్యమం, బోడో ఉద్యమం, ఝార్ఖండు ఉద్యమాలు. కాశ్మీరు మతకలహాలు ఈ ప్రమాదాన్ని అద్దంపట్టి చూపుతున్నాయి.

స్వాతంత్ర్యం వచ్చి 42 సం॥లు దాటినా యింకా మన దేశంలో అక్షరాస్యత 36.17 శాతము మాత్రమే. వారిలో స్త్రీల అక్షరాస్యత 24.88% దేశం మొత్తం పరిస్థితి ఇలాఉంటే మన రాష్ట్రంలో అక్షరాస్యత 29.72 శాతం ఉండడం మనం గమనించాలి.

1968 లో ఆమోదించిన విద్యావిధాన తీర్మానంలో మొత్తం బడ్జెట్టులో కేంద్రం 7%, రాష్ట్రాలు 35%, విద్యకే కేటాయించా లని తీర్మానించినా గత 20 సం॥లలో కేంద్రం మొత్తం బడ్జెటులో 2% లోపుగానే విద్యకు కేటాయిస్తున్నది. మన రాష్ట్ర ప్రభుత్వం మొత్తం బడ్జెటులో 17 % మాత్రమే విద్యకు కేటాయిస్తున్నది అందువల్ల ఈ మొత్తాలు ఉపాధ్యాయుల ఉద్యోగుల జీతభత్యాలకే ఖర్చవుతున్నాయి. అందుచే మన పాఠశాలల భౌతిక పరిస్థితులు భయంకరంగా ఉన్నవి. గత రెండు సంవత్సరాలలో "ఆపరేషన్ బ్లాక్ బోర్డు" పథకం క్రింద ప్రస్తుతం అన్ని ప్రాథమిక పాఠశాలలలో భవన నిర్మాణం ప్రారంభం కావడం పరిస్థితిని కొంత మెరుగుపరచింది.

90% ప్రాథమిక పాఠశాలలో మన రాష్ట్రంలో నేటికీ కనీస ఫర్నిచరులేదు. ఆటస్థలాలు, మరుగుదొడ్డి సౌకర్యాలులేవు. ఈ పరిస్థితి మెరగుపరచి పాఠశాలలను ఆకర్షవంతంగా చెయ్యాలి.

ప్రభుత్వాలు విద్యను భవిష్యత్తుకు పెట్టుబడిగా భావించ నందున ఈ పరిస్థితి ఏర్పడింది. అక్షరాస్యత శాతం పెరిగితే, ప్రజల ఆలోచనలో మార్పు వస్తుందని కుటుంబనియంత్రణా పథకాలు కార్మికుల పని నైపుణ్యస్థాయి పెరిగి ఉత్పత్తి పెరుగు తుందని, ప్రజాస్వామ్య పునాదులు పెరుగుతాయని గుర్తించాలి.

అందుచే కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు బడ్జెట్టులో విద్యకు ఎక్కువ మొత్తం కేటాయించాలి.

ఈనాడు విద్యారంగంలో అనేక వైరుధ్యాలు కనిపిస్తున్నాయి. విద్యా రంగంలో ప్రైవేటు యాజమాన్య దోపిడీ అరికట్టాలని ఉద్యమాలు పెరుగుతున్నాయి. అయినా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ విధానాలవల్ల ప్రైవేటు పాఠశాలలు, కాన్వెంట్లు, రెసిడెన్షియల్ పాఠశాలలు, కళాశాలలు పుట్టగొడుగుల్లా పెరిగిపోతున్నాయి.

ప్రభుత్వమే నేరుగా కో-ఆపరేటివ్ జూనియర్ కాలేజీలు ప్రారంభించి ఈ వ్యవస్థకు మద్దతు పలుకుతున్నది.

ప్రజలలో దోపిడీకి గురి అవుతున్నామని తెలిసికూడ రోజురోజుకు ప్రైవేటు పాఠశాలల మోజు పెరుగుతున్నది. ప్రభుత్వ పాఠశాలలో ఫర్నిచరు. బ్లాక్ బోర్డులు ఏర్పాటుకు ప్రయత్నాలు చేయకుండా టి.వి.లు వీడియోలు సప్లయి చేస్తున్నారు. బోధనలో ఆధునిక సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగించుటకు మనం వ్యతిరేకులంకాము. అయితే కనీస అవసరాలు తీర్చకుండా సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగించే సామర్థ్యాన్ని పరిస్థితులను కల్పించకుండా వీటిపై పెట్టేఖర్చు ఆశించిన ఫలితాలనీయదు.

సిలబసు తయారీగాని, పాఠ్యపుస్తకాల రచనకాని, శాస్త్రీయంగా లేదు. అందుకనే పాఠ్యాంశాలలో అవాస్తవాలు, మతమౌఢ్యాలు పెంపొందించే అంశాలు ఎక్కువవుతున్నాయి. దేశభక్తి పెంపొందించడం, దేశ సమగ్రత లౌకికతత్వం పెంపొందించే విధంగా విద్యార్థులలో నైతిక ప్రవర్తన తెచ్చేదానికి యివి దోహద పడడం లేదు. దీనిలో విప్లవాత్మక మార్పు రావాలి.

ఉపాధ్యాయుల ఆలోచనా విధానాలలో కూడ మౌలిక మార్పు రావాలి. తన సౌకర్యాలకు హక్కులకు భోధనా భాధ్యతలను ముడి పెట్టరాదు. హక్కుల కొరకు రాజీ లేకుండా పోరాడుతూనే సామాజిక బాధ్యత గుర్తించి తన కర్తవ్యాన్ని నిర్వహించడం, నిరంతరం తన విషయ పరిజ్ఞానాన్ని పెంపొంది ంచుకోవడం, బోధన ఆధునిక పద్ధతులలో చేయడం విద్యార్థులలో వ్యక్తిగత సాన్నిహిత్యాన్ని పెంపొందించుకొని వారిని సరియైన విద్యార్థిగా, పౌరునిగా తీర్చిదిద్దుటకు కృషిచేయాలి.

సమాజం అంతా కుళ్ళిపోయి ఉన్నప్పుడు, ఎక్కువకాలం సమాజ ప్రభావంలో పెరిగిన విద్యార్థి నిరంతరం ఆ ప్రభావానికి లోనవుతున్నప్పటికి మన కర్తవ్యాన్ని పట్టుదలతో నెరవేర్చాలి.

విద్యారంగంలో ప్రభుత్వాలు నిరంతరం ప్రయోగాలు చేస్తున్నారు. పాత విధానాలను కొత్త సీసాలలో పోసి చూపు తున్నారు. వృత్తివిద్యను గూర్చి 40 సం॥లలో అనేక పధకాలను ప్రవేశపెట్టినారు. ప్రతి పధకాన్ని ప్రవేశపెట్టడం 4 సం॥ తరువాత మార్పులు చేయడంతోనే 4 దశాబ్దాలు గడిచి పోయాయి. మన రాష్ట్ర ప్రభుత్వం 6 నుండి 10 వరకు 3 సం॥లలో మొత్తం ఉన్నత పాఠశాలలకు వృత్తి విద్య విస్తరింప జేస్తామని చెప్పి, ఏడాది తిరగకముందే ప్రారంభించిన 350 పాఠశాలలలో సగం మూసివేసి మరల పునరుద్ధరించారు. దానినిమార్చి ప్రస్తుతము మండల కేంద్ర సంస్థలు పెడు తున్నారు. వచ్చే సం॥ ఏమి చేస్తారో తెలియదు.

శాస్త్రీయ వేతన విధానానికి మనం పోరాడుతుంటే పార్టు టైం ఉద్యోగాలు, రూ.398 - వేతన ఉపాధ్యాయుల నియామకాలు సాగుతున్నాయి. అంగనవాడి బాల్వాడి ఉపాధ్యాయుల పరిస్థితి దారుణంగా వుంది.

కాన ఈ మహాసభ జరుగు 4 రోజులు విద్యారంగంలోని అన్ని సమస్యలు సాకల్యంగా చర్చించి సరియైన అవగాహనకు రావాలి. సరియైన విద్యావిధానాన్ని ప్రభుత్వాలు రూపొందించేలా మనం ఉద్యమించాలి. ఈ కర్తవ్యంలో ప్రజలు, విద్యార్థులు ఉపాధ్యాయులు ప్రభుత్వ పాత్రను ఖచ్చితంగా విశ్లేషించి చెప్పాలి.

గత 4 మహాసభల మాదిరిగానే ఈ మహాసభలను కూడ హుందాగా క్రమశిక్షణతో నిర్వహించడంలో మీరంతా తోడ్పడ తారని ఆశిస్తున్నాను.



# కార్యక్రమాలు సమీక్షిస్తూ కర్తవ్యబోధచేస్తున్న కార్యదర్శినివేదిక


-శ్రీ.ఎ. వెంకటస్వామి
ప్రధాన కార్యదర్శి,యు.టి.యఫ్


అధ్యక్షా, కామ్రేడ్స్:

యు.టి.యఫ్. ఉద్యమ నిర్మాణంలో కాకలుతీరిన యోధులుగా నమ్మిన ఆశయాలకు అంకితమై, అధ్యయనం, అధ్యాపనం సామాజిక స్పృహ ఆశయాలుగా అత్యంత వ్యయప్రయాసలలోకోర్చి, అగ్రభాగాన సంఘాన్ని నిలిపి అజేయులుగా పురోగమిస్తూ, ఐదవ విద్యా వైజ్ఞానిక మహాసభలకు తరలివచ్చిన తమందరకు స్వాగతం, సుస్వాగతం!

అమరజీవి పొట్టి శ్రీరాములు... అమరజీవి చెన్నుపాటి ఆశయాలకనుగుణంగా 1974 ఆగస్టు 10న ఆంధ్ర తెలంగాణా విభేదాలు అధిగమించి ప్రాథమిక సెకండరీ పరిధులు దాటి, మేనేజిమెంటు అంతరాలు తోసిరాజని, చారిత్రక అవసరంగా ఏర్పడిన సంస్థ యు.టి.యఫ్.

ఏర్పడినదే తడువుగా 1974 అక్టోబరు 20,21 తేదీలలో గోదావరి తీరాన "విశాలపులినస్తోమంబునన్ పత్రము కలముంబూని చరించిన" నన్నయ భట్టారకుని రాజమహేంద్రవరంలో ప్రథమ మహాసభ జరిపి ఉద్యమాని కనువైన నిబంధనావళిని, ప్రగతి పథగామియైన పాలసీ స్టేటుమెంటు రూపొందించుకున్నాము.

1977 ఆగస్టు 17,18 తేదీలలో ప్రగతిశీల రాజకీయాలకు నెలవు, తెలంగాణా సాయుధ పోరాటాల తావుఅయిన ఖమ్మంలో 7 వేలమంది ప్రతినిధులతో ద్వితీయ మహాసభ జరిపి ఉద్యమాన్ని విస్తృతపరచుకున్నాము.

1981 ఆగస్టు 16,17,18 తేదీలలో గోదావరీ తీరంలోనే పాడిపంటలకు నెలవు, అల్లూరి సీతారామరాజు ప్రాంతమైన భీమవరంలో తృతీయ మహాసభలు జరిపి ఉద్యమాన్ని విస్తృతపరచుకున్నాము.

1986 జనవరి 8,9,10, తేదీలలో కృష్ణాసైకత తీరంలో, రాజకీయకేంద్రము పత్రికల నివాస స్థలము అయిన విజయవాడలో 10 వేలమంది ప్రతినిధులతో నాల్గవ మహాసభలు జరిపి ఉద్యమ విశ్వరూపాన్ని ప్రదర్శించాము.

నాటి మహాసభలు నేటికీ మరిచిపోలేము. అపూర్వమైన భోజన ఏర్పాట్లు, అనన్యసామాన్యమైన పూరేగింపు, అమోఘమైన ఏర్పాట్లు అందరినీ అలరించాయి.

ఇప్పుడు పెన్నానదీ తీరంలో, కవిబ్రహ్మ తిక్కన తిరుగాడినచోట నెల్లూరులో ఐదవ మహాసభలు జరుపుకొనేదానికి మనమంతా అరుదెంచాం.

ఉద్యమమంటే ఊహాలోకంలో వుండేదికాదు. నేటి సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులలో వ్యవహరించవలసినది. వాటిని ఆకళింపు చేసుకొని,ఉద్యమాన్ని మలచుకోవలసిన పరిస్థితులు అధ్యయనం చేయడం మనందరి కర్తవ్యం.

వెనిస్‌లో అమెరికా, ఫ్రాన్స్,పశ్చిమ జర్మనీ, బ్రిటన్,కెనడా,ఇటలీ,దోపిడీ చేయాలని తలపెట్టినా, సహజంగానే వాటికి వుండే వైరుధ్యాల కారణంగా సాగలేదు.

అమెరికా స్టాక్ ఎక్స్ఛేంజ్ సంక్షోభంలో పడిపోవడం,బ్రిటన్‌లో సమ్మెలపై నిషేధం విధించవలసిరావడం, అద్భుత ప్రగతి సాధించిందని పొగడే జర్మనీలో నిరుద్యోగం పెరగడం, అంతర్జాతీయ మార్కెట్‌లో జపాన్ అమెరికాకు ఎదురునిలవడం, పెట్టుబడిదారి దేశాల్లో గతంలో ఏనాడు లేనివిధంగా కార్మికుల సమ్మెలుపెరగడం, వాటి దివాళాకోరు విధానాలు తేటతెల్లం చేస్తున్నాయి.

ప్రపంచంలో మూడవ వంతుదేశాలు సోషలిస్టు వ్యవస్థగా మారి, సామ్రాజ్యవాదుల దోపిడీకి అందుబాటులో లేవు. ఇక వర్ధమాన దేశాలపై తమ భారాలు మోపి- అంటే వాటి రుణభారం పెంచి, వాణిజ్యంలో గట్టి షరతులు విధించి, ముడిసరకులు ధరలు పడగొట్టి ఆయుధాలు అంటగట్టి తమ సంక్షోభాల నుండి పెట్టుబడిదారీ దేశాలు బయటపడాలని చూస్తున్నాయి. ఈ పరిస్థితి ఎల్లకాలంసాగదు. వర్ధమాన దేశాలు చైతన్యవంతమై ప్రతిఘటించక తప్పదు. సామ్రాజ్య వాద దేశాలు చావుదెబ్బ తినకా తప్పదు.

సోవియట్ చొరవ కారణంగా శాంతి శక్తులు గణనీయంగా బలపడ్డాయి. అణుయుద్ధంవస్తే సర్వనాశనం తప్ప విజేతలంటూ ఎవరూ మిగలరనేది గుర్తించిన ప్రజలు రోజురోజుకూ శాంతి కొరకు ముందుకొస్తున్నారు. అణ్వస్త్ర పడవలను తమ తీరానికి రానివ్వనని డెన్మార్క్ ప్రకటించింది. బ్రిటన్ నుండి అణ్వాయుధాలు తొలగించాలని లేబరుపార్టీ ప్రకటించింది. పశ్చిమ జర్మనీలో రసాయినిక ఆయుధాలకు తావులేదని ప్రకటించింది. పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికులు కూడా శాంతి ఉద్యమాలలో భాగస్వాములు అవుతున్నారు.

ఈ మార్పులు అమెరికా నడ్డి విరిచింది. రెగ్జానిక్ శిఖరాగ్రసభలో సోవియట్‌తో ఒప్పందానికి వచ్చి, ఐరోపాలో పెర్షింగ్ క్రూయిజ్ మిసిలీలను తొలగించే ఒప్పందానికి రావలసివచ్చింది. భారత్ సోవియట్‌తో సహకరించడం గమనించదగ్గ అంశాలు.

సోషలిస్టులు దేశాలు, ముఖ్యంగా సోవియట్ యూనియన్ శాంతికొరకు చేస్తున్న వివిధ ప్రతిపాదనలు సామ్రాజ్యవాదులకు

మింగుడుపడటంలేదు. నక్షత్ర యుద్ధాలంటూ నాటకమాడుతున్నా ప్రజలుసాగనిచ్చేలాలేరు. సోవియట్ అధ్యక్షులు మిహాయిల్ గోర్బచేవ్ అమోఘమైన శాంతి కృషికి నిదర్శనంగా ఖాన్ అబ్దుల్‌గఫార్‌ఖాన్ పేరుతో నెలకొల్పిన తొలి శాంతి బహుమతి ఆయనకు యివ్వడం నిజంగా అభినందించదగ్గది.

సోషలిస్టు దేశాలు, అందరికీ తిండి, బట్ట, చదువు, వసతి, సౌకర్యాలు కల్పిస్తూ పనిహక్కుకు గ్యారెంటీ గల్గి, నిరుద్యోగాన్ని, నిరక్షరాస్యతను పారద్రోలి పురోగమిస్తున్నాయి. వాటి జాతీయ ఆదాయం, పెరుగుదల రేటు గణనీయంగా వున్నాయి. అందరికీ ఆరోగ్యం గ్యారంటీ చేయబడింది. ఒక సామాన్య కుటుంబీకుని బిడ్డకు వాషింగ్ మిషన్ లో చేయి తెగిపోతే విమానంలో పంపి, తిరిగి మామూలు చేయిగా చేయడం అక్కడతప్ప ఎక్కడ సాధ్యం? 10 వతరగతి వరకు నిర్బంధ విద్య మరెక్కడవుంది? 40-50 ఏండ్లుగా ధరలుపెరగని దేశాలు ఏవి? ఇవన్నీ సోషలిస్టుదేశాలలోనే చూస్తాం.

అయితే, చైనాలో విద్యార్థులు ప్రజాస్వామ్యం గురించి పోరాడుతున్నారు. రష్యాలో కొన్ని రిపబ్లిక్‌లు తిరగబడ్డాయి. పెరిస్త్రోయికా గ్లాస్ నాస్త్‌తో అంతా అయిపోయింది. పోలెండ్‌లో కార్మికులు తిరగబడ్డారు లాంటి వార్తలు బూర్జువా పత్రికలనిండా చూస్తాం దీనికి సామ్రాజ్యవాదులూ సంబరపడ్డమాట నిజమే.

అవన్నీ చక్కబడుతున్నాయి. ఎవరేమి చెప్పినా అక్కడ పునాది సరిగానే వున్నది. మరొకరి ప్రమేయం లేకుండా వారి విధానాలు వారు చక్కచేసు కోగలరు. ఇబ్బందులు అధిగమించి ప్రపంచ మానవాళి ఆశాజ్యోతులుగా అవి విలసిల్లగలవు.

ఇటీవల రష్యా - చైనాల మధ్య 30 సం॥లు నాడు తెగిన సంబంధాలు పునరుద్ధరించబడినాయి. వియత్నాం-చైనాలవిషయంలో కూడా మార్పు వస్తున్నది. ఇవి ఆహ్వానించదగ్గ పరిమాణాలు.

లిబియాపై దాడులు ప్రపంచం ఖండించింది. అంగోలాలో జోక్యాన్ని నిరసించింది. నికారుగువానిలబడి పోరాడుతున్నది. ఎల్‌సాల్వడార్‌లో విప్లవప్రతిఘాతకులను నిరసించింది. నమీబియాకు స్వతంత్రం ఇవ్వడంలో అనేక చిక్కులు కల్పించి స్వాపో నాయకత్వాన్ని అభాసుపాలు చేయాలని చూస్తున్నది. మొరాకోలో పోలిసారియో యోధులను అణిచివేయాలని చూస్తోంది. పాలస్తీనా ప్రతినిధివర్గాన్ని ఐ.రా.స.కు రాకుండా అడ్డుపడాలని చూసింది. చిలీ లో పినోచట్ సైనిక నియంతృత్వానికి మద్దతు నిస్తోంది. ఇవన్నీ అమెరికా సామ్రాజ్యవాదం బరితెగించి చేస్తున్న దారుణాలు.

85 శాతం నల్లజాతి ప్రజలను అణచిపెట్టి వారి ప్రియతమ నాయకుడు నెల్సన్ మండేలాను 26 సం॥లు నుండి నిర్బంధంలో నుంచి దక్షిణాఫ్రికా బోథాప్రభుత్వం దుర్మార్గంగా వ్యవహరిస్తోంది. షరతులలో విడిచిపెడతానన్న ప్రభుత్వ ఎత్తులను మరొకసారి చిత్తు చేసి మండేలా, దానిని బలపరచిన విన్నీ మండేలాలు అభినందదీయులు. మానవ హక్కులకుగా లిబియా ఏర్పాటు చేసిన గడాఫీ అవార్డు నెల్సన్ మండేలాకుకు అందజేశారు. సూర్యోదయాన్ని ఆపడం ఎవరితరం కాదు. 15 శాతం మందిగావున్న తెల్లవారు 85 శాతం మందిని అణచిపెట్టి వుంచడం ఎల్లకాలము సాగదు.

జెనీవా వప్పందం ప్రకారం, ఆఫ్ఘనిస్థాన్ నుండి రష్యా సైన్యాలు వైదొలగినా, ముజాహుర్దీన్ గెరిల్లాలకు అమెరికా, పాకిస్తాన్‌లు తమ సహాయాన్ని, సైన్యాన్ని అర్ధంగా వుంచి జలాలాబాద్ పట్టణాన్ని స్వాధీనం చేసుకోవాలని అన్నివిధాలప్రయత్నించి అభాసుపాలయ్యాయి; నజీబుల్లా ఆహ్వానాన్ని యికనైనా మన్నించి జాతీయ ప్రభుత్వ ఏర్పాటుకు సహకరించడం మంచిది.

పాకిస్తాన్‌లో బెనజీరుభుట్టో నాయకత్వాన ప్రజాప్రభుత్వం ఏర్పడటం హర్షించదగ్గ పరిణామం. అయితే అక్కడ యింకా చాలా మార్పులు జరగాలి. బంగ్లాదేశ్‌లో కూడా సైనిక ప్రభుత్వం పోవాలనే ఆందోళన జయిస్తుందని ఆశిద్దాం.

నేపాల్‌తో మన సంబంధాలు దెబ్బతినడం, బాధాకరం. బర్మాలో పరిణామాలు యింకా ఒక కొలిక్కి రాలేదు. శ్రీలంకలో ఎన్నికలు జరిగి ప్రేమదాస్' అధికారానికి వచ్చినా, భారత శాంతి సేన ఎంత ప్రయత్నించినా, తమిళ గ్రూపుల మధ్య తగువులు మాయలేదు. శ్రీలంకలో శాంతి ఏర్పడలేదు.

భారత చైనాల మధ్య సంబంధాల పెరుగుదలకు ఇటీవల జరిగిన పరిణామాలు హర్షించదగ్గవి. చర్చలద్వారా సరిహద్దు సమస్య పరిష్కరించబడుతుందని ఆశిద్దాం.

7 సంవత్సరాల ఇరాక్, ఇరాన్ యుద్ధం ముగియడం, గల్ఫ్‌లో శాంతి నెలకొనడం శాంతి కాముకుల విజయం.

42 సంవత్సరాల స్వతంత్ర భారతంలో ఏ సమస్యా పరిష్కారం కాక ప్రజలు నిరాశా నిస్పృహలతో కాలం గడుపుతున్నారు. 70 శాతం నిరక్షరాస్యులు, కోట్లమంది నిరుద్యోగులు 10 కోట్లమంది రోడ్లప్రక్క కాలం గడుపుతున్నారు. 30 కోట్లమందిదారిద్ర్యరేఖకు దిగువున జీవిస్తున్నారు. అంటువ్యాధులు, అనారోగ్యం, స్వయిరవిహారం చేస్తున్నాయి.

కులమత శక్తులు బుసలుకొడ్తున్నాయి. వేర్పాటు ఉద్యమాలు వెర్రితలలు వేస్తున్నాయి. ప్రాంతీయ ఉద్యమాలు పడగవిప్పి కాటువేస్తున్నాయి. అవినీతి రాజ్యమేలుతున్నది. ఎటుచూసినా అంధకారం, గాఢాంధకారం.

పంజాబులో మారణకాండ సాగిపోతూనే వున్నది. కాశ్మీరులో అత్యాచారాలకు హద్దులేదు. అస్సాంలో గిరిజనులలైన బోడోలు 10 శాతం మంది లేకున్నా ప్రత్యేక బోడోలాండ్‌కావాలని హత్యాకాండ కొనసాగిస్తూనేవున్నారు. త్రిపురలో హత్యా రాజకీయాలు ఆగలేదు.

అర్ధరాత్రి స్త్రీ నిర్భయంగా వీధులలో నడచిననాడే దేశానికి స్వాతంత్ర్యం వచ్చినట్లు అన్న బాపూజీ మాటలు నెరవేరలేదు. స్త్రీలపై అత్యాచారాలు పెరిగిపోతూనే వున్నాయి. పోలీసులు చేతులలో కూడా రక్షణ లేకుండా పోయింది. వరకట్న చావులు, ఆత్మహత్యలు నేటి భారతనారిదైన్య స్థితిని చెప్పకయే చెపుతున్నాయి.

పాలకుల అవకాశవాద విధానాల పుణ్యమా అని జాతి అనుభవిస్తున్న దీనావస్థ యిది.

అలీన విధానంలో మన పాత్ర ప్రశంసనీయంగా వుంది. శాంతి ఉద్యమాలలో చొరవ వుంది. ఐక్యరాజ్యసమితిలో వర్ధమాన దేశాల

ప్రక్కనవుంది. అగ్నిలాంటిమధ్యంతర మిసిలీల ప్రయోగంద్వారా దేశరక్షణ గట్టిపడింది.

భారతదేశంలోని విదేశీ బహుళజాతి కంపెనీలు ప్రజలను విపరీతంగా దోపిడీ చేస్తున్నాయి. ఐ.యం.యఫ్ లోనులు కారణంగా దిగుమతులు పెరిగి, మనదేశం నుండి, ఎగుమతులు గణనీయంగా పడిపోయాయి. ప్రవాస భారతీయులు ఏటా 3000 కోట్ల రూపాయలు ఈ దేశానికి పంపకపోతే పరిస్థితి మరింత గడ్డుగా వుండేది.

90,000 కోట్ల విదేశీ అప్పులు తలకుమించిన భారంగా తయారయ్యాయి. 40 వేల కోట్ల బ్లాక్‌మనీ, ధరలు పెరుగుదలలో కీలకపాత్ర వహించుతున్నది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పన్నులు విధానం, లోటు బడ్జెట్ లు కారణంగా ధరలు పెరిగి రూపాయి విలువ 12 పైసలుకు పడిపోయింది.

ఇవిగాక దేశ రక్షణకు అవసరమైన కీలక ఆయుధాలు కొనుగోలులోనే కోట్లు చేతులు మారుతున్నాయి. అత్యున్నత పదవిలో వున్నవారే అందుకుపాల్పడుతున్నారు. బోఫోర్స్ కుంభకోణాలు, జర్మన్‌జలాంతర్గములు తంతు ఎన్నని చెప్పాలి. చివరికి పబ్లిక్ అకౌంట్ కంపెనీ అధ్యక్షుడుగా కావలసిన వారిని వేసుకున్నారు. ఇన్ని కుంభకోణాలతో కుతకుతలాడుతున్న రాజీవ్ ప్రభుత్వం రాజ్యమేలుతోంది.

మనదేశంలో ఖాయిలా పడిన పరిశ్రమలు 2 లక్షలకు చేరుకున్నాయి. ఇది ఏడాదికి 20 వేల చొప్పున రోజుకు 90 పరిశ్రమలు మూలపడుతున్నాయి. వీటిలో 7,000 కోట్లు బ్యాంకు రుణాలు స్తంభించి పోయాయి. ఇక నిరుద్యోగులవుతున్న కార్మికులకు లెక్కలేదు.

సర్కారీ కమీషన్ చెప్పినా, గవర్నర్ల నియామకంలో రాష్ట్రాలకు పాత్రలేదు. అసెంబ్లీ లో తేలవలసిన బలనిర్ధారణ గవర్నర్ల కలాలతోనే తేలిపోతున్నది. సంవత్సర కాలంలోనే నాగాలాండ్ తమిళనాడు, కర్నాటక రాష్ట్రాల్లో ప్రభుత్వాలు కూల్చివేయబడ్డాయి.

ఎన్ని ఇబ్బందులు ఎదురైనా పశ్చిమ బెంగాలు, కేరళ రాష్ట్రాలు ప్రజల పక్షాన నిలచి వారిని చైతన్యపరుస్తూ ఉన్న పరిమితుల మేరకు సౌకర్యాలు కల్పిస్తూ ప్రత్యామ్నాయ మార్గాలు చూపుతున్నాయి.

మన రాష్ట్రంలో 1983 లో తెలుగుదేశం ప్రభుత్వం అధికారానికి వచ్చింది. తెలుగుగంగ, బియ్యం కిలో రెండురూపాయలు, స్త్రీలకు ఆస్తిహక్కు, ఉద్యోగాలలో 30 శాతం రిజర్వేషన్లు, శాశ్వత గృహనిర్మాణం, హైదరాబాదుకు నీటి వసతి పథకం లాంటి మంచిపనులు చేపట్టింది.

ప్రజలపై పన్నులపెంపు, బస్సురేట్లు పెంపు, పాలధరలు పెంపు, లాంటి చర్యలు ప్రజలకు భారమైనవి భూసంస్కరణలు మాటలతో తప్ప చేతలతో కనిపించవు. అకస్మాత్తునిర్ణయాలు ఆపైన మార్చుకోవడాలు ప్రజలను చికాకు పరుస్తున్నాయి.

ఏ ప్రభుత్వమైనా ఉద్యోగుల సహకారం లేనిదే నడవడం కష్టం. కాని వారితోనే నిత్యం గొడవలు,రిటైర్‌మెంట్ వయస్సు తగ్గింపు. ఆతర్వాత కోర్టు చర్యలు, వున్నహక్కులు వూడబీకటం, ఆపైనస్టేలు, సమ్మెకాలానికి జీతం ఇవ్వకపోవడం లాంటి చర్యల ద్వారా ఉద్యోగుల సానుభూతి కోల్పోతున్నది.

అవినీతి ఆరోపణలకు కూడా తెలుగుదేశం ప్రభుత్వం అతీతంగా లేదు.

ఎవరేమన్నా ప్రజల కోర్కెలకు అనుగుణంగా మార్పురావాలి. అలా కానినాడు సూర్యోదయాన్ని ఎవరూ ఆపలేరు. చైతన్య జనస్రవంతి పురోగమనాన్ని కోరుకుంటుంది. ఆశతో రేపుకై నిరీక్షిస్తూ మనవంతుకృషి చేద్దాం.

మానవతపై అత్యాచారాలు, న్యాయమూర్తులపై ఘోరాలు, సమైక్యతకై నిలచిన వారికి సమాధులు, కలంపట్టిన జర్నలిస్టులకు, తమ అభిప్రాయాలు వ్యక్తపరచిన రచయితలకు, గళం విప్పిన మేధావులకు జైళ్ళు, హత్యలకు గురౌతుంటే ఎటువయనం, ఏది గమ్యం: ఆలోచించాలి. వాటిని ఎదిరించాలి.

## 4వ మహాసభల తరువాత

1986 జనవరిలో మనం లేకుండా సమ్మె నిర్ణయం తీసుకున్న ఫేప్టోదుందుడుకు నిర్ణయాలు తీసుకొని, 6-3-86 నుండి 19 రోజులు సమ్మె చేయించివిమీ సాధించకుండా అరగొర వప్పందంతో బయటపడింది. ఇందులో కూడా కొందరు బొగ్గు లేరుకోవాలని ప్రయత్నించి విఫలమయ్యారు.

1976 జూలై 10న విద్యామంత్రితో చర్చలలో లివ్‌నాట్‌డ్యూ సాధించడం జరిగింది.ఆ సందర్భంలోనే ఏర్పడిన ఫేప్టో ఫ్యాక్టా కలయిక తర్వాత లేకుండా పోయింది.

1986 జూలై 13న శ్రీ సుబ్రహ్మణ్యం పి.ఆర్ సి. రిపోర్టు ప్రభుత్వానికి యిచ్చారు. అందులోను ఫేప్టో సరైన రిపోర్టు యివ్వని కారణంగా మనం విడిగా రిపోర్టు యివ్వవలసి వచ్చింది. మన రిపోర్టే ఫేప్టో రిపోర్టుగా అంగీకరించిన కారణంగా దానిపైననే చర్చలు జరిగాయి.

అందులో ఉపాధ్యాయులకు స్కేల్సు లేవన్నారు, వున్నాయని మనం చెప్పి 288 జి ఓ. అమలుపై పంచాయిత్ రాజ్ మున్సిపల్ చివరికి ఎయిడెడ్ వారికి కూడా ఉత్తర్వులు పొందాం.

పాఠశాల విద్యా డైరెక్టరుతో 29-7-86న 56 సమస్యలపై చర్చలు జరిగాయి. 12-2-86న, 30-6-86న, 11-8-86, 23-8-86, 9-9-86 ప్రభుత్వ అధికారులను కలసి వివిధ సమస్యలు పరిష్కరించుకొనుట జరిగింది.

నూతన విద్యావిధానానికి వ్యతిరేకంగా 16-4-86న ఢిల్లీలో పార్లమెంటుకు జరిగిన ప్రదర్శనలో మనం కూడా పాల్గొన్నాము.

1986 నవంబరు 16న జరిగిన కేటగిరి 3 ఉపాధ్యాయులకు రాష్ట్ర వ్యాప్తంగా శిక్షణ యిచ్చి వారిని పరీక్షలకు సిద్ధపరచాము.

1986 నవంబరులో యు.టి.యఫ్ పక్షాన 50 వేల కార్డులు, నవంబరు 24న జిల్లా కేంద్రాలలో ధర్నాలు జరిపి, ఎయిడెడ్ ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారానికి కృషి చేయడం జరిగింది. 87 మార్చిలో ఆర్థిక దిగ్బంధనం కారణంగా ఎయిడెడ్ ఉపాధ్యాయుల బకాయిలు నిలిచిపోతే ఏప్రిలు 6,7 తేదీలలో రిలీజ్ చేయించడం

# విద్యాదర్శిని

విద్యా విజ్ఞాన మాసపత్రిక

16/156, మధ్యపతివారి వీధి, నెల్లూరు – 524 001. ఫోన్ : 5086

## విద్యాదర్శిని వర్క్ బుక్స్ సిద్ధంగా నున్నవి.

| | | |
|---|---|---|
| 3వ తరగతి | అన్ని సబ్జక్టులు కలసి ఒకే బుక్ | 9-00 |
| 4వ తరగతి | అన్ని సబ్జక్టులు కలసి ఒకే బుక్ | 10-00 |
| 5వ తరగతి | తెలుగు | 4-00 |
| | గణితం | 3-00 |
| | పరిసరాల విజ్ఞానం - 1 | 5-00 |
| | పరిసరాల విజ్ఞానం - 2 | 3-00 |
| 6వ తరగతి | గణితం | 6-00 |
| | సామాన్య శాస్త్రం | 5-00 |
| | సాంఘిక శాస్త్రం | 5-00 |
| 7వ తరగతి | గణితం | 6-00 |
| | సామాన్య శాస్త్రం | 5-00 |
| | సాంఘిక శాస్త్రం | 5-00 |

మా వర్క్ బుక్స్‌ను Assignment Books గాను, Home Work Books గాను ఉపయోగించవచ్చును. వర్క్‌బుక్స్ పూర్తిగా వ్రాయించిన పూర్తి నోట్స్ తయారవుతుంది. విద్యాదర్శిని వర్క్‌బుక్స్ వ్రాయించండి. 100% ఫలితాలను సాధించండి.

100% ఫలితాలను సాధించండి.

మీ అభిమాన ఆర్గనైజర్

తోట రంగారావు, బి ఎ., బి యిడి.

జరిగింది.

370 మూకవుమ్మడి బదిలీల జి.ఓ.కు వ్యతిరేకంగా మొట్టమొదట మనమే పోరాట కార్యక్రమం యిచ్చాం. 87 జూన్ 25నుండి టలిగ్రాములు కార్యక్రమం జూన్ 29 న తాలూకా కేంద్రాలలో ప్రదర్శన, జులై 6న జిల్లా కేంద్రాలలో ప్రదర్శన జయప్రదంగా నిర్వహించాం.

ఫేప్తో కార్యక్రమంలో భాగంగా సదస్సులు ధర్నాలు జరిపాము. 20-7-87 న హైదరాబాదులో 20 వేల మంది తో మహాప్రదర్శన జరిగింది. 5 సంవత్సరములు నిండినవారిని మాత్రమే రెవిన్యూ డివిజనుదాటించాలని 466 జి.ఓ.వెలువడింది.

16-5-87 హైదరాబాదులో విద్యాశాఖమంత్రి శ్రీఇంద్రారెడ్డి గారితో 3-9-87 న చర్చలు జరిగాయి. స్పష్టమైన కొన్ని హామీలు పొందాము. చనిపోయిన రిటైరైన వారికి పరీక్షనుండి మినహాయింపు పొందాము.

పే అనామలీస్‌పై వేసిన నటరాజన్ కమిటీ 14 అంశాలపై 26-3-37 న చర్చించడం జరిగింది. కాని, ఈ నాటికి సదరు కమిటీ రిపోర్టు బయటపడలేదు.

కరువుభత్యం నిర్ణయంపై వేసిన నలుగురు ఆర్థిక కార్యదర్శుల కమిటీలో 11-5-37 న చర్చలు జరిపి కేంద్రంతో సమానంగా డి ఎ యివ్వాలనే సూత్రాన్ని ఆమోదింప జేసుకున్నాము.

దేశవ్యాప్తంగా 26 సంస్థలు కలిసి 'భారత జన విజ్ఞానయాత్ర' జరిపి 5 చోట్ల నుండి అక్టోబరు 2న జాతాలు బయలుదేరి నవంబరు 7న భోపాలు లో ఆరువేల మందితో సదస్సు జరిగింది. అందులో మనం కూడా పాల్గొన్నాం.

## యు.టి.యఫ్.కు ప్రభుత్వ గుర్తింపు

మన జనరల్ కౌన్సిల్ నిర్ణయం ప్రకారం ముఖ్యమంత్రిని కలిసి రాయబారం జరిపాము. అన్ని జిల్లాలనుండి 21-11-87 నుండి 10-12-87 వరకు 50 వేల కార్డులు ముఖ్యమంత్రికి పోస్టుచేయించటం జరిగింది.

జి ఓ.యం.నెం 15,విద్య (సర్వీసెస్) తేదీ 13-1-1988న యు.టి.యఫ్.కు ప్రభుత్వ గుర్తింపు వచ్చింది. దానిని పాఠశాల విద్యాడైరెక్టరుగారు ఆర్.సి నెం.256 యస్.సి.సి. 2/88 తేదీ 28-1-1988 న అందరికి సర్క్యులేట్ చేశారు. జాయింట్ స్టాఫ్ కౌన్సిల్‌పునర్ నిర్మాణం చేశారు. అందులో మన ప్రాతినిధ్యం గురించి కృషి చేస్తున్నాము.

370 జి.ఓ. రద్దు గురించి 1988ఏప్రిల్ 10 నుండి నెలాఖరువరకు యుటియఫ్ అన్ని శాఖలు ముఖ్యమంత్రికి, జిల్లా పరిషత్ చైర్మనులు,మండలాధ్యక్షులు యం.యల్.ఏ.ఎం.పి ల ద్వారా విజ్ఞప్తి పత్రాలు పంపించుట ద్వారా జి.ఓ.ను తాత్కాలికంగా నిలుపుదల చేయించగలిగాము.

ఎయిడెడ్ పి.ఆర్.సి.రాదని, వచ్చినా జి.ఓ.తేదీనుండి వర్తించుతుందని అందరూ చెపుతున్నా మనం మాత్రమే 1-7-86 నుండి సాధిస్తామని చెప్పి విద్యామంత్రి ముఖ్యమంత్రి, విద్యాశాఖకార్యదర్శి పాఠశాల విద్యా డైరక్టరుతో దఫదఫాలుగా ప్రాతినిధ్యాలు జరిపి, జి.ఓ.114,తేదీ 27-4-88న సాధించాము. అదే జి.ఓ.లో మనం చెప్పిన ప్రకారం ఇంటి అద్దె వగైరాలు వర్తించేలా చేయించుకోగల్గాము.

హిందీ పండితుల విషయం, వారిశిక్షణ ఏర్పాట్లు గురించి పాఠశాల విద్యాడైరెక్టరుతో 19-6-88 న చర్చించి కొన్ని సౌకర్యాలు సాధించాము. సీనియర్లను మినహాయించాలని అర్హతలు గలవారిని ఇతరపోస్టులలో నియమించాలని ఇంగ్లీషులో మినహాయింపు యివ్వాలని, సిలబస్‌లో వెసులుబాటు కల్పించాలని ఫీజులనుండి మినహాయించాలని పరీక్ష తప్పితే రికవరీ చేస్తామనే నిబంధన తొలగించాలని కోరడం జరిగింది. కొన్ని అమలు జరిగాయి. పాఠశాల టయిమింగ్సు విషయంలో హైస్కూలు ప్రయిమరీ, స్కూలు ఉదయం గం 9-0 నుండి పెట్టాలనే దానిని మనం వ్యతిరేకించాం. అయితే మిగతావారు పట్టుపట్టిన కారణంగా జి ఓ.ఆవిధంగానే బయటకి వచ్చింది. అది ఉపాధ్యాయులకు ఎంత యిబ్బంది కరంగా వున్నా మార్పు జరుగలేదు.

ఫేప్తో 12 సమస్యలతో పోరాట కార్యక్రమానికి పిలుపు యిచ్చింది. 5-2-88 న లేక్‌వ్యూ గెస్టుహౌస్‌లో ప్రభుత్వంలో చర్చలు జరిగినా సమస్యలు పరిష్కరింపబడలేదు. 15-2-88న సెక్రటేరియట్ ముందు పికెటింగ్ జరిగింది 1200 మందితో 630 మంది మనం వున్నాం. మనం బ్యాడ్జి పెట్టామని, నాంపల్లి పోలీసుస్టేషనులో నానాగొడవ చేశారు. ఆ రాత్రి జరిగిన కౌన్సిల్‌లో వాస్తవాలు వివరించాం. ఆ విషయాలు యు.టి యఫ్ వార్తలలో మన కార్యకర్తలకు తెలియచేస్తే దానిపై కరపత్రం వేశారు. తిరిగి గట్టిగా జవాబు ఇవ్వవలసి వచ్చింది.

తర్వాత 88 మార్చిలో రిలే నిరాహారదీక్షలు, కలెక్టరు కార్యాలయాల ముందు పికెటింగులు నిర్వహించాం 27-4-88 న సెక్రటేరియట్ ముందు ధర్నా జరిగింది. వర్షంలో అందరూ తడిసిపోయారు. ప్రతినిధివర్గం అధికారులను కలిసి సమస్యలు వెంటనే పరిష్కరించాలని విజ్ఞప్తి చేసింది.

21-6-88 న విద్యాశాఖ డైరెక్టరుగారితో ప్రావిన్స లైజేషన్‌పై చర్చలు జరిగాయి. ఒక అవగాహనకు రావడం జరిగింది.

## ఈ సంవత్సర కాలంలో

15వ వార్షిక జనరల్ కౌన్సిలు 1988 ఆగస్టు 13,14 తేదీలలో విజయవాడ చెన్నుపాటి భవనంలో జరిగింది. విద్యాగోష్టి జరిపి, నిర్మాణ విషయాలు చర్చించి, క్యాంపెయిన్ల కోటాలు తీసుకున్నాం.

ఈ సంవత్సరం మన ఉద్యమ చరిత్రలోనే మరపురాని సంఘటనలు జరిగాయి. తిరుగులేని విజయాలు సాధించాము. ఉద్యమ పతాకను ఉన్నతోన్నంగా ఎగురవేశాము.

నిజంగా ఉద్యమ చరిత్రలో స్వర్ణయుగమిది. కొంతకాలంగా 45-47 వేల మధ్య వుండే సభ్యత్వం 53 వేలకు పెరిగింది. 15 వేలుగా వుండే పత్రిక సర్క్యులేషన్ 17 వేలు దాటింది. ప్రచురణల విభాగం

ఉపాధ్యాయుల ఆదరాభిమానాలు పొంది ఎల్క్ట్రానిక్ యుగంలో ప్రవేశించింది. 1,2,3, తృతీయ ముద్రణ 4 ద్వితీయ ముద్రణ వేయవలసి న స్థితికి వచ్చింది.

జిల్లాలోగాని రాష్ట్రాలలోగాని ఏ పిలుపు యిచ్చినా తిరుగులేని విధంగా జయప్రదమవుతున్నది. మహాసభలు అన్నా, భవనాలు అన్నా ఎంతో ఆదరణ,మరింతో ప్రోత్సాహం లభిస్తున్నది.

ఇదంతా మనం అనుసరించిన విధానాలకు విజయం, మన సూత్రబద్ధవైఖరి కారణంగా చేకూరిన ఫలం. అవినీతి కి, అధికార దురహంకారానికి, వ్యతిరేకంగా రాజీలేని పోరాటం జరిపిన ఫలితం శత్రువులు సాగించిన దుష్ప్రచారాన్ని త్రిప్పికొట్టి చెన్ను పాటి అడుగుజాడలలో నడచినకారణంగా సాధించిన విజయాలివి.

ఒకటి మాత్రం నిజం. 1974 లో మనం సంఘం పెట్టినపుడు మన ఆశయాలు సూత్రాలు ఎద్దేవా చేసినవారే ఎదిరించినవారే పుష్కరం తరువాత పునరాలోచన చేసుకొని వారంతా ఆంధ్ర తెలంగాణాలకు ఉద్యమాన్ని విస్తరింప జేశారు. ప్రాథమిక సెకండరీలను కలిపారు. పంచాయితీరాజ్ ఎయిడెడ్‌లకు పరిధి విస్తరింపచేశారు. ఇదంతా మన నైతిక విజయం.

అయితే చేసింది ఎంతవున్నా చేయవలసినది చాలా వున్నది. కార్య కర్తలకు తగినంత శిక్షణ యిచ్చామా? సామాజిక స్పృహతో పయనించేలాచేయగలిగామా? అవినీతి అన్ని సందర్భాలలోను ఎదిరించేలా చేయగలిగామా? పాఠశాలలో అంకితభావంతో పనిచేశేలా చూడగలిగామా? ఇతర ప్రజా సంఘాలకు మన సహకారం యిచ్చి పొందగలిగామా? ఇవన్నీ ఆత్మవిమర్శ చేసుకోవలసిన భాగాలు.

శాసనసభ్యుడు శ్రీ వంగవీటి మోహనరంగారావు దారుణ హత్యను మనం ఖండించాం. అయితే ఆ సందర్భంలో నాల్గు జిల్లాలలో జరిగిన దారుణ మారణకాండను తీవ్రంగా నిరసించాం.

మనకు ఆలిండియా పరిధిలో సంఘంలేదని ఎందులోనూ చేరలేదనేది ఒకటుంది. ఆ లోటుకూడా త్వరలో తీరనున్నది. ఆలిండియా సంఘం ఏర్పడనున్నది. అందుకు తీవ్రప్రయత్నాలు చేస్తున్నాము. మన మహాసభలలోనే దాని కొక రూపం రానున్నది. మన రాష్ట్ర ంలోనే దానికి పునాదులు పడనున్నాయి.

## ఫేప్టో కార్యక్రమాలు

విజయవాడలో 27-9-88న ఫెప్టో కార్యవర్గం జరిగింది. గత అగ్రిమెంట్లు అమలు జరుపని ప్రభుత్వ వైఖరికి నిరసనగా పోరాట కార్యక్రమం జరుపాలని తగు సంఖ్యలో ఉపాధ్యాయులను తీసుకురావాలని నిర్ణయించటం జరిగింది.

22-11-88 న హైదరాబాదులో సెక్రటేరియేట్ ముందు ఒకటి, డైరక్టరు కార్యాలయాల ముందు మరొకటి రెండు శిబిరాలు వేసి ధర్నాలు జరిపాము. రెండు చోట్ల మనం 200 మందిమిదానిలో పాల్గొన్నాము.

అయితే సదరు శిబిరాలను స్వామినాథన్ ప్రారంభించిసందులకు నిరసన తెలిపాము. ఆయన ఉపన్యాసానికి అభ్యంతరం చెప్పాము. ఫెప్టోసంఘాల బేడ్జిలు సమన్వయం చేసి ధరించాము.

ప్రొవిన్సలైజేషన్‌పై 1-9-88న విద్యాశాఖ కార్యదర్శితో చర్చలు జరిగాయి ఫైనాన్స్ సెక్రటరీ, పాఠశాల విద్యాడైరక్టరు చర్చలకు హాజరయ్యారు.

## ఫేప్టో ప్రతిపాదనలు

(1)1-9-88నుండి కామన్ సీనియారిటీ అమలు జరపాలి.

(2)20-3-81నుండి31-8-88వరకు విప్రమోషనలు పొందకుండా వున్న పంచాయితీరాజ్ టీచర్లకు ప్రభుత్వఉపాధ్యాయులకు ఇచ్చిన ప్రమోషన్ పోస్టులు సూపర్ న్యూమరీ పోస్టులు సృష్టించి ప్రమోషనులు ఇవ్వాలని

(3) ఇంతవరకు ప్రమోషన్లు పొందిన ఎవరినీ రివర్టు చేయరాదని,

(4) లోగడ పంచాయితీరాజ్ వారికి వున్న అన్ని సౌకర్యాలు కొనసాగించాలని ఆ ప్రతిపాదనలు

వీటిపై గంటకు పైగా చర్చలు జరిగి వాయిదా పడ్డాయి సంఘాలమధ్య పోస్టులు రిజర్వు చేయడంలో సమన్వయంగురించి కృషి జరిగింది. అటుతర్వాత ఈ విషయమై రెండుమూడుసార్లు చర్చలు జరిగాయి. యం.ఇ.ఓ. పోస్టులకు మాత్రం ఉత్వర్వులు వచ్చినా రూల్సు రాలేదు. కనుక సీనియారిటీనిఖాయపరచినా ప్రమోషను విషయాలు ఫైనలు కాలేదు.

పాఠశాల విద్యాడైరక్టరుగారి నుండి జి ఒ. లెటరు నెం.182, తేదీ 13-10-58 న 8వ పంచవర్షప్రణాళికలో విద్యారంగంలో అనుసరించవలసిన విధానాలపై విద్యా నిర్వహణలో ఉపాధ్యాయుల భాగస్వామ్యము గురించి చర్చలకు పిలిచారు. సదరు విషయాలపై 24-11-88, 3-4-89 తేదీలలో చర్చలు జరిగాయి. మన సంఘ పక్షాన పెట్టిన ప్రతిపాదనలపై చర్చ జరిగింది.

'మండల పరిపాలనలో సంఘాల భాగస్వామ్యము', అనే అంశంపై యు.టి.యఫ్. కు కేటాయించే మండలాలలో తగు పాత్ర వహించి విద్యబోధించడంలోనే కాకుండా ప్రజల సహకారంతో తగు వసతులు భవనములు ఏర్పాటులో కృషి చేస్తామని చెప్పడం జరిగింది. రాష్ట్ర వ్యాప్తంగా మా కార్యకర్తలు అందుకు సిద్ధంగా వున్నారనికూడా చెప్పాము. అది యింకా చర్చల దశలోనే వున్నది.

## ఫెప్టో వింత పోకడలు

1972 లో ఫెప్టో స్థాపించబడింది. స్థాపించినా కదలక పడివున్నది. 1976లో పునరుద్ధరించబడింది. కాలక్రమేణా అనేక పోరాటాలు సాగించి విజయాలు చేపట్టాము. సంఘాల ఎన్నివున్నా సమస్యలమీదనైనా కలసి పనిచేశాము. ఫెప్టో కదలకపోతే మనమే కదలి కొన్ని పోరాటాలు చేపట్టి ఫెప్టోను లేపాము. చర్చలలో అనేక జాగ్రత్తలుతీసుకొని ప్రభుత్వాన్నుండి వీలైనన్ని సౌకర్యాలు సాధించాము. సమ్మెలకు పిలుపుఇచ్చినా అంతకుముందే చర్చలవ్వారా ఫలితాలు వచ్చేలాగున చూశాము. ఒకవేళ సమ్మెచేసినా 1,2 రోజులలోనే పరిష్కరమయ్యేలా చూసి సదరు సమ్మెకాలం కూడా ఆన్‌డ్యూటీగానే,

వేసవిలో పనిచేసి సరిపెట్టుకొనేలాగో చేయగలిగాము.

రీగ్రూపింగ్, 10-15 స్కేళ్ళు, టెస్టుపాసవుటకు 5సం॥లు వ్యవధి, మొదలగు అతి ప్రధాన సమస్యలు సులువుగా సాధించడంతో ఉపాధ్యాయులతో ఉదాసీనత కొన్ని సంఘాలలో దురాశ చోటు చేసుకున్నది.

1986లో మనం లేకుం[illegible]కు పిలుపు ఇచ్చి మార్చి 6నుండి 24 వరకు 15రోజు[illegible] చేయించారు. చర్చలు ఫలించినా పోలేదు. 20 రోజులు సమ్మెను చేసి మ[illegible]మే చర్చ వెళ్ళాలి. అనే నిర్ణయం తీసుకున్నారు. లోగడ యు.టి.యఫ్. కారణంగా సమ్మెకుముందు మధ్యలోను చర్చలకు వెళ్ళి నష్టపోయామని ప్రచారం చేశారు.

ఫలితంగా 1986 సమ్మెలో ఘోరంగా నష్టపోయాము. అరకొరవప్పందంలో సమ్మె కాలాన్ని కూడా తెల్చకుండానే విరమించి ఉద్యమాన్ని ఒక దశాబ్దం వెనుకకు నెట్టాము. ఫలితంగా ఈ కాలమంతా పెద్దపోరాటం చేయలేక పోయాము. సమ్మె అంటే ఉపాధ్యాయులు అందుకోలేని స్థితి ఏర్పడింది.

లోగడ ఫెఫ్టోలో 16 సంఘాలు వుండేవి. తర్వాత లైబ్రరీయన్ సంఘం, యన్.టి.యు, మున్సిపల్ టీచర్స్ అసోసియేషన్, జెయల్స్ అసోసియేషన్, ప్రధానోపాధ్యాయుల సంఘం. డైరెక్టు పేమెంటు అసోసియేషను, ఆర్టుఅండ్‌క్రాఫ్టు టీచర్సు సంఘాలు ఫెఫ్టోనుండి వైతొలిగాయి. ఇక యు.టి.యఫ్; యన్.టి.యు; ఎ పి టి.యఫ్; పి.ఆర్ టి.యు, ఆర్.జె యు.పి; బి.ఇ.డి.అసోసియేషన్, ఎయిడెడ్ టీచర్సు గిల్డు (హైదరాబాదు) ఎయిడెడ్ టీచర్సు అసోసియేషను (గుంటూరు) తూర్పుగోదావరి జిల్లా గిల్డు 9 మిగిలాయి. త[illegible]త పండిత పరిషత్, ఆంధ్రప్రదేశ్ ఉపాధ్యాయ సంఘాలు ఫెఫ్టోలో చేరగా 11 సంఘాలు అయ్యాయి.

ఇందులో చాలా క్యాడరు సంఘాలు, క[illegible] నిర్మాణం లేకుండా జిల్లాలకే వ్యక్తులకే పరిమితమైన సంఘాలు పేనరు పెట్టాలంటే రెండవ మనిషి వుండనివి, పెడ్జీలు వద్దనేవి (రకరకాలుగా ఉన్నాయి). అయినా ఎలాగో అందరినీ కలుపు[illegible]ని పోరాటాలు సాగిస్తూ వస్తున్నాము.

లోగడ ఎన్నికలు రొటేషన్ పద్ధతిలో జరిగేవి. తర్వాత పోటీలు మొదలయ్యాయి. తిరిగి మనం పట్టుబట్టగా అందరికీ అవకాశంవచ్చేలా లాటరీ పద్ధతి పెట్టారు. తిరిగి దానిని మార్చి పోటీ పద్ధతి అనుసరించారు. చిల్లరమల్లర సంఘాలను కూడగట్టి డబ్బులుగట్టి అలాంటివారి ఓట్లతో కొందరు ఎల్లకాలం పదవులలో కొనసాగే విధానాలు చేపట్టారు. సహజంగానే యిది ఐక్యతను దెబ్బతీసి వివాదాలకు కారణమయింది.

అక్కడితో ఆగకుండా ఒంటెత్తు విధానాలు అనుసరించేవరకు వచ్చింది. తమ తమ సంఘాల ఉనికి ఫెఫ్టోద్వారా కాపాడుకొనేవరకూ వెళ్ళింది. ఆపేరుతో పైరవీ కార్యక్రమాలు ప్రకటనలు చే[illegible]రు. వీటిని మనము మరికొన్ని సంఘాలు తీవ్రంగా వ్యతిరేకించాము.

ఇది యన్ జి.ఒ.ల సమాఖ్యలో చేరేవిషయమై ఫెఫ్టోతీసుకున్న వైఖరితో తీవ్రమైన అభ్యంతరాలు ఎదురయ్యాయి.

శ్రీగురవయ్యగారు నాయకత్వాన 60 సంఘాలు కో-ఆర్డినేషన్ కమిటీగా ఏర్పడ్డాయి. అందులోనుండి కొన్ని సంఘాలు విడిపోయి రమణయ్యగారి నాయకత్వాన జె.ఎ.సి. ఏర్పాటు చేశారు. వారినుండి అ[illegible]o రాగానే ఫెఫ్టో నా[illegible]త్వం ఎవరితో చె[illegible]పెట్టక[illegible] 1988 న[illegible]రు 4వ జె.ఎ.సి [illegible] పోయి నట్లు ప్రకటించారు.

దానిని[illegible]సం [illegible]ఖండించాము. నవంబరు 22,24 ఫెఫ్టో సమా[illegible]లోను [illegible] జనవరి 12 ఫెడరల్‌కౌన్సిల్ లోను ఫెఫ్టో వైఖరికి తీవ్రనిరసన తెలిపాము. వారు అనుసరించిన ఎన్నికల విధానానికి అసమ్మతిగా వాకవుట్ చేశాము.

యన్.జి ఓ.లు రెండుగ్రూపులుగా వుండగా వారిని సమన్వయంచేయాలిగాని ఒకదానిలో చేరకూడదని అదికూడా ఫెఫ్టో నిర్ణయించాలని ఉపాధ్యాయ సంఘాలలో బయటవున్న ప్రధానమైన ఎ.పి.టి ఎఫ్ (హెచ్) ప్రధానోపాధ్యాయ సంఘాలను ఫెఫ్టోలో చేర్చుకున్న తర్వాతనే యితరులతో ఐక్యత విషయమై ఆలోచించాలని సమస్యలురూపొందించే దానిలో తగు జాగ్రత్తలు తీసుకోవాలని యాక్షన్ కమిటీలో ప్రాతినిధ్యం కూడా ప్రధానమైనదేఅని ఇందులో దేనిని పట్టించుకోకుండా చేరిన ఫెఫ్టో వైఖరిని మనం ఖండించాం.

కొన్ని సంఘాలు కలిసిన ఫెఫ్టో ఒక ఫెడరల్ బాడి ఏకగ్రీవ నిర్ణయాలు తప్ప అందరూ అంగీకరించిన పద్ధతులలో తప్ప మరొక విధంగా పోరాడరాదు. కార్యక్రమాలు చేపట్టరాదు. అందుకు విరుద్ధంగా నడిస్తే సమైక్యతకు భంగం కలుగుతుంది.

ఈ ప్రత్యేక పరిస్థితులల[illegible] యు.టి.యఫ్. యన్.టి.యు. ఎ.పి.టి.యఫ్.(హెచ్) ప్రధానోపాధ్యాయ సంఘాలు సమన్వయంతో వ్యవహరించి పోరాటకార్యక్రమానికి పిలుపు ఇవ్వవలసి వచ్చింది.

1989 ఫిబ్రవరి 7న హైదరాబాదులో నాల్గు సంఘాలు కలసి పత్రికాగోష్ఠి జరిపాము. 23 సమస్యలు వివరించాం.

మేమెందుకు పోరాటం చేపట్టవలసివచ్చిందో చెప్పాం. రాష్ట్ర వ్యాప్తంగా దానికి ప్రాచుర్యం లభించింది. సరైన సమయంలో మన సమస్యలు మరుగున పడకుండా కార్యక్రమం చేపట్టాం.

మహాసముద్రంలో మన సమస్యలు ఏమౌతాయోనని ఆవేదనతో వున్న ఉపాధ్యాయులకు మన పిలుపు కొండంత అండ ఇచ్చింది. అపూర్వంగా ఆదరించారు. అమోఘంగా జయప్రదం చేశారు. అనితరసాధ్యమైన విజయాలు చేపట్టారు.

ఫిబ్రవరి 8,9 తేదీలలో ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిని కలిసి సమస్యలపై మెమొరాండం యిచ్చాం. అధికారుల కమిటీకి నివేదిస్తానని వారితో మీరు కూడా చర్చించుటకేర్పాట్లు చేస్తానని చెప్పారు. ముఖ్యమంత్రికి కూడా మన మెమోరాండం అందచేశారు.

16-2-89 జిల్లా కేంద్రాలలో నాల్గు సంఘాలవారు సమావేశాలు ఏర్పాట్లు చేసుకొని సమన్వయం చేసుకొని 20-2-89 న అన్ని జిల్లా కేంద్రాలలోధర్నాలు అత్యంత జయప్రదంగా నిర్వహించారు. 200నుండి 1000 మంది వరకు ప్రతిజిల్లాలో ఉపాధ్యాయులు ధర్నాలో

పొల్గొన్నారు.

3-3-89న ఛలో అసెంబ్లీ మహాప్రదర్శన చూడవలసిందేకానిచెప్పతరం కాదు. నాల్గుసంఘాలకార్యకర్తలు ఉపాధ్యాయులు వారివారిబ్యానర్లు బ్యాడ్జీలతో 20వేల మందితో మానవమహాసముద్రంలా మహాపట్టణాన్ని ఊపేసింది. నినాదాలతో హెూరెత్తించింది. ఉపాధ్యాయుల నిరసనప్రభుత్వానికి అర్థమైంది.

అదేరోజు సాయంత్రం 4 గంటలకు నాల్గుసంఘాలను అధికారుల కమిటీ చర్చలుకు పిలిచింది. మనం చెప్పినది వినడం తప్ప ప్రతిస్పందనలేదు. నాల్గు సమస్యలు అయ్యేటప్పటికి వారికి సమయం మించిపోయింది.

మార్చి 7న మనం మరొక పత్రికాగోష్టి జరిపాము. అధికారుల కమిటీవైఖరివివరించాము. ఇలా అయితే సమస్యలు పరిష్కారం అయ్యేస్థితి లేదని చెప్పాము. కేబినేట్‌సబ్‌కమిటీని వేయమని డిమాండ్ చేశాము. సహజంగా దీనికికూడా మంచిప్రాముఖ్యం లభించింది. 1989 మార్చి 8న ముఖ్యమంత్రిని నాల్గుసంఘాల పక్షాన కలసి సమస్యల పరిష్కారానికి కేబినేట్‌సబ్‌కమిటీని వేయాలని సమస్యలువెంటనే పరిష్కరించమని కోరాము. ఆయన అంగీకరించికేబినేట్‌సబ్‌కమిటీని వేశారు అసెంబ్లీ ముగిసేలోగా సమస్యలపై ప్రకటిస్తానని హామీ ఇచ్చారు.

జి.ఒ.ఆర్. టి 979 తేది 9-3-89 న ఐదుగురుమంత్రులతో కేబినేట్‌కమిటీ వేశారు. వారిని కలసి మాట్లాడాము. 14-3-89 న చర్చలుకు ఏర్పాటు చేశారు. మనకంటే ఒకగంటముందు జె.ఎ.సి.తో ఏర్పాటు జరిగితే మనం నిరసనతెలిపాము. కేబినేట్‌మంత్రులునిలదీస్తే అధికారులు విచారం ప్రకటించారు. అపైనజరిగిన దానికి మనకు సారీచెప్పారు.

కేబినేట్ సబ్‌కమిటీతో గంటలపాటు చర్చించాం. సమస్యలపై వివరమైన నోట్సు యిచ్చాం. నాల్గు సంఘాలు వంతులువారీగా సమస్యలపై వివరణయిచ్చాం. మన వైఖరి,మననోట్సు, మనవివరణ వచ్చిన మంత్రులు అధికారులు మన సమస్యలు తప్పక పరిష్కరిస్తామని హామీ ఇచ్చారు.

ఆతర్వాత కూడా ముఖ్యమంత్రిని కేబినేట్ సబ్‌కమిటీలోని మంత్రులను అధికారుల కమిటీలోని వారిని కలసి చర్చించాము. ముఖ్యమంత్రి ప్రకటనలో మన సమస్యలు వచ్చినట్లు తగు జాగ్రత్తలు తీసుకున్నాము.

జె.ఎ.సి. ఫిబ్రవారు కేబినేట్ సబ్‌కమిటీతోగాని అధికారులు కమిటీతో గాని చర్చలతో సమస్యలు వివరించక 53రోజులు జీతం గురించి మాత్రమే మాట్లాడి అదీ ఇవ్వకపోతే చర్చలు బహిష్కరిస్తామని ప్రకటన చేసి బయటకు వచ్చారు.

అటుతర్వాత వెళ్ళిన గురవయ్య సంఘంవారు చర్చలలో మన విధానాన్నే అనుసరించి కొన్నిసాధించడానికి మార్గం వేసుకున్నారు.

31-3-89 ముఖ్యమంత్రి అసెంబ్లీలో 11 సమస్యలు పరిష్కారానికి చర్యలుగైకొన్నట్లు ప్రకటనచేశారు. అందులో 9 ఉపాధ్యాయులకు వర్తించేవి.

దీనినిబట్టి చేపట్టిన కార్యక్రమం ఎంతటి ప్రధానమైనదో ఉపాధ్యాయులుగ్రహించి తమ హర్షామోదాలు తెలియచేశారు. ఈపద్ధతిలోనే మిగిలిన సమస్యలు సాధించాలని సూచించారు.

దీన్నిగురించి ఫెబ్రవారు వేసిన కరపత్రానికి జవాబుగా మనం కరపత్రం వేయడమేగాక ఐక్య ఉపాధ్యాయ మే పత్రికలో వివరమైన జవాబు ఇచ్చాము అందుచేత ఆ వివరాలన్నీ యిక్కడ వ్రాయడంలేదు.

2-4-89 న సంఘ పక్షానమహబూబ్ నగరంలోను పంచాయితీరాజ్ మంత్రిగారిని కలిసి 370 జి.ఓ.రద్దుపై మన అభిప్రాయాలు చెప్పాము. ఈ క్రింది సూచనలు చేశాము.

1.ప్రక్కమండలానికి అనే సవరణ ఉత్తర్వు వెంటనే ఇవ్వాలి.

2.రెండు సం॥రం స్వంతమండలంలో వున్నారనే కారణంగా ఎవ్వరినీ బదిలీచేయకుండాబదిలీలపై ఆంక్షవిధించాలి.

3 1987 లో 370 జి ఒ ప్రకారం బదిలీ అయినవారిని తిరిగి ప్రక్కమండలానికి రిక్వెస్టుపై తీసుకురావాలి.

4.262 జి ఒ.లో ఉన్న సౌకర్యాలు క్రొత్తగా యిచ్చే జి.ఒ.లో కొనసాగించాలి.

వాటిని అన్నిటిని అంగీకరించారు. ఆతరువాత పత్రికాప్రకటనచేస్తూ పై రెండిటిపై జి.ఒ. యిచ్చారు.

తిరిగి 1989 మే24న పంచాయితీరాజ్ మంత్రి గారిని కలసి 1987లో బదిలీలు జరిగిన వారి విషయమై ఉత్తర్వు గురించి అడుగగా వారం రోజులలో యివ్వగలమని తెల్పిరి విద్యాశాఖ కార్యదర్శిగారిని కలిసి రాయబారములు జరువగా10-15-22.స్పెషల్ పండితులు పి.ఇ.టి ల అప్‌గ్రేడు ఉత్తర్వులు వెంటనే యివ్వగలమని తెల్పిరి.

నాల్గుసంఘాల పోరాటం ఫలితంగా వచ్చిన ఉత్తర్వులు

1.జి.ఒ.యం యన్.నెం 150 ఫైనాన్స్ తేదీ 4-4-89 గ్రాట్యుటీ50వేలకు పెంపుదల.

2.జి.ఒ.యం యన్.నెం.151 ఫైనాన్స్‌తేదీ 10-4-89యల్.టి సి పునరుద్ధరణ.

3.జి.ఒ.యం యన్.నెం. 153ఫైనాన్స్‌తేదీ10-4-89 ఏజన్సీలో ఓ.పి ఎ పునరుద్ధరణ.

4.జి.ఒ.యం.యన్ నెం. 154ఫైనాన్స్‌తేదీ12-4-89 కరువుభత్యం పెంపుదల.

5.జి ఒ.యం.యన్.నెం 148 విద్యాతేదీ 21-4-89ప్రధానోపాధ్యాయుల ప్రమోషను స్కేలు గురించి.

6.జి ఒ.యం.యన్.నెం. 149విద్య తేదీ22-4-89 లెక్చెరర్లను ఇతర జిల్లాలకు బదులురెవిన్యూ డివిజనుకుబదిలీ

7.జి.ఒ.యం.యన్ నెం. 151 విద్యతేదీ 25-4-89 గ్రేడు1 పండితులకు ప్రమోషనుస్కేలు

8.జి.ఒ.యం.యన్ నెం 273 పంచాయితీరాజ్‌తేదీ 29-4-89 రెవిన్యూ డివిజనులకు బదులు ప్రక్కమండలానికి

9.జి.ఒ.యం.యస్.నెం. 185 విద్యతేది 27-5-89 ఎయిడెడ్ పి.ఆర్సి ఐకాయిలు.

1986 తర్వాత ఇంత పెద్దగా జి.ఒ.లు రావడం ఇదేమొదలు. దీని ఆధారంగా మిగిలిపోయిన రిట్టైరుటీచర్సు మినిమం పెన్షన్ రు.375 - మరియు పెన్షన్డి.ఎ.ఇన్సర్వీసు బి.ఇ.డి.ల ప్రమోషనులు అన్ఎయిడెడ్ పోస్టుల గ్రాంటు ట్రిబ్యునలు తీర్పులు అమలు, ప్రధానోపాధ్యాయుల గెజిటెడ్ పోస్టులు పనిచేసినదామాషాన శలవు హక్కులు సాధించ వలసివున్నది.

గత కౌన్సిల్లో మనం తీసుకున్న నిర్ణయప్రకారం 13 సమస్యలతో ముఖ్యమంత్రి కి నోటీసు యిచ్చాము. వాటికి మండల,పట్టణ,జిల్లాశాఖల సమస్యలు కూడా జోడించి ఆయా మానేజిమెంట్లకు నోటీసు యివ్వటం జరిగింది.

చాలా మండలాలలో ధర్నాలు జరిగాయి.14-10-88న 15 జిల్లా కేంద్రాలలో జయప్రదంగా ధర్నాలు జరిగాయి. విజయనగరంలో అక్టోబరు 1న పశ్చిమగోదావరి జిల్లాలో అక్టోబరు 29న ధర్నాలు జరిగాయి. విశాఖ తూ.గో కడప, కె.నగర్,మెదక్ జిల్లాలో జరుగలేదు.

## యు.టి.యఫ్.ఉద్యమ తరగతులు

యు.టి.యఫ్.సామాజిక స్పృహతో పనిచేస్తున్న సంస్థ తనకార్యకర్తలు అంకిత భావంతో పనిచేసే విధంగా తీర్చిదిద్దాలనే ఆశయం గల సంఘం. అవినీతికి వ్యతిరేకంగా రాజీలేని పోరాటం నడపాలనుకుంటున్న సమరశీల పోరాటసంస్థ.

అందుకే సమస్యల పరిష్కారంలో తగుపరిజ్ఞానాన్ని ఉద్యమ నిర్వహణలో తగు మెలకువలను బోధించేందుకు ఉద్యమతరగతులు నిర్వహించడం జరుగుతున్నది.

ఈ సంవత్సరకాలంలో 13 చోట్ల క్లాసులు నిర్వహించాం. వాటికి టీచర్లుగా మనం మన విద్యా విధానం' శ్రీ మైనేని వెంకటరత్నం ,ఉద్యమచరిత్ర శ్రీ ఎ.వెంకటస్వామి నిబంధనావళి నిర్మాణ విషయాలు డిరామిరెడ్డి, శ్రీ విజాలసుబ్రమణ్యం, 'ఫండమెంటల్రూల్స్' శ్రీ కె.జోజయ్య 'సెలవు' రూల్సు శ్రీ ఎం.ఎ.కె.దత్తు, జి.లక్ష్మయ్య శ్రీ టి.కొండాచారిశ్రీ గౌస్మొహియుద్దీన్ 'పెన్షన్రూల్స్' శ్రీ సత్యనారాయణ శర్మ జి లక్ష్మయ్య శ్రీ డి రామిరెడ్డి సి.సి.ఎ.రూల్సు' శ్రీ పి.సత్యన్నారాయణ గారలు చెప్పిరి.

## 1988 ఉద్యమ క్లాసులు తేదీలు-సంఖ్యావివరాలు

1. కోస్గి: మహబూబ్నగర్ 88 మే 12, 13, 14 తేదీలు, సంఖ్య 125
2. భీమిలి. విశాఖ, శ్రీకాకుళం,వి.నగర్ 88 మే23,24,25,సంఖ్య 110
3. దామరమడుగు: నెల్లూరు, చిత్తూరు, మే 25,26,27,సంఖ్య 110
4. టంగుటూరు: ప్రకాశం 1988 మే 28, 29, 30 సంఖ్య 175
5. వైరా: ఖమ్మం 1988 మే 30, 31 జూన్ 1 సంఖ్య 111
6. నడిగూడెం: నల్గొండ, రంగారెడ్డి, 1988 జూన్ 4, 5, 6,సంఖ్య135
7. రామచంద్రపురం: తూర్పుగోదావరి1988 జూన్ 6,7,8,సంఖ్య133
8. వీరవాసరం: పశ్చిమ గోదావరి 1988 జూన్ 6, 7, 8,సంఖ్య 135
9. వరంగల్: వరంగల్ 1988 అక్టోబరు 11, 12, 13 సంఖ్య 60
10. మచిలీపట్నం: కృష్ణ1988అక్టోబరు15, 16, 17, సంఖ్య 125
11. నంబూరు: గుంటూరు, 1988 అక్టోబరు 15 16, 17,సంఖ్య60
12. కాల్వబుగ్గ:కర్నూలు,కడప,అనంతపురం,1988 అక్టోబరు 23, 24, 25, సంఖ్య 60.
13. నిజాంబాద్:నిజాంబాద్అదిలాబాద్కరీంనగర్1989 జనవరి 9, 10, 11, సంఖ్య 123 .

ఈ విధంగా వేసవి దసరా, సంక్రాంతి, సెలవులలో మూడు విడతలుగా 1500 మందికి శిక్షణ యివ్వగలిగాం. కార్యకర్తలు ఎంతో ఉత్సాహపడ్డారు. ఉద్యమానికి ఎంతో ఉపకరిస్తుందని చెప్పారు. కాని కొన్ని జిల్లాలో ఉద్యమస్థాయిని బట్టి హాజరులేదు. హైదరాబాదు మెదక్ జిల్లాలనుండి అసలు ఎక్కడికి రాలేదు. కడప,రంగారెడ్డి జిల్లాలో అతి తక్కువ హాజరు అయ్యారు.

## రాయబారములు

1988 సెప్టెంబరు 1,2,తేదీలలో పాఠశాల విద్యా డైరక్టరు యల్.యఫ్.డైరక్టరు వెల్ఫేరు డైరక్టరులను కలిపి గ్రాంటు సీనియారిటీ లిస్టులు లీవురూల్సు, ఏజన్సీలలో పండిట్సు మరియు ప్రమోషను పొందినవారి జీతాల గురించి చర్చించాము.

1988 అక్టోబరు 3,4,10,11,26,27,తేదీలలో విద్యాశాఖ కార్యదర్శి పాఠశాల విద్యాడైరక్టరుగారు పరీక్షలకమీషనుగార్లను కలిసి హిందీ పండితుల శిక్షణ ఎయిడెడ్ మున్సిపల్ ఏజన్సీల గ్రాంట్సు 52,203 జి ఒ.ప్రమోషను వారి జీతాలు, కొందరి బ్రేక్పిరియడ్ జీతాలు రాజమండ్రి,లేడికాటన్ స్కూలు విశ్వతేజ సమస్య చర్చించాము.

1988 నవంబరు 23,24 తేదీలలో పాఠశాల విద్యాడైరక్టరు ఆర్థిక శాఖ కార్యదర్శి ట్రైబల్ వెల్ఫేర్ డైరక్టరు పరీక్షల కమీషనరు యల్.యఫ్. డైరక్టరు గార్లను కలిసి ఎయిడెడ్ వారి నూతన జీతాలు హిందీపండితుల ట్రయినింగు గ్రూపు ఇన్సూరెన్సు సమస్యలు రెసిడెన్షియల్ పాఠశాలలవారికి వి ఆర్.సి.తూ॥గో॥ జిల్లాలో స్కూటుబులటీ సర్టిఫికెట్లు ప॥గో॥ జిల్లాలో ఏజన్సీసమస్యలు ఫిక్సేషన్మెంట్ అగ్రికల్చర్సిలబస్ మొదలగు విషయములు చర్చించాము.

1989 జనవరి 11,12,తేదీలలో పాఠశాల విద్యాడైరక్టరు విద్యాశాఖ కార్యదర్శి పరీక్షల కమీషనరు గార్లను కలిసి కృష్ణా తదితరజిల్లాలో తగులబడిన ఎస్ ఆర్.సి.ఎ.టి.సర్టిఫికెట్స్ పై చర్చ జరిపేము.

1989 ఫిబ్రవరి 6,7, తేదీల్లో పాఠశాలవిద్యాడైరక్టరు విద్యాశాఖకార్యదర్శిపరీక్షల కమీషనర్గార్లను కలసి ఎయిడెడ్ గ్రాంట్సు, శ్రీరాయన్న శ్రీవీరయ్య గార్ల సమస్య 10-15-22 స్కేలు శ్రీశైలం ప్రాజెక్టు ఉపాధ్యాయుల సమస్య కేటగిరి-3 పరీక్షలు పుట్టిన తేదీ మార్పు మొ॥ విషయములపై చర్చించాము.

1989 మార్చి 15 న వివిధ అధికారులను కలసి చర్చలు జరిపాము. 52,203 జి.ఒ.ప్రకారం నియమింపబడిన వారి గ్రాంటు,

హైదరాబాదు సిటీ ఇతర చోట్ల ఎయిడెడ్ ఫిక్సేషనులో జాప్యం గురించి శిక్షణలో వున్న స్పెషల్ టీచర్సు పండితుల గురించి చర్చించాము.

1989 ఏప్రిల్4న ప్రభుత్వ అధికార్లను కలసి వివిధ సమస్యలపై చర్చలు జరిపాము. ఎయిడెడ్‌కు అడ్మిట్ అయిన అన్ ఎయిడెడ్ పోస్టులు గురించి ఎయిడెడ్ పి.ఆర్.సి.బకాయిల గురించి 10-15-22 స్కేళ్ళ గురించి స్పెషల్ పండిట్,పి.ఇ.టి.లు ఇన్‌సర్వీసు బి.ఇ.డి. ల గురించి, చర్చించాము.

1989 ఏప్రిల్ 25,26,తేదీలలో పంచాయితీరాజ్ శాఖామంత్రి విద్యామంత్రి పాఠశాల విద్యాడైరక్టరు, పరీక్షల కమీషనర్ లను కలసి 1987, లో బదిలీ అయినవారిని తిరిగి తీసుకువచ్చి గురించి వాయిదాలు పడుతూ వస్తూవున్న ఎయిడెడ్ పి.ఆర్.సి.బకాయిలు గురించి 10-15-22 స్కేళ్ళు, స్పెషల్ పండితుల, పి.ఇ టి. ల ప్రమోషన్ గురించి, 52,203 జి ఓ. ప్రకారం నియమించిన వారి కంటిన్యూ ఉత్తర్వుల గురించి, ప్రొవిన్షలైజేషన్ ప్రమోషనుకు ఉత్తర్వుల గురించి, వాకాడు విద్యాసంస్థలుపాధ్యాయులు గ్రాంటు బదిలీగురించి గత పరీక్షల్లో ఫెయిలయిన బాల్వాడి టీచర్లకు తిరిగి పరీక్షల గురించి, పి.ఎ.టి. సర్టిఫికెట్సు లో తేదీలు లేనివాటిని సరిచేయుట, గురించి, పి.ఎ.టి. సర్టిఫికెట్సు రానివారికి పంపుటగురించి సిటింగ్ స్క్వాడ్ డి. ఎ.ల గురించి చర్చించాము.

ఈ అన్ని సందర్భాలలోను అధికారులు వీలయినవి వెంటనే చేసిరి. మిగిలినవి పరిశీలించి చేయగలమని హామీఇచ్చిరి. చాల సమస్యలు పరిష్కారమైనవి.

ఇక హైద్రాబాదు యు.టి.యఫ్. కార్యాలయమునుండి నిత్యం అనేక సమస్యలపై రాయబారములు జరుపుట జరిగింది. అక్కడకు పనిపై వచ్చినవారి సమస్యలు తగురీతి పరిష్కరించి పంపుట జరిగింది. మిగిలినవి పరిష్కారమునకు కృషిచేయుట జరుగుతున్నది.

విజయవాడ ఆఫీసులో ఉపాధ్యాయులనుండి వచ్చు సమస్యలు వెంట వెంటనే కరస్పాండెన్సు చేస్తూ, రాష్ట్ర జిల్లా అధికారులకు ప్రాతినిధ్యములు జరిపాము.

## జిల్లాలలో జరిగిన ఉద్యమాలు కార్యకలాపాలు

వివిధ జిల్లాలలో ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారానికి పోరాట కార్యక్రమములు చేపట్టి విజయాలు సాధించారు. అవినీతి అధికారుల ఆటలు కట్టించారు. ఖమ్మం డి. ఒ. ఆఫీసుముందు రామచంద్రాపురం హైస్కూలు విషయమై ధర్నాలు నిర్వహించారు. ఖమ్మం జిల్లాపరిషత్ ఆఫీసులో సమస్యల పరిష్కారంగురించి లెటర్ క్యాంపెయిన్ నిర్వహించారు.

తూర్పుగోదావరి జిల్లాలో జిల్లాపరిషత్ ఆఫీసుముందు అక్రమబదిలీలు సరిచేయుట గురించి స్పెషల్ టీచర్ల ప్రమోషను గురించి రిలే నిరాహారదీక్షలు చేశారు. ఏజన్సీ,ఏరియా సమస్యలగురించి ప్రాజెక్టుల ఆఫీసుముందు ధర్నాసాగించారు.

గుంటూరుజిల్లాలో ఎయిడెడ్ పి. ఆర్. సి . గురించి యల్. యఫ్ ఆఫీసుముందు ప్రదర్శన, డి.ఇ.ఓ. ఆఫీసువద్ద 10-7 తరగతుల స్పాట్‌వాల్యుయేషన్ అపాయింటుమెంట్సు గురించి ఆందోళన జిల్లాపరిషత్ ఆఫీసుముందుకూడా ప్రదర్శన జరిపారు.

ప్రకాశంజిల్లా జిల్లాపరిషత్ , డి ఇ.ఓ. యల్ యఫ్. ఆఫీసుముందు అక్రమ వసూళ్ళ కు వ్యతిరేకంగా పోరాటకార్యక్రమం చేపట్టారు.

నెల్లూరుజిల్లాలో ఎయిడెడ్ టీచర్స నూతన జీతాల ఫిక్షేషను సందర్భం గాను, వాకాడు ఎయిడెడ్ ఉపాధ్యాయుల బడ్జెట్ బదిలీ సందర్భంగాను రిలేనిరాహార దీక్షలు చేశారు. రెండు బకాయిల డి.ఎ చెల్లింపు గురించి యల్. యఫ్ ఆఫీసుకు ప్రదర్శన నిర్వహించడం.

మహబూబ్‌నగర్ జిల్లాలో జిల్లా కలెక్టరు కార్యాలయం ముందు, టిటిసి ప్రిన్సిపాల్ నిరంకుశ వైఖరికి నిరసనగా ప్రదర్శన జరిపారు.

అనంతపురం డి ఇ.ఓ. అక్రమాలపై జిల్లా పరిషత్ అక్రమ బదిలీలపై పోరాట కార్యక్రమం చేపట్టారు.

నిజాంబాదులో సీనియారిటీ పాటించకుండా జిల్లాపరిషత్‌లో జరిగిన ప్రధానోపాధ్యాయ నియమకం గురించి పోరాటం జరిపారు

పశ్చిమ గోదావరి జిల్లా ఏజన్సీ ప్రాంతంలో ఉపాధ్యాయుల సమస్యల పరిష్కరం గురించి నోటీసు యిచ్చి నల్లబేడ్జీలు ధరించి ధర్నాలు జయప్రదంగా జరిపారు. ఉంగుటూరు మండలంలో జరిగిన అక్రమ బదిలీలపై ధర్నా జరిపారు.

హైద్రాబాదులో నూతన వేతనాల నిర్ణయం సందర్భంగా డి ఇ ఓ ఆఫీసుముందు ధర్నా జరిపారు.

కృష్ణాజిల్లాలో జిల్లాపరిషత్, సెలక్షన్‌లోను గుమస్తాల అక్రమ వ్యాపారం పైనను కరపత్రం వేసి ఎండగట్టారు అనేక జిల్లాలలో ప్రత్యక్ష చర్యకు నోటీసులు యిచ్చి, మానేజిమెంటు చర్చలకు పిలవడంతో సమస్యలు పరిష్కరించుకొని పోరాటాలు వాయిదావేశారు అలాగే చాల మండలాలలో ప్రత్యక్ష చర్యలు జరిగాయి. అనేక విజయాలు చేపట్టారు.

## ఐక్య ఉపాధ్యాయ ప్రచురణలు

ఐక్య ఉపాధ్యాయ ప్రచురణలు ఈ సంవత్సరం క్రొత్తగా వ్యాయామదర్శిని తీసుకవచ్చాం అధ్యాపకదర్శిని 1,4 కూడా పూర్తి అయినవి. 2,3 కూడాత్వరలో తెస్తున్నాము విద్యా చట్టం కూడా తిరిగి తేవలసివుంది. 10వ భాగం పనిమొదలు పెట్టవలసివుంది.

ఈ మూడు సంవత్సరాలుగా వరుసగా 15,000, 19,000, 20,000 ల చొప్పున డైరీలు వేశాము, అవన్నీ 1,2 రోజులలో అయిపోయినయ్. 25 వేలు వేసినా వెళ్ళే స్థితి. కాని సకాలంలో ఆర్డర్లు రానిచో మనం రిస్కు తీసుకోలేం

ప్రచురణల విభాగం పరంగానే బ్యాగ్సు, పర్సులు, ఫైల్సు వేయించి ఉపాధ్యాయులను అందచేశాం. అధ్యాపకదర్శిని 1,2,3 మూడుసార్లు 4,5 రెండు సార్లు వేయించవలసి వచ్చింది ఆ విధంగా ఉపాధ్యాయులు ప్రచురణల విభాగాన్ని ఆదరించి, ప్రోత్సహించారు.

## కోర్టు చర్యలు – మన కృషి

ప్రభుత్వంతోను, అధికారులతోను రాయబారాలు చర్చలు విఫలమయిన తర్వాత, అనివార్యంగా కొన్ని సందర్భాలలో కోర్టులకు వెళ్ళడం తప్పడంలేదు.

(1) స్కేలు గురించి : టి. ఐడి., భాషాపండితులు స్కేలు గురించి హైకోర్టులోను, ట్రిబ్యునల్‌లోను కేసులు వేసి తీర్పులు పొందాము. చాలావాటిని ప్రభుత్వం అమలు జరుపలేదు. వాటిపై ఒకరు సుప్రీంకోర్టుకు వెళ్ళగా కొట్టివేయడం జరిగింది.

(2) నిల్వ శలవు గురించి : 1985 మార్చికి ముందు శలవు అమ్ముకొను హక్కు గురించి వేసిన రిట్టు యింతవరకు తీర్పురాలేదు.

(3) కేటగిరి-3 ఉపాధ్యాయుల టెస్టు మినహాయింపు గురించి, ఐదిలిలపై వేసిన కొన్నిటిపై తీర్పులు వచ్చాయి.

## కేటగిరి 2,3 శిక్షణా తరగతులు

కేటగిరి 3 ఉపాధ్యాయుల పరీక్షలకు ప్రతి సందర్భంలోను శిక్షణా తరగతులు జరిగాయి. 75 వేల మందికిపైగా యు. టి. యఫ్. నిర్వహించిన క్లాసులవల్ల ప్రయోజనం పొందారు. మిగతా సంఘాలవారు పరీక్షలు వుండవని ప్రచారం చేసి నష్టపోయారు. కేటగిరి 2 వారికి కూడా గుంటూరు,నల్గొండ మరికొన్ని చోట్ల క్లాసులు జరిపారు.

## చెన్నుపాటి వర్ధంతి సభలు

అమరజీవి చెన్నుపాటి 20వ వర్ధంతి సభలు రాష్ట్ర వ్యాప్తంగా 1988 డిశంబరు 9 నుండి 23 వరకు పక్షం రోజులు వర్ధంతి సభలు జరిగాయి.

ఈ సారి ప్రతి మండల, జిల్లా, పట్టణ కేంద్రాలలో వర్ధంతి సభలు జరగడం ప్రత్యేకంగా పేర్కొనదగినది అమరజీవి చెన్నుపాటి ఆశయాలకు మరొకసారి అంకితం కావడం జరిగింది.

## అకడమిక్ సెల్ విషయాలు

యు.టి.యఫ్. అకడమిక్ సెల్ ఏర్పాటు చేసి, గత మహాసభలలో నూతన విద్యావిధానంపై ఒక బులెటిన్ తీసుకవచ్చాం. తరువాత అకడమిక్ సెల్‌ను రెగ్యులర్‌గా పనిచేయించాలనే ఉద్దేశ్యంతో శ్రీ టి.జి. సంజీవరావును డైరెక్టర్‌గా, శ్రీడి. రామిరెడ్డిని కార్యదర్శిగా ఏర్పాటు చేయటం జరిగింది.

తర్వాత అక్టోబరు3,4 తేదీల్లో సైన్సు క్లాసులు జరపాలని కార్యక్రమం చేపట్టాము. అది వాయిదా పడింది.

చివరికి సుందరయ్య విజ్ఞానకేంద్రంలో 9-4-89 నుండి 15-4-89 వరకు 70 మంది ఉపాధ్యాయులకు సైన్సుక్లాసులు నిర్వహించబడ్డాయి.

శిక్షణా శిబిరాన్ని విద్యామంత్రి శ్రీమతి యెర్నేని సీతాదేవి ప్రారంభించారు మాజీ విద్యామంత్రి శ్రీ ఇంద్రారెడ్డిగారు సందేశమిచ్చిరి. డా॥ కె. ఆర్. చౌదరి, సి. నర్సిరెడ్డి, శ్రీ సుశీల్‌జోషి, శ్రీ మస్తాన్ రెడ్డి, శ్రీ సంజీవరావుగారలు సందేశములు యిచ్చిరి.

శ్రీ వి. లక్ష్మణరెడ్డి వక్తలను వేదికమీదికి ఆహ్వానించగా, శ్రీ డి. రామిరెడ్డిగారు వందన సమర్పణ చేసిరి.

కేరళలో జరిగిన సైన్సు క్లాసులకు, భోపాల్‌లో ఏకలవ్యసంస్థవారు నిర్వహించిన సైన్సు నెట్‌వర్కు క్యాంపుకు మన సంఘ పక్షాన కొందరిని పంపడం జరిగింది.

## యు. టి. యఫ్. భవనాలు

విజయవాడలో 9-12-78 న సంఘ కార్యాలయానికి ఒక భవనం కొన్నాము. తర్వాత దానిని పడగొట్టి 1987లో ఆఫీసు నిర్వహణకు అన్ని ఏర్పాట్లతో, మీటింగు హాలుతోసహా నిర్మాణం చేశాము.

దానిని వెనుక ప్రెస్ పెట్టు ఉద్దేశ్యంతో 7-5-81న ఒక హాలు వేశాం అది ప్రస్తుత న్యూస్ ప్రింటు గోడౌన్ గావాడుతున్నాము.

హైదాబాదులో ఇందిరా పార్కువద్ద 10-9-83 న సంఘ కార్యక్రమాల నిర్వహణకు ఒక భవనం కొని ప్రవేశించాము. 1985 లో దానిపైన ఒకహాలు వేశాము.

ఖమ్మంలో విశాలమైన స్థలంలో పాత బిల్డింగులో ఆఫీసు నడుస్తున్నది. హాలువేయాలి. కాకినాడలో స్థలం వున్నది. పాత బిల్డింగులో హాలు వేయాలి. పశ్చిమ గోదావరి ఏలూరు హాలు నిర్మాణంలో వుంది. గుంటూరులో స్థలం ఉంది. తాత్కాలికంగా షెడ్ వేసి ఆఫీసు పనులు చూస్తున్నారు. హాలు నిర్మాణం కావాలి.

ఒంగోలులో పాతబిల్డింగుపై క్రొత్తగా హాలు వేస్తున్నారు. నెల్లూరులో సంఘానికి చిన్న బిల్డింగు మాత్రమే వుంది. మహబూబ్‌నగర్‌లో కూడా చిన్న బిల్డింగులో ఆఫీసు వుంది. హాలు వేయాలి కృష్ణాజిల్లా కార్యాలయం విజయవాడ భవనంలోనే వున్నది. హైదాబాదు జిల్లా ఆఫీసు హైదాబాదు బిల్డింగులోవుంది. అమలాపురం, మధిరలలో కూడా మండల శాఖలకు స్వంత భవనాలు వున్నాయి.

చిత్తూరు, కరీంనగర్, జిల్లాశాఖలు స్థలాలు కొన్నాయి భవననిర్మాణాలు చేయవలసివున్నది. ఇప్పటికి 12 జిల్లాలలో భవనాలు గాని, స్థలాలు గానివున్నాయి.

నల్గొండ, వరంగలు జిల్లాలు భవన ఏర్పాట్లలో వున్నారు. విశాఖ తగరపు వలస , నెల్లూరు కోట, వరంగల్ ఘనపురంలోను మండల భవనాలకు ప్రతిపాదనలు వున్నాయి.

అనంతపురం, నల్గొండ జిల్లాలు అద్దె భవనాలలో ఆఫీసులు తెరచి పనిచేస్తున్నారు.

## యు.టి.యఫ్. వార్తలు – సర్క్యులర్లు

కార్యకర్తలతో నిత్యసంబంధాలు కల్గిన సంఘాలే సజీవంగా పనిచేయగల్గుతాయి. వార్తలు ఎప్పటికప్పుడు తెలుస్తూవుండాలి. సంఘనిర్ణయాలు, ప్రభుత్వంతో జరుగుతున్న చర్చలు,ఉద్యమ వివరాలు అందజేస్తూవుండాలి. అప్పుడు మాత్రమే పటిష్టమైన ఉద్యమనిర్మాణం సాధ్యం.

ఆపని "యు.టి.యఫ్. వార్తలు" చేస్తున్నది. ప్రతినెల పట్టణ, మండల ఆఫీసుబేరర్లవరకు 4 వేలు పంపిస్తున్నాం. దానిపై ఫెప్టో నాయకులుకూడా విరుచుకుపడ్డారంటే అదెంత పదునైన ఆయుధంగా పనిచేస్తుందో వేరే చెప్పనక్కరలేదు.

ఈ నివేదిక కాలంలో గత కౌన్సిలునుండి 10 నెలలు రెగ్యులరుగా యు.టి.యఫ్. వార్తలు పంపించాం. కార్యకర్తలు దాని నిర్వహణపట్ల ఆనందాన్ని వ్యక్తపరిచారు.

మధ్యకాలంలో తక్షణ కర్తవ్యాలగురించి సర్క్యులర్లు అందజేయడం జరిగింది. కరపత్రములు కూడా కొన్ని వేశాము.

సర్క్యులర్ నెం.4/88 తేది 19-9-88 ఉద్యమ క్లాసులు.
ముఖ్యమంత్రికి సమస్యల పత్రం 1-10-88 13 కోర్కెలు
సర్క్యులరు నె. 5/88 తేది 10-11-88 క్యాంపెయిన్లు
కరపత్రం తేది 3-12-88 చెన్నుపాటి వర్ధంతి
సర్క్యులరు నెం. 1/89 తేది 2-1-89 కార్యవర్గనిర్ణయాలు
కరపత్రం తేది 20-2-89 నాల్గుసంఘాల పోరాటం
సర్క్యులరు నెం. 2/89 తేది 24-2-89 నాల్గుసంఘాల పోరాటం
సర్క్యులరు నెం. 3/89 తేది 9-3-89 మహాసభల నిర్ణయం
కరపత్రం తేది 1-5-89 ఫెప్టో కరపత్రానికి జవాబు
సర్క్యులరు నెం. 4/89 తేది 27-5-89 మహాసభల ఏర్పాట్లు

## సంఘ ఫంక్షనింగు

సంఘ సమావేశాలు ప్రతినెల రెగ్యులరుగా జరుగుతున్నాయి. నిర్ణయాలు తీసుకొని పనిచేస్తున్నాము. సమిష్టి ఆలోచనలు ప్రకారం కార్యక్రమాలు చేపడుతున్నాము. సంఘ పురోభివృద్ధికి పనిచేయడం జరుగుచున్నది.

| | | |
|---|---|---|
| 1988 ఆగష్టు13,14 | వార్షికజనరల్ కౌన్సిలు | విజయవాడ |
| 1988 సెప్టెంబరు 18 | సబ్‌కమిటీ | విజయవాడు |
| 1988 అక్టోబరు 9 | కార్యవర్గం | హైద్రాబాదు |
| 1988 నవంబరు 8 | సబ్‌కమిటీ | విజయవాడ |
| 1988 నవంబరు 22 | సబ్‌కమిటీ | హైద్రాబాదు |
| 1988 డిశంబరు 18 | కార్యవర్గం | విజయవాడు |
| 1989 జనవరి 11 | సబ్‌కమిటీ | హైద్రాబాదు |
| 1989 ఫిబ్రవరి 5 | కార్యవర్గం | హైద్రాబాదు |
| 1989 మార్చి 3,4, | జనరల్ కౌన్సిలు | హైద్రాబాదు |
| 1989 ఏప్రిలు 14 | సబ్ కమిటీ | విజయవాడ |
| 1989 మే 13 | సబ్ కమిటీ | విజయవాడ |

ఈ నివేదిక కాలంలో 2 కౌన్సిలు, 3 కార్యవర్గాలు, 6 సబ్ కమిటీ సమావేశాలు జరిగాయి.

## సంఘ నిర్మాణ విషయాలు

యు.టి.యఫ్ రాష్ట్రంలో అన్ని ఉపాధ్యాయ సంఘాల కంటె పెద్దది. మన ప్రచురణల విభాగం కూడా అంతే. పత్రికలోను మనదానిలో సగం కూడా ఎవరి పత్రికా లేదు. మండలాల నుండి జిల్లాల వరకు నిర్మాణంలోనూమనదే పై చేయి. నిరంకుశ అధికారులను వ్యతిరేకిస్తూ, అవినీతికి వ్యతిరేకంగా నిలబడటం లోను మనమే ముందున్నాము.

అది చాలదు. ఇంకా పదును తేలాలి. నూతన వేతనాల నిర్ణయం సందర్భంలోను, కొన్ని ఆర్థిక రాయితీలు పొందే సందర్భంలోను వాలున పడి కొట్టుకు పోవడంగాక, అవినీతికి
వ్యతిరేకంగా నిలిచి పోరాడాలి.

శాఖల రిపోర్టులు, కార్యక్రమాలు పరిశీలిస్తుంటే పట్టణ, మండల శాఖల సమావేశాలు రెగ్యులర్‌గా జరుగుటలేదు. జిల్లా శాఖల నుండి తగినన్ని సర్క్యులర్లు పోవడం లేదు ఆడిటింగ్ క్రమబద్ధంగా లేదు. అన్నిచోట్ల బ్యాంకు అక్కౌంట్లు తెరవలేదు. ఈ లోపాలు వెంటనే సరిచేసుకోవాలి.

రాష్ట్రంలో 5నుండి 7 వేలవరకు సభ్యత్వం వున్న జిల్లాలు 5, 1 నుండి 3 వేల వరకు 10 జిల్లాలు వున్నాయి. చివరి రెండు గ్రూపులు యింకా పెరగవలసివున్నది.

మనం 56 వేలకు కోటా తీసుకున్నాం 53 వేలు అయింది. మరికాస్త కదిలివుంటే 60 వేలు అయివుండేది. మన సంఘమంటే అభిమానించి, మనసంఘం సరైన మార్గంలో నడుస్తువదనే వారు బయట మరో 50 వేల మంది వున్నారు. వారందరినీ మన సంఘంలోనికి సమీకరించవలసి వున్నది.

## మహాసభలు

ఈ సంవత్సరం అన్ని జిల్లాల మహాసభలు జరిపి రాష్ట్ర మహాసభ వచ్చే జనవరిలో జరుపాలనుకుంటున్నాం అందుకు పిలుపుయిచ్చాం.

ప్రకాశం జిల్లా ఆ పిలుపు ముందుగా అందుకొని జయప్రదం చేసింది. 1989 ఫిబ్రవరి 18,19,20 తేదీలలో 3 1/2 వేలమందితో అపూర్వంగా జరిపింది. రాష్ట్ర మహాసభలుకూడా తానే జరుపగలనని ముందుకు వచ్చింది. సమయం తక్కువ కారణంగా మనం అంగీకరించలేదు.

తర్వాత మహబూబ్‌నగర్ ఏప్రిలు 2,3,4 తేదీలలో మహాసభలు జయప్రదంగా జరిగాయి. నెల్లూరు జిల్లా మహాసభకు పిలుపుయిచ్చి, రాష్ట్ర మహాసభలకు ఆహ్వానించింది. అందుచేత అంగీకరించి ఆ ఏర్పాట్లు చేశాము.

## ఆర్థిక విషయాలు

రాష్ట్ర సంఘాన్ని ప్రస్తుతానికి ఇబ్బందులు లేకుండానే నడపగల్గుతున్నాం. అయితే సమయానికి మరొక హెూల్‌టైమర్ హైదరాబాదులో వుండే విధంగా కావాలి. అకడమిక్ సెల్‌ను మరింత చురుకుగా నిర్వహించాలి. అప్పుడు జనరల్‌ఫండు సక్రమంగా వస్తే తప్ప, సంఘ నిర్వహణ సాధ్యంకాదు.

పత్రిక విషయంలో న్యూస్ ప్రింట్ తో సహా అన్నిరేట్లు పెరిగిన తర్వాత పాత రేటుతో నిర్వహించటం కష్టంగా వున్నది. జీవితచందాల అదనపు భారం భరించవలసి వున్నది.

ప్రచురణల విభాగం ఎప్పటికప్పుడు క్రొత్త పుస్తకాలు వేయటం వల్ల ఎప్పుడూ ఖర్చులు ఖాతాగానే వుంటుంది. అప్పుడప్పుడు ఆఫీసుకు ఎలక్ట్రానిక్ టైపు మిషన్ లాంటివి అమర్చేందుకు అవసరమవుతున్నది.

ప్రస్తుతం విజయవాడలో ఇద్దరు, హైదరాబాదులో ఒకరు హెూల్‌టైమర్లువున్నారు. విజయవాడలో ఐదుగురు, హైదరాబాదులో ఒకరు ఆఫీసు సిబ్బందితో పనిచేస్తున్నాము.

పత్రిక డబ్బు 8 లక్షలు, సంఘం డబ్బు 50 వేలు ఫిక్సెడ్ డిపాజిట్‌లో వుంది. సభ్యులిచ్చిన ప్రతిపైసా సాధ్యమైనంత పొదుపుగా వాడుతూ కార్యక్రమాలు నిర్వహించబడుతూ వున్నాము.

## మనకు వున్న వస్తువుల వివరాలు

మనకు వున్న భవనాలు యింతకుముందే తెలియజేశాం. ఫిక్సెడ్ డిపాజిట్లు, ఇతర అక్కౌంట్స్ యిచ్చాం. ఇక వస్తురూపంగా వున్నవి :

విజయవాడ ఆఫీసు : ఇనుప బీరువాలు 2, కర్ర బీరువాలు 6, ఇనుపర్యాక్‌లు 3, కర్ర డ్రాయర్లు 8, ఇనుప డ్రాయర్ 1, గ్లాస్ డ్రాయర్ 1, ఇనుప సొరుగు డ్రాయరు 1, ఎలక్ట్రానిక్ టైపుమిషన్ గోద్రెజ్ 1, మైక్ సెట్ 1,కర్రకుర్చీలు 4, ఇనుప కుర్చీలు చేతులున్నవి 4, ఇనుప కుర్చీలు 32, మీటింగ్ టేబుల్ 1, స్టూల్సు 6, ఇనుపమంచాలు 3, ఇనుప బకెట్స్ 7,జంపఖానాలు 5, టైపుమిషన్లు 2, డూప్లికేటింగ్ 1, రేడియో 1, టేప్ రికార్డర్ 1, గోడగడియారాలు 3, సీలింగ్ ఫ్యాన్‌లు 18, స్టాండ్ ఫ్యాన్ 1, ఫ్లాస్క్ 1, స్టీల్ నీళ్ళడ్రమ్ము 1, స్టీల్ గ్లాసులు 13, వంటసామానులు 20, ఇనుప నీళ్ళ డ్రమ్ము 1, జెట్ నీళ్ళ మోటారు 1, సైకిలు 1, గలవు.

హైదరాబాదు : ఇనప టేబుల్స్ 2, కర్ర టేబుల్స్ 2, ఇనుప కుర్చీలు (చేతులవి) 2, స్టీల్ కర్చీలు 15, ఇనుప మంచాలు 5, రేక్స్ 2, సీలింగ్ ఫ్యాన్‌లు 10, స్టాండ్ ఫ్యాన్ 1, జంపఖానాలు5, ఇనుపబీరువాలు 6, టైప్ మిషన్‌లు2, డూప్లికేటింగ్ 1, స్టూల్స్ 6 జెట్ నీళ్ళ మోటారు 1, స్టీల్ నీళ్ళ డ్రమ్ము 1, రేడియో 1, గ్యాస్ స్టవ్ 1, స్కూటర్ 1, సైకిల్ 1, వంటపాత్రలు 20, మైక్ సెట్ గలవు.

ఇవిగాక జిల్లా ఆఫీసులలో సామాన్లు యిక్కడ ఇవ్వబడలేదు

## తక్షణ కర్తవ్యాలు

మనం కేంద్రీకరించి పనిచేయవలసిన కర్తవ్యాలు కొన్ని వున్నాయి.

అకడమిక్ వియయాలలో మనం మరింత అంకితభావంతో పనిచేయాలి. కాన్వెంటుల, రెసిడెన్షియల్ స్కూల్ మోజునుండి జనాన్ని ఎడ్యుకేటు చేసుకోవాలి.

ట్రిబ్యునలు జడ్జిమెంట్లు అమలు జరుగుటలేదు, ఏజన్సీ ఏరియా సమస్యలు పరిష్కరించాలి. 10-15-22, స్పెషల్ పండిట్స్ పిఇటిలసమస్యలు వెలుగు చూడలేదు.

అవినీతి అన్ని రంగాలలో వ్యాపించివుంది. జాతిమూలిగనే పీల్చి వేస్తున్నది. దానిని రూపుమాపాలి. శాస్త్రీయ విద్యా విధానానికి పోరాడాలి. చటోపాధ్యాయ కమిటీ వేతనాలకై కదలాలి.

మహాశయులారా ! ఈ పదిమాసాలు సంఘ కార్యకలాపాల రిపోర్టు మీముందు వుంచాము. చేసిన దానితో తృప్తి వద్దు , చేయవలసిన దానికి సూచనలు యివ్వండి. మీ నిర్మాణాత్మకమైన సూచనలతో నివేదికను మరింత మెరుగులు దిద్దండి. భవిష్యత్ ఉద్యమానికి బాటలు వేయండి.

## ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ ఆర్థిక నివేదిక

1-8-1988 వ తేదీ నుండి 31-5-1989 వ తేదీ వరకు 10 నెలల కాలం

| జమలు | | ఖర్చులు | |
|---|---|---|---|
| బ్యాంక్ | 61,491-28 | ప్రింటింగ్ | 17,239-65 |
| ఆఫీసు | 64-53 | ప్రయాణం | 2,726-05 |
| సభ్యత్వం | 1,34,362-00 | భవన సదుపాయం ఆఫీసు, నిర్వహణ వగైరా | 16,464-63 |
| జనరల్ ఫండ్ | 3,056-00 | సమావేశాల నిర్వహణ | 10.068-25 |
| డెలిగేట్ ఫీజు | 1.065-00 | అలవెన్సులు,జీతములు | 28,046-00 |
| అద్దెలు | 4,489-00 | లైబ్రరీ | 821-50 |
| వడ్డీలు | 2,115- 60 | స్టేషనరీ | 3,127-35 |
| ఫోన్స్ | 237-00 | పోష్టల్ టెలిఫోన్ | 13,060-40 |
| అమ్మకాలు | 632-00 | ఫిక్సెడ్ డిపాజిట్లు | 50,000-00 |
| అడ్వాన్సులు | 1,999-85 | బ్యాంకు | 37,765-00 |
| | | ఆఫీసు | 193-43 |
| మొత్తం = | 209,512-26 | మొత్తం = | 2,09,512-26 |

1-1-1986 తేదీ నుండి 31-5-1989 వరకు

| | | | |
|---|---|---|---|
| గతనిల్వ(బ్యాంకు) | 10,987-83 | ప్రయాణము | 1,07,642-93 |
| ఆఫీసు | 336-37 | ఆఫీసు నిర్వహణలు | 63,023-94 |
| సభ్యత్వం | 4,62,376-50 | స్టేషనరీ | 14,986-77 |
| జనరల్ ఫండ్ | 27,636-25 | పోష్టల్ టెలిఫోన్ | 35,587-60 |
| అద్దెలు | 13,309-75 | ప్రింటింగ్ | 55,705-50 |
| వడ్డీలు | 5,250-90 | లైబ్రరీ | 6,424-50 |
| ఫోన్‌కాల్స్ | 544-00 | సమావేశాల నిర్వహణ | 10,068-25 |
| ఇతరములు | 13,284-60 | ఫ్యాన్లో ఇతరములు | 8,452-40 |
| | | అలవెన్సుజీతములు | 1,03,374-90 |
| | | అడ్వాన్సులు | 40,500-98 |
| | | ఫిక్సెడ్ డిపాజిట్ | 50.000-00 |
| | | బ్యాంకు | 37,765-00 |
| | | ఆఫీసు | 193-43 |
| మొత్తం = | 5,33,726-29 | మొత్తం = | 5,33,726-20 |

## మరో మలుపు

**–శ్రీ పాటిబండ్ల శ్రీమన్నారాయణ**
అద్దంకి, ప్రకాశ జిల్లా.



జననం . . . జనం . . . ప్రభంజనం
ఎటు జూచినా విజయ ధ్యానం
దివినుండి తారకలన్నీ ఏకమై
భువిపైకి దాడి చేసినట్టు
కడలి తరంగాలన్నీ కదలి
తీరాన్ని ముంచేసి నట్టు
ఒకటే నినాదాల జోరు
ఒకటే ప్రతిధ్వనుల హెూరు
చైతన్నానికి ప్రతి రూపం ఈ మహాసభ !
సమైక్యశక్తికి జయపతాక ఈ మహాసభ !!

## 'ఐక్య ఉపాధ్యాయ' షత్రిక ఆర్థిక నివేదిక

1-8-1988 తేదీ నుండి 31-5-1989 తేదీ వరకు

| జమలు | | ఖర్చులు | |
|---|---|---|---|
| గతనిల్వ (బ్యాంకు) | 41,415-96 | ప్రింటింగ్ | 61,553-50 |
| ఆఫీసు | 73-45 | పోష్టల్ | 30,407-00 |
| సంవత్సరచందాలు | 1,98,140-00 | ప్రయాణం | 5,933-80 |
| జీవిత చందాలు | 22,400-00 | ఆఫీసు నిర్వహణ | 4,374-60 |
| ఏజన్సీలు | 3,917-00 | స్టేషనరీ | 5,003-20 |
| ప్రకటనలు | 1,010-00 | లైబ్రరీ | 1792-70 |
| ఇతర అమ్మకాలు | 1040-01 | అలవెన్సులు,జీతములు | 30,669-00 |
| గత అడ్వాన్సులు | 63,771-00 | న్యూస్ ప్రింట్ | 1,31,043-50 |
| | | మిస్లేనియస్ | 225-00 |
| | | ఫిక్సెడ్ డిపాజిట్లు | 25,000-00 |
| | | బ్యాంకు | 35,716-02 |
| | | ఆఫీసు | 59-10 |
| మొత్తం = | 3,31,767-42 | మొత్తం = | 3,31,767-42 |

తేదీ 1-1-1986 నుండి 31-5-1989 వరకు

| | | | |
|---|---|---|---|
| గతనిల్వ (బ్యాంకు) | 35,894-71 | ప్రింటింగ్ | 5,20,945-96 |
| ఆఫీసు | 164-01 | న్యూస్ ప్రింట్ | 1,80,409-25 |
| సంవత్సరచందాలు | 6,48,600-00 | ప్రయాణం | 18,171-20 |
| జీవిత చందాలు | 1,63,000-00 | ఆఫీసు నిర్వహణ | 15,318-05 |
| ఏజన్సీలు | 28,034-90 | స్టేషనరీ | 17,332-10 |
| ప్రకటనలు | 14,005-00 | లైబ్రరీ | 7,409-00 |
| వడ్డీలు | 1,32,676-85 | పోష్టల్ | 91,947-79 |
| ఇతర అమ్మకాలు | 7,284-90 | అలవెన్సులు,జీతములు | 92,904-00 |
| గత అడ్వాన్సులజమ | 1,04,620-75 | బహుమతులు వగైరా | 4,068-20 |
| | | ఫిక్సెడ్ డిపాజిట్లు | 1,50,000-00 |
| | | బ్యాంకు | 35,716-02 |
| | | ఆఫీసు | 59-10 |
| మొత్తం = | 11,34,281-12 | మొత్తం = | 11,34,281-12 |

## సంఘ సభ్యత్వ వివరాలు

| నెం. జిల్లా | 1986 | 1987 | 1988 | 1989 |
|---|---|---|---|---|
| 1. శ్రీకాకుళం | 510 | 545 | 300 | 415 |
| 2. విజయనగరం | 510 | 550 | 557 | 510 |
| 3. విశాఖపట్నం | 550 | 750 | 750 | 1000 |
| 4. తూర్పుగోదావరి | 6000 | 7050 | 7000 | 7200 |
| 5. పశ్చిమగోదావరి | 4553 | 5000 | 5300 | 6000 |
| 6. కృష్ణా | 3000 | 3000 | 3200 | 3400 |
| 7. గుంటూరు | 4700 | 5043 | 5085 | 5600 |
| 8. ప్రకాశం | 4500 | 5000 | 5305 | 6234 |
| 9. నెల్లూరు | 4600 | 5000 | 5000 | 5600 |
| 10. చిత్తూరు | 1020 | 3500 | 2500 | 3013 |
| 11. కడప | 500 | 500 | 500 | 800 |
| 12. కర్నూలు | 920 | 750 | 1100 | 1300 |
| 13. అనంతపురం | 350 | 607 | 800 | 1000 |
| 14. ఖమ్మం | 2500 | 2500 | 2515 | 2742 |
| 15. వరంగల్ | 1193 | 1000 | 1450 | 1600 |
| 16. కరీంనగర్ | 1300 | 800 | 800 | 1150 |
| 17. అదిలాబాద్ | 1000 | 800 | 700 | 690 |
| 18. నల్గొండ | 1000 | 1000 | 1502 | 1635 |
| 19. మహబూబ్‌నగర్ | 1000 | 1000 | 1704 | 1800 |
| 20. నిజాంబాద్ | 184 | 152 | 432 | 600 |
| 21. మెదక్ | 112 | 100 | 100 | 100 |
| 22. రంగారెడ్డి | 150 | 100 | 80 | 100 |
| 23. హైదరాబాద్ | 512 | 400 | 500 | 507 |
| 24. ఇతరములు | 3 | 3 | 3 | 3 |
| మొత్తం | 40,467 | 45,000 | 47,183 | 53,005 |





## పురోగతి

—శ్రీ బి. మహేంద్ర
అద్దంకి , ప్రకాశంజిల్లా

పదిపేనేళ్ళ క్రితం ప్రాంతీయ తత్వాలు
పెట్రేగి పరవళ్ళు తొక్కు తుంటే
మలయమారుతంలా మన ముందు కొచ్చింది
ఆర్తరక్షణకై ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్
ఊబినుంచి ఉపాధ్యాయుల్ని వెలికితీసింది
కుబీ గాళ్ళ కుత్సిత బుద్ధుల్ని కూల గొట్టింది
అన్యాయాలకూ, అక్రమాలకూ ఎదురు నిల్చి
ఉపాధ్యాయ సంక్షేమానికి ఉజ్వల పోరాటాలు నడిపింది
అందుకే యింత ప్రగతి!
పీడితు లందరికీ పురోగతి !!



## అరుణాంజలి

**—శ్రీ యస్. చెంగల్ రాయులు**
యేర్పేడు, చిత్తూరు జిల్లా.

ఎంతమంది పుట్టలేదు
ఎంతమంది గిట్టలేదు
మృతజీవులు ఎందరో . .
అమరజీవులు కొందరే !

'చంద్రమౌళి నగర్' బంధం
ఐక్యోద్యమ సంబంధం
తెంపుకొన్నాతెగని బంధం
వేల గుండెల వెలుగు బంధం

ఎక్కడి యం. నగర్ జిల్లా
సింహపురిలో వెలసె మళ్ళా
హాజరయిన వారమెల్లా
హత్తుకొంటిమి హృదయమెల్లా

మానవుణ్ణి మహోన్నతుణ్ణి చేసేది ఆశయం
త్యాగధనుడిగా తీర్చిదిద్దేది ఆదర్శం
ఆ ఆశయాల ప్రతినిధి 'చంద్రమౌళి'
అందుకే ఘటించింది మహాసభ అరుణాంజలి !



# ఉద్యమ వాణిగా ఉపాధ్యాయుల్ని ఉత్తేజపరుస్తున్న 'ఐక్య ఉపాధ్యాయ' నివేదిక

—శ్రీ మైనేని వెంకటరత్నం
ప్రధానసంపాదకుడు

అధ్యక్షా !
నూతన కౌన్సిల్ సభ్యులారా!
ప్రత్యేకాహ్వానితులారా !
మహాసభల ప్రతినిధులారా !

అనేకానేక పోరాటానుభవాలతో రాటుదేలి, ఐక్య ఉద్యమజ్యోతిని అగ్రభాగాన నిల్పి, యుటియఫ్ ప్రత్యేకతను, ప్రతిష్ఠను ఇనుమడింపజేసి, రాష్ట్రం నలుమూలలనుండి తరలివచ్చిన మీ అందరికీ సంపాదవర్గం పక్షాన ఇవే మా ఉద్యమాభివందనాలు !

4 వ రాష్ట్ర మహాసభల సందర్భంగా 86 జనవరిలో విజయవాడలో అప్పటివరకున్న పత్రిక పరిస్థితిని సమీక్షించుకొన్నాం. మళ్ళీ 5 వ మహాసభల సందర్భంగా, నెల్లూరులో 89 జూన్ సమావేశంలో అనుకొన్నవీ, ప్రకటించినవీ ఎంతవరకు సాధించిందీ సమీక్షించుకొంటున్నాం.

గత 3 1/2 సం॥ర కాలంలో ఉద్యమవాణిగా మన పత్రిక పురోగతినీ, ప్రబల ప్రచార సాధనంగా దాని కృషినీ, విద్యా వైజ్ఞానిక పత్రికలలో దాని ప్రత్యేకతనూ, ఎదురైన ఆటుపోటుల్నీ, వాటి నధిగమించటానికి తీసుకొన్న చర్యల్నీ సంపాదక వర్గం పక్షాన సంగ్రహంగా మీ ముందుంచుతున్నాను.

మన ఉద్యమలక్ష్యాలనూ, కర్తవ్యాలనూ, కార్యక్రమాలను ఎప్పటికప్పుడు ప్రతిబింబించేవి మన సంపాదకీయాలూ–కార్టూన్లూ. ముందు విజయవాడ మహాసభల ప్రత్యేకసంచిక గురించి ప్రస్తావించి, ఆ తర్వాత మిగిలిన విషయాలు వివరిస్తాను.

ఆ మహాసభల్లో జరిపిన గోష్ఠులూ, నిర్వహించిన చర్చలూ, గురువాహినిగా పత్రికలన్నీ కొనియాడిన అపూర్వ మహాప్రదర్శనా, ఉత్తేజపరిచిన పాటలూ, వైజ్ఞానిక ప్రదర్శనలూ, వస్తుప్రదర్శనలూ – అన్నిటినీ సందర్భోచిత చిత్రాలతో, సూక్తులతో రంగురంగుల హరివిల్లులా ఆ ప్రత్యేక సంచిక పలువురి అభిమాన పాత్రయింది. మహాసభలు చూడలేనివారు, సభలకు రాలేనివారు ఆ సంచిక అందుకొని, ఆ సాంతం మళ్ళీ చదివి, తాము రాలేని లోటు ఆసంచిక తీర్చిందని, అద్దంలోలా అన్ని విషయాల్నీ కళ్ళముందు పెట్టిందని స్పందిస్తూ ... అభినందిస్తూ పలువురు లేఖలు వ్రాశారు. దానిని బట్టే ఆ సంచిక విశిష్టత మనకు తెలియగలదు. ఒక్క మాటలో చెప్పాలంటే అంతకుముందు జరిగిన మహాసభల ప్రత్యేకసంచికలకంటె, ఆ ప్రత్యేకసంచిక వన్నెచిన్నెల్లో, విషయవైవిధ్యంలో మరింత ప్రత్యేకత సంతరించుకొన్నది. పత్రికా ప్రచురణలో వస్తున్న మార్పులకూ, ముద్రణలో ఆధునిక సాంకేతిక పరిజ్ఞాన అభివృద్ధికి అదొక చిహ్నంగా మిగిలిపోయింది.

## సంపాదకీయాలూ – కార్టూన్లూ

సందర్భోచిత సంపాదకీయాలూ– వాటిని ప్రతిబింబించే కార్టూన్లూ మన పత్రిక ప్రత్యేకతలు. భాషలో, భావంలో, విషయస్పష్టీకరణలో మన సంపాదకీయాలు అచితూచి చైతన్యస్ఫోరకంగా రూపొందించాల్సి ఉంది. దిక్సూచిగా కర్తవ్యనిష్ఠ, కార్యదీక్ష పురికొల్పాల్సి వుంది. అదొక అసిధారా వ్రతం. దానికి ఈ మధ్యకాలంలో వచ్చిన ప్రతిసంపాదకీయం ఓ మచ్చుతునకే. అలాగే కార్టూన్లూ, ఆధునిక జర్నలిజానికి, సమస్యాతీవ్రతను పాఠకులలో ఇంజెక్ట్ చేయటానికి ఓ గుండెకుదుపుకు, మెదడుకు మేతగా అభివృద్ధి అయిన చిత్రకళా ప్రక్రియే కార్టూన్. ఆ ప్రక్రియను సమర్థవంతంగా ఉపయోగించుకొంటూ మన పత్రిక విద్యావైజ్ఞానిక పత్రికలలో అగ్రభాగాన ఉన్నది.

ఆ కార్టూన్లను గత రాష్ట్ర మహాసభల్లో, ఇటీవల జరిగిన జిల్లా మహాసభల్లోనూ, ఎన్‌లార్జ్‌చేసి ప్రతేక ప్రదర్శనగాకూడా తీర్చిదిద్దేరు. అధికారులు, అనధికారులూ, ఎందరో ఆ ప్రదర్శనను దర్శించి విద్యారంగంలోని సంక్షోభాన్ని, దయనీయ స్థితిని కళ్ళ ముందుకు తెచ్చుకొన్నారు. కొందరు గాభరా పడ్డారు. మరి కొందరు ఉలికిపాటుకూడా ప్రదర్శించారు. అంతగా ప్రభావితంచేశాయి మన కార్టూన్లు. అయితే వాటి అభివృద్ధికి రాష్ట్ర వ్యాప్తంగా ఉన్న కార్టూనిస్టులతోడ్పాటు మనకు కావాల్సి ఉంది. ఎక్కడికక్కడ కార్యకర్తలు వారిని ప్రోత్సహించి మరింత ఆధునికత పుటికి పుచ్చుకొనేట్లు చేయాలి. ఆతోడ్పాటు అందించే చిత్రకారులు గణనీయంగా ఉన్నట్లు జిల్లా మహాసభల సందర్భంలో రుజువయింది. కార్యకర్తలు ఎప్పటికప్పుడు ఎదురయ్యే సమస్యల్ని వారికి వివరించి, ఆ భావాలను కార్టూన్ల రూపంలో వెలికి వచ్చేటట్లు కృషి చేయాల్సి ఉంది.

మన కవర్ పేజీలు ఈ కాలంలో 'ఫొటోఫీచర్‌గా' రూపొందేయి. సంపాదక వర్గ, కార్యవర్గ పరిచయంలో అది ప్రారంభమై రాష్ట్రంలో ఏ పోరాటం జరిగినా, ఏ కార్యక్రమం నిర్వహించినా పంపిన ఫొటోలన్నిటినీ మన కవర్ పేజీలలో ప్రచురిస్తున్నాం. వివిధ జిల్లాల్లో జరిగిన ఉద్యమ

తరగతుల ఫోటోలన్నీ ఈ కాలంలో కవర్‌మీద వచ్చాయి. ఆఫ్‌సెట్ ముద్రణలో బ్లాక్‌లకు బదులు ఫిలిం ఉపయోగించుకోవటంతో కొంత ఖర్చు కూడా తగ్గింది. ప్రస్తుతమున్న ముద్రణా సదుపాయాలలో కలర్ ఫోటోలు సరిగా పడవు. బ్లాక్ అండ్ వైట్ ఫోటోలే స్పష్టంగా వస్తాయి. ఆ ఫోటోలు కూడా ఎంత స్పష్టంగా ఉంటే ప్రింటింగ్‌లో అంత బాగా వస్తాయి. కార్యకర్తలు ఆ విధమైన జాగ్రత్తలు తీసుకోవల్సిందిగా ఈ సందర్భంగా కోరుతున్నాను.

## ఇతర శీర్షికలు

పాఠకులు వివిధ అభిరుచుల కనుగుణంగా, ఉద్యమ ప్రతిబింబంగా, చైతన్య స్ఫూర్తినిచ్చే దాదాపు 25 శీర్షికలను ప్రతి సంచికలోనూ మనం నిర్వహిస్తున్నాం.

**1. ఉద్యమసంబంధమైనవి** : (1) సంపాదకీయం (2) వార్తాప్రపంచం (3) గుసగుసలు (4) మనలోమనం (5) సభలు-రాయబారాలు (6) పోరాటాలు-ఫలితాలు (7) ప్రాతినిధ్యాలు-పరిష్కారాలు (8) పాఠకుల అభిప్రాయాలు (9) సంపాదక లేఖలు (10) మాటలు-ఈటెలు.

**2. వృత్తి సంబంధమైనవి:** (1) ప్రశ్నోత్తరాలు (2) నియమ నిబంధనలు (3) సమస్యాతోరణం (4) బదిలీలు కావాలా? (5) ప్రభుత్వ ఉత్తర్వులు (6) పరీక్షా ఫలితాలు (7) డి.ఎ.టేబుల్స్.

**3. విద్యా సంబంధమైనవి:** (1) విద్యావిధానం - తీరుతెన్నులు (2) విదేశీ విద్యావిధానాలు (3) పాఠ్యగ్రంథాల స్వరూప స్వభావాలు.

**4. విజ్ఞాన సంబంధమైనవి** : (1) విజ్ఞానవీధి (2) మనం- మన ఆరోగ్యం (3) క్రీడారంగం.

**5. సాహిత్య సంబంధమైనవి:** (1) కథలు-గేయాలు (2) మీరు చదివారా ? (3) గ్రంథస్వీకారం.

## ప్రత్యేక విషయాలు

**మాటలు-ఈటెలు:** ఈ శీర్షికలో 'పండిత భారతి' పైత్యాన్ని బట్టబయలు చేశాం. సింగరాజు పత్రిక "ఉపాధ్యాయ" అవధులు దాటిన అవకాశ వాద విచ్ఛిన్న విధానాలను ఎండగట్టేము. వారి కారుకూతలకు వాతలుపెట్టేము. ఇటీవల ఫెప్టో నాయకుల విచ్ఛిన్నతలను, వారి కరపత్రాల దుష్ప్రచారాన్ని, జవాబు రూపంలో బట్టబయలు చేశాము.

**కథలు-గేయాలు:** శీర్షికకు తగినట్టు కథల్ని ప్రచురింపలేక పోతున్నాము. పేజీల పరిమితికూడా దానికి అడ్డువస్తున్నది. మినీ కథల్ని మాత్రం ప్రచురించాం. ఇరవై పంక్తులకు మించకుండా, వ్యంగ్య హాస్యం (సెటైరికల్ హ్యూమర్) ప్రధానంగా ఉండే సాంఘిక చైతన్యం పెంచే మినీ రచనల్ని ప్రోత్సహించాలి. సంగ్రహంగా, సమర్థవంతంగా, ఆధునికశిల్పం తొణికిసలాడే మినీ రచనలు వస్తే ఆ శీర్షికకు న్యాయంజరుగుతుంది

అయితే ఆ లోటును గేయాలు పుష్కలంగా తీరుస్తున్నాయి. ఈ కాలంలో 150 మందిదాకా క్రొత్త రచయితల్ని మనం పరిచయంచేశాము. 89 జనవరినుండి రచయితల ఫోటోలుకూడా ప్రచురిస్తున్నాం. ఆ పద్ధతిని ప్రోత్సహిస్తూ పలువురు పాఠకులు లేఖలు వ్రాశారు. ఇక రచయితల ఆనందం సరేసరి ! దాదాపు 500 గేయాలు పెండింగ్‌లో ఉన్నాయంటే ... రచయితల సహకారం ఎంత ఎక్కువగా ఉన్నదో మనకు అర్థమవుతోంది. అయితే వాటిల్లో విషయం .. శైలి.. శిల్పం వెతుక్కొని స్థాయి తగ్గకుండా ఎన్నుకోవాల్సి వస్తున్నది. ఏది ఏమైనా మనకు సహకరిస్తున్న వందలాది యువ రచయితల్ని ఆయా జిల్లా శాఖలు ప్రత్యేక సందర్భాలు కల్పించి సాహితీ సదస్సులద్వారా, రచనల పోటీలద్వారా స్వీయ కవితాగానాలద్వారా ప్రోత్సహించాల్సిఉంది. ఆ విధానాల్ని అమలుపరిచి ప్రకాశం, యం.నగర్, నెల్లూరు జిల్లాశాఖలు అద్భుత ఫలితాల్ని సాధించినయ్. రాష్ట్ర మహాసభల్లో కూడా వివిధ రచనా ప్రక్రియల్ని ప్రోత్సహించాలి. మట్టిలో మాణిక్యాల్ని వెలికితీయాలి. సృజనాత్మక కృషి మరింత పెల్లుబికే చర్యలు తీసుకోవాలి. తన రచన ప్రచురింపబడితే 'బిడ్డ పుట్టినంత ఆనందం అనుభవిస్తాడట' రచయిత. దాన్ని మనం ప్రత్యక్షంగా అనుభవంలో చూస్తున్నాం, ఆ విధంగా సామాజిక ప్రయోజనాల సాధనకు సాహిత్యం ఉపయోగించేట్టు ఈ శీర్షిక తోడ్పడుతున్నది. ప్రోత్సహిస్తున్నది.

అయితే ఈ గేయాల్లో చాలా భాగం పాడుకోటానికి వీలయినవిగాలేవు. దానితో ఉద్యమగేయాల కొరత కొరతగానే ఉంది. పతాకగేయాన్నయినా ప్రతి కార్యకర్త నేర్చుకొనాలి. ప్రతి సమావేశం పాటతో ప్రారంభం చేయటం ఒక సంప్రదాయంగాసాగాలి. పాడేవాళ్ళు లేకా .. పాట లభించకా కాదు ఈ సాంస్కృతిక దారిద్ర్యం. దానిమీద నిర్లక్ష్యం విచారింపదగిన విషయం. దీన్ని మనం సరిజేసుకోవాలి.

**ప్రశ్నోత్తరాలు** : దీన్ని నిర్వహించాలంటే అష్టావధానం కావాలి. నియమ నిబంధనల్లో స్పష్టమైన అవగాహనఉండాలి. పత్రిక స్థాయి తగ్గకుండా సంపాదకవర్గ సభ్యుడు శ్రీ కె.జోజయ్య దీన్ని సమర్థవంతంగా నిర్వహిస్తున్నారు.

**నియమ - నిబంధనలు :** ఈ శీర్షికను శ్రీ ఆర్. శ్రీహరిరావు ధారా వాహికంగా నిర్వహిస్తున్నారు. తెలుగు నుడికారం వచ్చేట్టు వాక్య నిర్మాణం ఉంటే బాగుంటుందని సూచిస్తూ కొందరు లేఖలు వ్రాశారు. ఆంగ్లంలో ఉన్న నియమ నిబంధనలు మాతృభాషలోకి సులభశైలిలో చిన్నచిన్న వాక్యాలలో తేవాలంటే తేలికయిన విషయం కాదు. అయినా శక్తియుక్తులా ఈ శీర్షిక నిర్వహింపబడుతూ, ఆదరాభిమానాల్ని పొందుతున్నది.

**మీరు చదివారా? :** మంచి పుస్తకాల్ని ఎన్నుకొనేందుకు, పఠనాభిలాష పెంపొందేందుకు ఈ శీర్షిక ఉపకరిస్తున్నది. దీన్ని అత్యంత సమర్థవంతంగా శ్రీ నాగటి నారాయణ నిర్వహిస్తున్నారు.

**విద్యావిధానం - తీరుతెన్నులు :** స్వదేశ, విదేశ విద్యావిధానాల్ని అనువాద వ్యాసాలేగాక, స్వీయ రచనల్నికూడా అత్యంత ప్రతిభావంతంగా అందిస్తూ శ్రీ కె.కేశవరెడ్డి తోడ్పడుతున్నారు. క్లిష్టమైన విషయాన్ని కూడా సులభశైలిలో సామాన్య ఉపాధ్యాయుడికి అందించే సామర్థ్యం వీరి ప్రతి వ్యాసం లోనూ మనకు ద్యోతకమవుతుంది.

# ఆంధ్ర ప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్

## 5వ రాష్ట్ర మహాసభలు

## నెల్లూరులో జయప్రదంగా

## జరిగినందుకు

## యు.టి.యఫ్. కార్యకర్తలందరకు

## శుభాకాంక్షలు!

డి. లింగా రావు B.Sc., LLB.

పి. సత్యనారాయణ M.A., LLB.

Advocates.

1-1-258/10/C,
బాటా కంపెనీ ఎదురుగా,
చిక్కడపల్లి, హైదరాబాద్ – 500 020.

# 'యువ రచయితల్ని ప్రోత్సాహించండి ... నవతేజం వెదజల్లండి

**విద్యావిధానం – తీరుతెన్నులు :** స్వదేశ, విదేశ విద్యావిధానాల్ని అనువాద వ్యాసాలేగాక, స్వీయ రచనల్నికూడా అత్యంత ప్రతిభావంతంగా అందిస్తూ శ్రీ క.కేశవరెడ్డి తోడ్పడుతున్నారు. క్లిష్టమైన విషయాన్ని కూడా సులభశైలిలో సామాన్య ఉపాధ్యాయుడికి అందించే సామర్థ్యం వీరి ప్రతి వ్యాసం లోనూ మనకు ద్యోతకమవుతుంది.

**మనం–మన ఆరోగ్యం :** ఈ శీర్షికను ఇదివరకు డా॥ యం. రామారావుగారు నిర్వహించేవారు. 88 ఆగస్టు నుండి డా॥ వి. బ్రహ్మారెడ్డిగారు దీన్ని తనదైన ప్రత్యేకశైలిలో, పాఠశాలల్లోని నిత్యానుభవాల్ని సమన్వయిస్తూ, ఆకర్షణీయంగా నిర్వహిస్తున్నారు. ఇవి ప్రయోజనకరంగా ఉన్నవని చాలామంది వ్రాస్తున్నారు.

**క్రీడారంగం :** ఈ శీర్షికను శ్రీ జి బాలశౌరి నిర్వహిస్తున్నారు వివిధ దేశాల క్రీడలు, వ్యాయామ పద్ధతులు, వరల్డ్ ఒలెంపిక్స్ వివరాలు ఈ శీర్షిక ద్వారా అందిస్తున్నారు

**ప్రభుత్వ ఉత్తర్వులు :** మన ఎలక్ట్రానిక్ టైప్ మిషన్ మీద టైప్ అయి ఈ సంవత్సర ప్రారంభం నుండి ఇవి అచ్చవుతున్నవి. దానిపై మీ అభిప్రాయాలు తెల్పండి.

## జన విజ్ఞాన వేదిక

ఈ శీర్షికకు ఈ కాలంలో అత్యంత ప్రాధాన్యత ఇవ్వబడింది. విజ్ఞానానికి చెందిన వివిధ వ్యాసాలు, కార్యక్రమాలు ఈ శీర్షిక క్రింద ప్రచురింపబడ్డాయి మన అకడమిక్ సెల్ ఇటీవల హైదరాబాద్‌లో నిర్వహించిన సైన్సువర్క్‌షాపు దీని అధ్యాయనే జరిగింది రకరకాల మోడల్సు, ప్రయోగాలు, నిజజీవనానికు తగినట్లు రూపొందించే కార్యక్రమాలన్నీ ఇంకా ప్రోత్సహించాల్సి వుంది. ఆ విధంగా మన అధ్యయనం, అధ్యాపనం, సామాజిక, స్పృహ లక్ష్యాలకు సార్థకత చేకూరుతుంది రాష్ట్రంలోగల అన్ని శాఖలు దీన్ని ఒక ఉద్యమంగా ప్రోత్సహించి తోడ్పడాలని కోరుతున్నాను

ఈ విధంగా ఎందరో ప్రతిభావంతులైన కార్యకర్తలు తమ తోడ్పాటు అందించటం ద్వారా మన పత్రిక సర్వాంగ పరిపుష్టి చేకూర్చుకొంటున్నది నిత్య నూతనంగా రూపుదిద్దుకొంటున్నది. వారందరికీ ఈ సందర్భాన అభినందనలు

## పత్రిక సర్క్యులేషన్

మన పత్రిక సర్క్యులేషన్ పెంచటానికి ప్రతి సంవత్సరం స్పెషల్, జనరల్ క్యాంపెయిన్లు నిర్వహిస్తున్నాం. అది క్రమబద్ధంగా సఫలం అవుతుందన టానికి స్టేటుమెంటు పరిశీలించండి

## జీవిత చందాలు

గత మహాసభల నాటికి 5 1/2 వేలుగా ఉన్న జీవిత చందాలు 1988 నవంబరుకి 6 వేలకు చేరుకొని ఆ స్కీము ఆపివేయబడింది.

ప్రథమంలో దాని రేటు రు. 116గా నిర్ణయించబడి ఆ తర్వాత క్రమంగా రు. 130, రు. 150, రు.200 కు పెంచబడింది. జీవిత చందాల సొమ్మంతా వచ్చింది వచ్చినట్లు ఫిక్సెడ్ డిపాజిట్‌లో వేసినా, వచ్చే వడ్డీ పత్రిక ఖర్చుకు సరిపోక పెద్ద భారంగా తయారయింది.

న్యూస్ ప్రింట్ ధరలు, ముద్రణా వ్యయం, పోస్టల్ ఖర్చులు ఇబ్బడి ముబ్బడిగా పెరగటం దానికి కారణం, జీవిత చందాలపై వచ్చే నష్టమంతా రెగ్యులర్ చందాలు భరించాల్సి వస్తున్నది. అందువల్ల 6 వేలతో ఆ స్కీము ఆపివేయబడింది. ప్రస్తుత ధరల స్థితి చూస్తే సంవత్సర చందాగా రు.20/-లు కూడా ఖర్చుకు సరిపోవటంలేదు. అందువల్ల చందారేటు తప్పనిసరిగా పెంచాల్సిన స్థితి ఏర్పడింది దీనిపై మీ అభిప్రాయం తెల్పండి

ఇక పోతే జీవితచందాల స్కీము రేటు పెంచి అయినా కొనసాగించవలసిందిగా దాదాపు అన్ని జిల్లాలనుండి ముఖ్యంగ మన కార్యకర్తలనుండి డిమాండ్ వస్తున్నది. అప్పటికి 40 మంది చనిపోగ వారిస్థానే 40 మందిని క్రొత్తగా చేర్చుకోవటం జరిగింది

ఈ స్కీము కొనసాగించాలంటే ఏమి చేయాలో మీ అభిప్రాయాలు తెల్పండి కార్యకర్తలు చేస్తున్న కొన్ని సూచనలు ఇలా ఉన్నవి.

1 జీవిత చందాకాలం 15 సం॥లుగా నిర్ణయించి ఆ కాలం పూర్తిగావటంతోటే పునరుద్ధరించటమో, ఖాళీలు పూర్తిచేయటమో చేయండి.

2 రు 200 లోపు చెల్లించినవారికి పరిస్థితి వివరించి, మిగతా పైకం పంపే చర్యలు తీసుకొనండి

3 పెరిగే ధరలకు సరిపడా రేటు పెంచి అయినా స్కీము కొనసాగించండి

సూచనల్లోని మంచి చెడుల్ని చర్చించి, అభిప్రాయాలు తెల్పవలసిందిగా కోరుతున్నాం

ఉదాహరణకు పత్రిక ఖర్చు ఎలా పెరుగుతుందో వివరిస్తాను

89 జనవరి సంచిక రెండు రంగుల్లో తెచ్చాం. దానికి వేయి రూపాయలు అదనంగా అయింది. మార్చి సంచిక 4 రంగుల్లో తెచ్చాం దాఫికి 4 వేలకు పైగా అదనంఖర్చు మీదపడింది అలాగే రంగుల్లో ప్రతి సంచిక రావాలని పలువురి కాంక్ష! అయితే ఖర్చో... తలకు మించిన బరువవుతున్నది. సొకులూ.. సింగారాలూ ఆకర్షణీయాలే. అలా సాగిస్తే సంవత్సర చందా రు 20/-లు సగం నెలలకు కూడా సరిపోయేట్టులేదు

విషయం మీ ముందుంచాను, సరియైన సూచనలు చేసి సహకరించండి

# 'కదిలితే కానిదేమీలేదు ... కావల్సింది కదలిక ... దళాలుగా కదలిక!'

## క్యాంపెయిన్ల అనుభవాలు

1 జిల్లా శాఖలు కోటాలిచ్చి, క్రమబద్ధ కృషి సాగించిన చోటల్లా, పత్రికా క్యాంపెయిన్ దిగ్విజయమయింది తాము కదలక, క్రిందిశాఖల్ని కదిలించని చోటల్లా వెనుక పట్టుబట్టింది

2. క్యాంపెయిన్ సాగించటం ప్రస్తుత పరిస్థితుల్లో అతిసులభం, మండలాలు ఏర్పడిన తర్వాత ఆ పరిధిలో వున్న అందరు టీచర్లను కలుసుకోవటం, అన్ని స్కూళ్ళను దర్శించటం వాహనాలమీద రెండు మూడురోజుల్లో పూర్తి చేయవచ్చు. సభ్యత్వ, పత్రికా క్యాంపెయిన్లను ఒకేసారి పూర్తిచేయవచ్చు. పత్రిక చందాదారుగా చేరమని ప్రతి టీచర్ని అడగాలి దళంగా వెళ్ళి అడిగితే ఎక్కువ ప్రయోజనం ఉంటుంది. తెలంగాణా జిల్లాల్లో ఇతర సంఘాల సభ్యులు కూడా పత్రిక చందాదార్లు కావటం విశేషం ఇది అన్నిచోట్ల జరగాలి.

3 వసూళ్ళు కూడా ఎయిటు వేయక, ఏ నెలలో చేర్పించిన చందాలు ఆ నెలలోనే పంపేట్టు చూసుకోవాలి ట్రెజరీలవద్ద, పెన్షనర్లలో చందాదార్ల అంగీకారం పొంది జీతాల పేయర్ల నుండి ఆ సొమ్ము పట్టుకోవచ్చు లేకపోతే చేర్పించటం ఒకసారి, వసూళ్ళు మరోసారి తిప్పట పెరగటం, వసూళ్ళు ఆలస్యం కావటం జరుగుతున్నది

4 దళంగా కదలాలంటే తగిన ప్లాను, ఫంక్షనింగు అవసరం. చాలా జిల్లాల్లో వ్యక్తులుగా తప్ప దళాలుగా కదలటం లేదు. అసలు ఫంక్షనింగు లేక పోవటమే దానికి మూలకారణం.

5 చాలా మండలాలనుండి వాళ్ళ సమావేశాల రిపోర్టులు రాకపోవటం, ఎన్నికలలో తప్ప కలవకపోవటం, ఆ కలిసేదికూడా నామమాత్రంగా ఉండటం మన బలహీనతలు.

6 పిలిచి సభ్యులమిస్తే పత్రికా సర్క్యులేషన్ అతితేలికగా 20 వేలకు చేరుకొంటుంది

7 కొన్నిజిల్లాల్లో జోనల్ సమావేశాలు దిగ్విజయమవుతున్నాయి గణనీయ సంఖ్యలో హాజరు ఉంటున్నది. అక్కడ పరిస్థితి సమీక్షించుకొని, బలహీనంగా ఉన్నచోట సహకారం అందిస్తే, ప్రతిజిల్లా అన్ని కోటాల్ని తప్పక అధిగమించ గల్గుతుంది.

8 ఈ సంస్థాగత బలహీనతలే క్యాంపెయిన్ల వైఫల్యాలకు ప్రధాన కారణాలు

9 పత్రిక మన ప్రజల ప్రచారాయుధం అందువల్ల ప్రతిస్కూలుకూ, కార్యకర్తకూ అది అందితీరాలి. ముఖ్యంగా ఇటీవలి ఫెడరేషన్ నాయకత్వం చేపట్టిన చర్యలూ, మన చొరవతో సాగిన చారిత్రాత్మక పోరాటాలూ, సాధించిన విజయాలూ నిర్మాణం లేనిచోట ఉపాధ్యాయుల్ని ఆలోచనలో పెడతాయి పెదధోరణుల్ని వ్యతిరేకించే చైతన్యం సమకూరుస్తాయి క్రమంగా మన ఉద్యమం వైపు మరల్చుతాయి. అది సాధించే ప్రధానాయుధం పత్రిక అందువల్ల అది మారుమూలలకు కూడా వెళ్ళితీరాలి

10 మన అకడమిక్ సెల్ ప్రోగ్రాము, అలాగే జన విజ్ఞాన వేదికా వ్యాప్తి మన సంఘసభ్యుల్ని కానివారినికూడా ఆకర్షిస్తున్నది. ప్రతి విద్యావేత్త దానికి హర్షిస్తున్నాడు, సహకరిస్తున్నాడు. సమీకరణలో వాల్గొంటున్నాడు ఉద్యమం బలహీనంగా ఉన్న జిల్లాల్లో పైకార్యక్రమాలు ఆదరణ పొందటం వేలాది విద్యార్థుల్ని, మేధావుల్ని, ఉపాధ్యాయుల్ని సమీకరించటం, కొత్త మిత్రులు లభించటం మన అనుభవాల్లో చూస్తున్నాం. అనుభవాలతో మన పత్రికా వ్యాప్తి మరింత విస్తృతంగావాలి. కావాల్సింది చొరవ.... కదలిక.... సమిష్టి కృషి దళాలుగా కదలటం !

## పత్రిక మిస్సింగు

మన పత్రిక పోస్టల్ తేదీలు ప్రతినెలా 13, 14, 15 తేదీలు ఆ తేదీల్లో అప్పటికి చందాదారులుగా ఉన్నవారందరికీ పత్రిక పోస్టు చేయబడుతున్నది. అప్పుడు పోస్టేజి 15 పైసలు. ఆ తర్వాత అయితే 50 పైసలు

బదిలీలవల్లనే, అడ్రస్ మార్పు వెంటనే తెల్పకపోవటం వల్లనే ప్రతినెలా 20 పత్రికలదాకా తిరిగి వస్తున్నవి. వాటిమీద 'లెఫ్ట్' అని, అడ్రస్ దారు తెలియదని పోస్టల్‌వారు రిమార్కు వ్రాసి తిప్పి పంపుతున్నారు. అందువల్ల అడ్రస్ మార్పు వెంటనే తెల్పితే ఈ మిస్సింగ్ తగ్గుతుంది. ఈ స్థితిలో కూడా పత్రిక అందలేదని వెంటనే వ్రాసినవారికి మళ్ళీ మళ్ళీ పత్రికలు పోస్టు చేస్తున్నాం. నెలల తరబడి ఆగి, పత్రిక అందటం లేదన్నవారికి నిల్వలులేక పంపలేక పోతున్నాం.

తిరిగి వచ్చినవాటిని భద్రపరచి, సమావేశాలు జరిగినపుడల్లా ఆయా జిల్లా బాధ్యులకు అప్పజెపుతున్నాం. కాని చాలా జిల్లాల బాధ్యులు ఆకట్టల్ని అలాగే ఉంచటంవల్ల, ఏ చర్యా తీసుకోకపోవటంవల్ల మళ్ళీ మళ్ళీ అదే తరహా స్థితి ఏర్పడుతున్నది.

ఏ మండలానికి ఎన్ని పత్రికలు వస్తున్నవో, ఎవరు చందాదారో కూడా, ఎపుడు రెన్యూవల్ చేయించాలో చాలా మండలాల్లో ఆవివరాలే ఉండటంలేదు చేర్పించిన చందాలు లిస్టుగా పంపితే నంబర్లువేసి ఆ లిస్టును తిప్పి పంపుతున్నాం. నంబరు తెలిస్తేనే అడ్రస్ మార్పుగాని, ఇతర చర్యగాని, తీసుకోవటం సాధ్యమవుతుంది

ఈ పద్ధతిని చక్కగా అమలుపరుస్తున్నది కరీంనగర్, నిజామాబాద్ జిల్లాలు. అలా రికార్డు ఫైల్ చేయటంవల్ల ఏటేటా క్యాంపెయిన్ కూడా సులభమవుతున్నది ఆ కార్యకర్తలు తమ పట్టణాలకు వచ్చే పత్రికలన్నిటినీ ఏజన్సీగా బండిల్‌గా తెప్పించుకొని డిస్ట్రిబ్యూట్ చేస్తున్నారు ఆ విధానం అన్ని పట్టణాల్లో ఆచరించదగిన పద్ధతి.

# 'నిర్విరామ కృషి ఫలితమే అన్ని క్యాంపెయిన్ల విజయం'

## ముఖ్య సూచనలు

1. చందాలు పంపేప్పుడు చిరునామాలు స్పష్టంగా వ్రాయాలి. పిన్‌కోడ్ తప్పక వేయాలి. పదేపదే నివేదికల్లో సూచిస్తున్నా ఇంకా చాలామంది పిన్‌కోడ్ వేయటంలేదు.

2. అడ్రస్ మార్పు తెలిపేటప్పుడు చందా నంబరు తప్పక ఉదహరించాలి. అది సంవత్సర చందాయో, జీవితచందాయో స్పష్టంగా వ్రాయాలి.

3. పత్రిక తరచు అందకపోతే పోస్టల్ కంప్లెయింట్ పెట్టి సహకరించాలి.

4. అడ్రస్ మార్పులు సకాలంలో తెల్పాలి.

5. రిపోర్టులు వీలయినంత సంగ్రహంగా, ప్రధాన విషయం శీర్షికగా ఉంచి, కాగితం ఒకవైపే వ్రాసి పంపాలి.

6. ఫోటోలు బ్లాక్ అండ్ వైట్ అయితేనే స్పష్టంగా వస్తాయి. ప్రధాన పోరాటాలో.... సభలో... సమావేశాలో జరిగినపుడు మంచి ఫోటోగ్రాఫర్‌ని ఎన్నుకొని చక్కగా తీయించి పంపాలి. లేకపోతే చేసిన శ్రమ, అయిన ఖర్చూ వ్యర్థమవుతుంది.

7. చందాలు లిష్టుగా పంపేప్పుడు 'డూప్లికేట్ తీసి ఒక కాపీ పంపితే చాలు. రశీదు అందగానే తమవద్దనున్న లిష్టులో వరుస నంబర్లు వేసుకోవచ్చు.

– ఈ కనీస జాగ్రత్తలు తీసుకొంటే పత్రిక మిస్సింగ్ తగ్గుతుంది. సక్రమంగా సకాలంలో పత్రిక చేరుతుంది.

గత మూడున్నర సంవత్సరాల పత్రిక నివేదిక సంగ్రహంగా మీ ముందుంచాను. దీనిని చర్చించి, తగు సూచనలిచ్చి ఈ నివేదిక పరిపుష్ఠం చేయగోరుతున్నాను.

## పత్రిక చందా వివరాలు

| నెం. | జిల్లా | 1986 | 1987 | 1988 | 1989 |
|---|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | 59 | 73 | 89 | 128 |
| 2. | విజయనగరం | 120 | 97 | 176 | 110 |
| 3. | విశాఖపట్టణం | 166 | 171 | 101 | 206 |
| 4. | తూర్పుగోదావరి | 1791 | 2024 | 2155 | 2502 |
| 5. | పశ్చిమగోదావరి | 1398 | 1519 | 1580 | 1678 |
| 6. | కృష్ణా | 914 | 1116 | 1231 | 1420 |
| 7. | గుంటూరు | 999 | 1047 | 1080 | 1024 |
| 8. | ప్రకాశం | 1146 | 1000 | 1545 | 1646 |
| 9. | నెల్లూరు | 1290 | 1402 | 1408 | 1418 |
| 10. | చిత్తూరు | 257 | 353 | 291 | 501 |
| 11. | కడప | 110 | 118 | 150 | 64 |
| 12. | కర్నూలు | 198 | 263 | 258 | 303 |
| 13. | అనంతపురం | 242 | 261 | 289 | 332 |
| 14. | ఖమ్మం | 1010 | 1151 | 1267 | 1301 |
| 15. | వరంగల్ | 450 | 471 | 498 | 501 |
| 16. | కరీంనగర్ | 375 | 468 | 662 | 625 |
| 17. | ఆదిలాబాద్ | 179 | 210 | 246 | 312 |
| 18. | నల్గొండ | 547 | 658 | 858 | 813 |
| 19. | మహబూబ్‌నగర్ | 788 | 837 | 870 | 1020 |
| 20. | నిజామాబాద్ | 306 | 337 | 384 | 389 |
| 21. | మెదక్ | 43 | 45 | 38 | 27 |
| 22. | రంగారెడ్డి | 50 | 79 | 55 | 71 |
| 23. | హైదరాబాద్ | 216 | 232 | 251 | 261 |
| 24. | ఇతరములు | 50 | 250 | 4 | 405 |
| | మొత్తం | 13,144 | 14,181 | 15,491 | 17,056 |

## ఐక్య ఉపాధ్యాయ !

– ఇల్చూరి నాగరత్నం,
బెళగల్, కర్నూలు జిల్లా.

ప్రతి పంతులి జీవితాన వెన్నెల కాయ
ఉద్యమాల సేదదేర్చు వట వృక్షచ్ఛాయ
విద్యార్థుల మేలుకోరు మంచినీటి పాయ
ఐక్య ఉపాధ్యాయ.. మన .. ఐక్య ఉపాధ్యాయ

సామాజిక స్పృహను మనలో కలిగిస్తుంది
చిక్కుముడు లన్నిటిని చిటికలోన విప్పుతుంది
విద్యార్థుల ఏర్పుదిద్దు విధం చెబుతుంది
అధ్యాపక కరదీపిక ... ఐక్య ఉపాధ్యాయ.



ఢిల్లీలో భారత ఉపరాష్ట్రపతి డాక్టర్ శంకరదయాల్ శర్మ వద్ద నుండి 'ఉద్యోగపత్ర' అవార్డును అందుకొంటున్న పాపులర్ షూమార్టు గ్రూపు సంస్థల అధినేత శ్రీ చుక్కపల్లి పిచ్చయ్య



# నెల్లూరు జిల్లా యు.టి.యఫ్ ద్వితీయ మహాసభ

అధ్యక్షోపన్యాసం చేస్తున్న

శ్రీ సి.హెచ్. లక్ష్మీనారాయణ

మహాసభల సందర్భాన పతాకావిష్కరణల అనంతరం ప్రత్యేకంగా నెల్లూరుజిల్లా ద్వితీయ మహాసభ జిల్లాశాఖ అధ్యక్షులు శ్రీ. సి.హెచ్. లక్ష్మీనారాయణ గారి అధ్యక్షతన జరిగింది. తొలుత జిల్లాశాఖ ఉపాధ్యక్షులు శ్రీ ఎ. రాజయ్య సంతాప తీర్మానాలు ప్రవేశపెట్టగా ప్రతినిధులు మౌనం పాటించి శ్రద్ధాంజలి ఘటించారు. మహాసభను ప్రారంభిస్తూ రాష్ట్ర అధ్యక్షులు శ్రీ డి. రామిరెడ్డిగారు నెల్లూరుజిల్లా ఉద్యమం, దాని పరిణామ క్రమం సూచనగా తెలిపి, కార్యకర్తలు మరింత చైతన్య స్థాయికి పెరగ వలసిన అవసరం వుందని విజ్ఞప్తి చేశారు. శ్రీ లక్ష్మీనారాయణ అధ్యక్షోపన్యాసంలో 10 ఏళ్ళ తర్వాత ద్వితీయ మహాసభ జరుపుకొనడానికి విచారిస్తూ ఈ శతాబ్దకాలంలో జరిగిన పరిణామాలు, చేసిన పోరాటాలు నేడు యు.టి.యఫ్. ను ఎదురులేని శక్తిగా జిల్లాలో తీర్చిదిద్దాయని పేర్కొన్నారు. ప్రస్తుతం దీనివల్ల మన బాధ్యత పెరిగిందని, మన కార్యక్రమాల్లో వైవిధ్యం కూడా పెరగాలని ఆయన కోరారు.



సందేశమిస్తున్న శ్రీ డి. రామిరెడ్డి వేదికపై శ్రీ రమేష్ రెడ్డి, శ్రీ శ్యామలరావు (జి.ఎ.ఒ)

అనంతరం జిల్లా శాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ టి. కొండాచారి దశాబ్దపు కార్యదర్శి నివేదిక ప్రవేశ పెట్టారు. ప్రారంభపు ఆటుపోట్లు, మెల్లమెల్లగా పెరిగిన ఉద్యమం, కార్యకర్తల అసమాన త్యాగం, కృషి, సమస్యలపై ఖచ్చితమైన వైఖరి, సాధించిన విజయాలు, చేయవలసిన కర్తవ్యాలు ఆయన వరుసగా ప్రస్తావించారు. జిల్లాశాఖ ఉపాధ్యక్షులుగా వుండి కన్నుమూసిన శ్రీ ప్రభుదాసుగార్కి ఆయన ప్రత్యేక నివాళులర్పించారు. భవననిధి వివరాలు, మండలాల నిర్మాణ విషయాలు, భవిష్యత్ కార్యక్రమం, ఆర్థిక నివేదిక ప్రవేశపెట్టి, నిర్మాణాత్మక సూచనలు చేయాలని ఆయన కోరారు.

తర్వాత జిల్లాశాఖ కార్యదర్శి శ్రీ షేక్ సాబ్జాన్ తీర్మానాలు ప్రవేశ పెట్టగా ప్రతినిధులు ఆమోదించారు.

పిదప మర్రిపాడు మండలాధ్యక్షుడు శ్రీ యం.వి. నారాయణరెడ్డిగారు ప్రస్తుత విద్యా విధానాన్ని తీవ్రంగా విమర్శించి సంఘాలు దీని బాగు కోసం కృషి చేయాలని ఆకాంక్షిస్తూ సందేశమిచ్చారు. నెల్లూరు రూరల్ మండలాధ్యక్షులు శ్రీ టి. రమణయ్యగారు యు.టి.యఫ్. సమస్యలపై సూత్రబద్ధంగా వ్యవహరిస్తూ, సమరశీల సంఘంగా కృషి చేస్తూనే, సామాజిక స్పృహను ఉపాధ్యాయుల్లో పెంచడం ఆదర్శవంతమైనదని అభినందించారు. ఒక ప్రజా సంఘంగా మీ అభివృద్ధి అనితరసాధ్యమని శ్లాఘించారు. ఈ దశలో మీరు సామాజిక కార్యక్రమాలకు మరింత ప్రాధాన్యం ఇవ్వాలని ఆయన ఉద్బోధించారు.

జిల్లా పరిషత్ విద్యాధికారి శ్రీ యం. శ్రీహరిరావుగారు గజిటెడ్ అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరు శ్రీ వి. శ్యామలరావు గారు, సర్వోదయ కళాశాల ప్రధానాచార్యులు శ్రీ పి. మాధవరావుగారు యస్.టి.బి.సి. జనరల్ సెక్రటరీ డా. యస్. బెంజిమన్ గారు, సి.ఎ.యం. ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ వై.టి. మిత్రాగారు సందేశాలు ఇచ్చి మహాసభలు జయప్రదం కావాలని ఆకాంక్షించారు.

కార్యదర్శి నివేదికను చర్చ తర్వాత సభ ఆమోదించింది. జిల్లా శాఖ కార్యదర్శి శ్రీ బి. కిరణ్‌శ్రీ గారి వందన సమర్పణతో జిల్లా మహాసభ ముగిసింది.

## స్మృత్యంజలి



**కీ.శే. యస్. ప్రభుదాసు**

కార్యదర్శి, జిల్లాశాఖ (1974-78)

# నెల్లూరుజిల్లాలో ఉద్యమ ప్రగతి

## జిల్లా ద్వితీయ సహాసభలో కార్యదర్శి నివేదిక

టి. కొండాచారి
ప్రధానకార్యదర్శి, జిల్లాశాఖ



అధ్యక్షా! కామ్రేడ్స్!!

యు.టి.యఫ్. 5వ రాష్ట్రమహాసభలు మన జిల్లా కేంద్రంలో జరుపుకొనే మహదవకాశం లభించటం మనకు గర్వ కారణం. మొదట జిల్లా ద్వితీయ మహాసభలు జరుపుకొనాలని నిర్ణయించి కార్యరంగంలోకి దిగేము. ఉపాధ్యాయ వర్గం చూపిన అపారాదారణ, కార్యకర్తల ఆత్మ విశ్వాసం జిల్లా మహాసభ స్థానే రాష్ట్ర మహాసభలు జరపగలమనే నిర్ణయానికి దారి తీసింది. రాష్ట్ర నాయకత్వం మన ఆహ్వానాన్ని అంగీకరించి మనకీ అవకాశం కల్పించినందుకు ధన్యవాదాలు! ఆ సందర్భంలోనే జరుపుకొంటున్న మన జిల్లా ద్వితీయ మహాసభలో జిల్లా ఉద్యమ ప్రగతిని కూడా సమీక్షించుకొందాం.

ఈ నెల్లూరులోనే జిల్లా ప్రధమ మహాసభ స్థానిక సి.ఎ.యం. పాఠశాలలో 1979 మార్చి 10,11 తేదీలలో అత్యంత జయప్రదంగా జరిగింది. జమీన్ రైతు లాంటి పత్రికలు 'ఇది రాష్ట్ర మహాసభా.. జిల్లా మహాసభా?' అని కొనియాడేంత సంరంభంగా ఆ మహాసభలు జరిగాయి.

ఒక దశాబ్దం తర్వాత రెండవ మహాసభ జరుపుకొంటున్నాం. జిల్లాలో ఉన్న మారుమూల ఉపాధ్యాయుణ్ణి కూడా కదిలించి దీనిలో పాల్గొనేలా, అన్ని విధాలా సహకరించేలా మన శాఖలన్నీ నిర్విరామకృషి చేశాయి. ఆ ఉత్సాహం, ఆ ఉత్తేజం .. జిల్లా ఉద్యమాన్ని సజీవ స్రవంతిగా మార్చి, దేన్నయినా సాధించగలమనే ఆత్మవిశ్వాసాన్ని కల్గించాయి. అందుకు కార్యకర్తలందరికి ధన్యవాదాలు.

ఈ కాలంలో జాతీయంగా, అంతర్జాతీయంగా అనేక మార్పులు జరిగాయి. వాటన్నిటినీ రాష్ట్ర నివేదికలో పొందుపరిచి ఉండటం వల్ల, వాటిని మళ్ళీ ప్రస్తావించటం లేదు. అలాగే విద్యా రంగంలో వచ్చిన మార్పులు, సాగించిన ఉద్యమాలు, పొందిన విజయాలు కూడా రాష్ట్ర నివేదికలో ఉన్నవి.

వాటన్నిటిలో మన జిల్లా ఉద్యమానికి ప్రధాన భాగస్వామ్య మున్నది. ఏ ఉద్యమం సాగించినా, ఏ పోరాటానికి పిలుపిచ్చినా మనం కూడా దానిలో గణనీయమైన పాత్ర వహించాం. ఈ కాలంలో జరిగిన యం.యల్.సి. ఎన్నికలలో మన రాష్ట్రశాఖ అధ్యక్షుడు శ్రీ డి. రామిరెడ్డి గారిని గెల్పించు కోవటంలో గాని, భీమవరం, విజయవాడ మహాసభల్లో మన ప్రతినిధులు పాల్గొనడంగాని, కోటాల మేరకు విరాళాలు పంపటంలో గాని అన్నింటా మన కర్తవ్యాలను నెరవేర్చాము. అలాగే విజయవాడ, హైదరాబాదుల్లో నెలకొల్పిన రాష్ట్ర కార్యాలయాలకు శక్తియుక్తులూ విరాళాలు అందించాం.

### జిల్లా కార్యాలయం

ఈ కాలంలోనే మన జిల్లా శాఖకు కూడా స్వంత కార్యాలయం ఉండాలనే తపన కార్యకర్తల్లో వచ్చింది. జిల్లా నాయకత్వం, కార్యకర్తలు అడ్వాన్సులు యిచ్చి కార్యాలయం కొనుగోలు చేసి, ఆ తర్వాత ఉపాధ్యాయులకు పిలుపు ఇవ్వటం జరిగింది. వారి నుండి మంచి ఆదరణ రావటం, భవనం అప్పు తీర్చటమేగాక, వెనుక మరొకగది కూడా నిర్మించుకొని, ఒక ప్రధాన కార్యకర్త అందులో బాడుగకు ఉండి ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోయే ఏర్పాట్లు చేసుకొన్నాం. దానికి దోహదపడిన దాతలందరికీ ధన్యవాదాలు.



కార్యాలయంలో ఉండి నిత్య కృషి చేస్తున్న
శ్రీ డి. మస్తాన్ రావు, కార్యదర్శి, జిల్లా శాఖ

### జిల్లా శాఖ ప్రత్యేక కృషి

**ఎయిడెడ్ రంగం :–** రాష్ట్ర వ్యాప్త ఉద్యమంలో భాగంగా డైరెక్ట్‌పేమెంట్ సాధించుకొన్నాం. ఆ సందర్భంలో దుర్మార్గమైన 'అగ్రిమెంటు షరతుల్ని' తిప్పికొట్టాం. ఒక సంఘం తప్పుడు అగ్రిమెంటుపై సంతకాలు పెట్టండని జిల్లాలోని వివిధ పాఠశాలలు తిరిగింది. సంతకాలు పెట్టకపోతే డైరెక్ట్ పేమెంట్ స్కీము, గ్రూపు ఇన్సూరెన్సు పోతాయని పిరికి మందు పోసింది. మన కార్యకర్తలు ఎక్కడికక్కడ ఆ విషప్రచారాన్ని ఎదుర్కొన్నారు. ప్రత్యర్థులు ఎత్తుగడల్ని తుత్తునియలు చేశారు. ఉపాధ్యాయుల్ని చైతన్యపరచిన ఫలితంగా ఆ అవమాన కర అగ్రిమెంటుపై ఒక్కరూ సంతకం పెట్టలేదంటే, ఆ విషయంలో మన కృషి ఎంత శక్తివంతంగా సాగిందో అర్థమవుతుంది. ఎయిడెడ్ సదస్సులు జరపడంలోగాని,

ధర్నాలు నిర్వహించటంలోగాని, రిలే నిరాహార దీక్షల్లో పాల్గొనడంలోగాని మన జిల్లాశాఖ పక్షాన వందలాది మంది పాల్గొని మన సమీకరణ శక్తిని రుజువు చేశారు.

అంతేగాదు, మన జిల్లాలో మేనేజిమెంట్ల దాడులకు గురయిన పిడితోపాధ్యాయులకు అండగా నిలబడి పలుచోట్ల మన జిల్లా ఉద్యమం గర్వింపదగిన పోరాటాలు నిర్వహించింది. వరకలిపూడి, తంబళ్ళగుంట, అల్లూరు కచ్చి వెంకయ్య స్కూలు, మైకామైన్స్, కలిచేడు, తలుపూరు, కోవూరు, వాకాడు మొదలగు చోట్ల ఎవరు ఎప్పుడు కోరితే వారికి అండగా నిలబడ్డాం. ఫిక్సేషన్లు, ఇతర సమస్యల పై రాజీలేని పోరాటం చేసి ఎయిడెడ్ సమస్యలపై మనం ఛాంపియన్‌గా నిలబడ్డాం. వందలాది మందితో ధర్నాలు పలుమార్లు జరిపాం. ఫలితంగా అపారాదరణ పొందగలిగేము.

ఈ సందర్భంలో మనం కొన్ని అగ్ని పరీక్షల్లో కూడా నిగ్గుదేలాము. మన నాయకులు శ్రీ కటారితిరుపాలు, శ్రీ కిరణశ్రీలపై డి.యి.ఓ. ఆఫీసు గుమాస్తాలు కొందరు తప్పుడు కేసులు బనాయిస్తే, ఏళ్ళ తరబడి నిలబడి మనకు అనుకూలమైన తీర్పులు పొందడం జరిగింది. అది మన ఉద్యమ చరిత్రలో మరపురాని ఘట్టం. 1986 పే స్కేళ్ళ ధృవీకరణకు ఈ సంవత్సరం డి.యి.ఓ. ఆడిట్ ఆఫీసులపై కేంద్రీకరించి పోరాడేము. దళారీలను, లంచగొండుల్ని ఎదుర్కొని అందరికీ ఒకేసారి ఫిక్సేషన్లు జరిపించాము. అరియర్ల చెల్లింపులు కూడా జూన్ 20లోగా చెల్లించే కృషి చేశాము. ఫలితంగా నేడు 90 శాతం ఎయిడెడ్ టీచర్లు యు.టి.యఫ్. సభ్యులు, ఇంకా సీనియారిటీ లిస్టు, యఫ్.బి.యఫ్. లాంటి సమస్యలు తెగకుండా ఉన్నాయి. జిల్లాశాఖ పక్షాన సర్వశ్రీ శ్రీ కె.తిరుపాలు, కిరణశ్రీ, రఘుపతి గార్లు ఎయిడెడ్ సమస్యలపై కేంద్రీకరించి కృషి చేస్తున్నారు. వారందరికీ ధన్యవాదాలు.

**పంచాయతీరాజ్ రంగం :–** అధికాధిక మండల పాఠశాలల్లో మన సంఘమే ప్రధానశక్తిగా ఉంది. సమస్యా పరిష్కారాల్లో మన శాఖలు అగ్రభాగాన ఉన్నవి. అలాగే అన్ని జడ్.పి. హైస్కూళ్ళలో కూడా మన సభ్యత్వం ఉంది. కార్యకర్తలున్నారు. సర్క్యులర్లన్నీ వారి పేర వెళ్తున్నాయి. 1974-78 నుండి నేటి వరకు వరసగా చూస్తే సెలక్షన్ గ్రేడ్ సమస్యలపై మనం ప్రబల పోరాటం చేశాము. ప్రత్యర్థుల నీచపు ఎత్తుగడల్ని ఎదుర్కొన్నాం. అప్పటి ఫిక్సేషన్లపై మన సూత్ర బద్ధ వైఖరిని తాత్కాలికంగా కొందరు అపార్థం చేసుకొన్నా నేడు నిజమేదో అందరూ గుర్తించారు. ట్రిబ్యునల్ తీర్పులపై కూడా అంతే. మన వైఖరే సరయినదని రుజువయింది. 55 సం.లకు రిటైర్‌మెంట్ వచ్చినప్పుడు వందలాదిమందికి మనం స్టే తెప్పించాము. ఖచ్చితంగా వ్యవహరించి అందరి మన్ననలు పొందాము. డ్రాయింగు, పి.యి.టి. క్రాఫ్ట్ టీచర్లకు గ్రేడ్ – 1 స్కేలు ఇప్పించటం, ఆంటిసిడెంట్స్ అప్రూవ్ చేయించి రెగ్యులరైజేషన్ చేయించటం, బి.యి.డి. లకు 1969లో జరిగిన ఫిక్సేషన్లలో జరిగిన అన్యాయాల్ని సరి జేయించటం, తెలంగాణా నుండి వచ్చిన వారి రక్షణ, అభ్యుదయ పాఠశాలల టీచర్ల సమస్యలు, హిందీ పండితులకు ట్రయినింగు, తాత్కాలిక పెన్షన్ల మంజూరు, పి.యఫ్. స్లిప్పుల వంటి సమస్యలపై మన కృషి నిర్మాణాత్మకమైనది. 1981లో జరిగిన అక్రమబదిలీలపై నికరపోరాటం చేసి అగ్రిమెంటు చేసుకొని చట్టవిరుద్ధ బదిలీలన్నీ రద్దు చేయించాము. రీగ్రూపింగ్ స్కేళ్ళు, 10-15 సం.ల స్కేళ్ళు ఉద్యమ పరంగానే సాధించుకొన్నాం. 1982-83 టి.ఏ. ల కోసం పోరాటం చేసి 2 1/2లక్షల రూపాయిలు విడుదల చేయించాము. ఈ విధంగా ఈ దశాబ్దంలో మన ఉద్యమ చరిత్రంతా పోరాట చరిత్రే. నిజాయితీని, దృఢ సంకల్పాన్ని ప్రదర్శించిన గర్వింపదగిన చరిత్రే!

**మునిసిపల్ రంగం:–** కావలి, గూడూరు మునిసిపాలిటీలలోమనది బలీయ స్థానం. నెల్లూరులో క్రమంగా పుంజుకొంటున్నాం. గ్రాంట్ల విడుదల, బకాయిల చెల్లింపు, స్థానిక సమస్యలపై నిత్య కృషి సాగుతున్నది. 86 ఫిక్సేషన్లలోనికరంగా నిలబడి పోరాడి నెల్లూరు మునిసిపాలిటీలో మన సభ్యుల్ని అవినీతికి వ్యతిరేకంగా నిలబెట్టాము. దీనిలో మనకు మంచి గుర్తింపు వచ్చింది. ప్రమోషన్లపై ఈ యేడాది నోటీసు ఇచ్చి సాధించింది. ఫలితంగా నేడు మన సంబంధాలు బాగా పెరిగాయి. సభ్యత్వం కూడా గణనీయంగా పెరిగింది. దాన్నింకా ముందుకు తీసుకుపోయి ఈ రంగంలో కూడా తిరుగులేని శక్తిగా రూపొందాలి.

**స్పెషల్ టీచర్లు:–** విద్యారంగంలో పెద్దయెత్తున స్పెషల్ టీచర్ల యువతరం ప్రవేశించింది. యువరక్తం.. కొత్తభావాలు..ప్రత్యేక సమస్యలు. అయినా వీరిలో అధికాధికులు మన జెండా క్రింద అద్భుతంగా సమీకృతులయ్యారు. అడుగడుగునా మనం వీరికి అండగా నిలబడ్డాం. సమస్యలపై ప్రత్యేక కర పత్రం వేసి ఎడ్యుకేట్ చేశాం. ఫలితంగా 90 శాతం మన సభ్యులుగా చేరారు. కొన్ని ప్రాంతాల్లో ముఖ్య బాధ్యులుగా ఎదిగారు. మంచికార్యకర్తలుగా రూపొందారు. వేకెన్సీలు డైరెక్ట్‌గా భర్తీ చేయనుండగా అడ్డుపడి ఆపించి రాష్ట్ర సంఘ సహకారంతో డైరక్టర్ నుండి అబ్జార్సన్ ఆర్డర్లు తెప్పించి, రాష్ట్రంలో మొట్టమొదట మన జిల్లాలోనే ప్రథమంగా విలీనం చేయించాము. వేసవి శలవుల జీతంపై పోరాడి ఇప్పించాము. సీనియారిటీ ప్రకారం ఒక క్రమపద్ధతిలో ప్రమోషన్ ఇచ్చే సంప్రదాయం ఏర్పరిచాము. ఈ ఏడాది అన్‌ట్రయిన్డ్‌వారి పక్షాన పోరాడి ట్రయినింగ్‌కు పంపించగలిగాము. స్పెషల్ పండితుల, పి.యి.టి.లవిషయం డి.ఇ.ఓ. తో చర్చించి అబ్జార్షన్‌కు ఒప్పించాము. కొన్ని శక్తులు ప్రక్కదారి పట్టించే ప్రయత్నం చేస్తున్నా, ఆర్థికఅరాచకాల ద్వారా లాభాలుపొందజూస్తున్నా వాటికి ఎప్పటి కప్పుడు అడ్డుకట్టలు వేసి ఆ యువతరాన్ని ఉద్యమంలో ఇముడ్చుకోవటం జరుగుతున్నది.

ఈ విధంగా ఎక్కడ సమస్య ఉన్నా దాని పరిష్కారం కోసం నిత్యకృషి చేసిన ఫలితంగా జిల్లాలో మన ఉద్యమం తిరుగులేని శక్తిగా రూపొందింది. నేడు సమన్వయ సమావేశాల్లో మనం పెట్టినవే ఎజెండాలో ప్రధానమవుతున్నాయి. ప్రతి సమస్యపై ఖచ్చితంగా వ్యవహరించగలమన్న నమ్మకం టీచర్లకు ఏర్పడింది. జడ్.పి.సిబ్బంది దీనికెంతో సహకరిస్తున్నది. చక్కని సంప్రదాయాలేర్పరచి సమస్యాపరిష్కారానికి తోడ్పడుతున్నది.

**నిర్మాణం:–** గత దశాబ్దపు నిర్విరామకృషి ఫలితంగా 79 లో మూడువేలుగా ఉన్న సభ్యత్వం ప్రస్తుతం 5 వేలు దాటింది. 46 మండలాలలో, 3 పట్టణాలలో మన శాఖలు ఏర్పడి ఆదర్శ కృషి సాగిస్తున్నాయి. పిలుపిస్తే వందలాదిగా-కదిలే జనం, వారిని నడిపే

దీక్షాదక్షులైన కార్యకర్తలు మనకు ప్రతి శాఖలోనూ ఉన్నారు. ఆనాడు 700 లుగా ఉన్న పత్రికా సం.చందాలు నేడు రెట్టింపు అయ్యాయి. 42 గా ఉన్న జీవితచందాలు 511 కి పెరిగాయి. జనరల్ క్యాంపెయిన్‌లో అగ్రస్థానాన్ని నిల్పుకొంటున్న ఘనత మన జిల్లాకు గత తొమ్మిదేళ్ళుగా దక్కుతున్నది. ఇక డైరీలు 1600 తెప్పించినా చాలడంలేదు. అధ్యాపక దర్శినుల ఆదరణకూడా అలాగేఉన్నది.

ఈ కాలంలోనే గ్రేడు-3 వారికి అడ్వాన్సుమెంట్ టెస్ట్ వచ్చినప్పుడు వేసవి అంతా శ్రమించి జిల్లా వ్యాప్తంగా శిక్షణా తరగతులు నిర్వహించి 1500 మందికి శిక్షణ ఇచ్చి అధ్యయనం పట్ల మన కార్యాచరణ రుజువుచేశాము. కార్యకర్తల స్థాయి పెంచేందుకు దామరమడుగులో 88 వేసవిలో ఉద్యమతరగతులు నిర్వహించాము. హాజరైన 100 మందిలో 70 మంది యువకులు కావటం విశేషం

ప్రతి విషయంలో సూత్రబద్ధవైఖరి అవలంబించటం, రాజీలేని పోరాటంనడపటం, అవినీతికి అక్రమాలను నికరంగా ఎదిరించటం, అన్నిటికి మించి ఆశయాలకు అంకితమైన కార్యకర్తల నిరంతర దీక్ష మన ఉద్యమపటిష్టతకు, విస్తృత వ్యాప్తికి మూలకారణాలు. ఆత్యాగ దృక్పథం వజ్రసంకల్పమే మన జవ ... జీవం !

**కర్తవ్యాలు:—** మనం బాగా విస్తరించాం. పునాది ఏర్పరచుకున్నాము. రాష్ట్రమహాసభలు నిర్వహించే స్థాయికి ఎదిగాము. అయితే అకడమిక్ విషయాలలో మనం యింకా తీవ్రకృషి చే.. ..ి. వృత్తిపట్ల అంకిత భావాన్ని పెంపొందించాలి. మన ఉద్యమమే ప్రజల పట్ల బాధ్యతపెంచుకొనే స్వభావం సంతరించుకోవాలి. ఆవైపు ప ప్రచారం సాగాలి తర్ఫీదు పొందాలి. నిజమైన జాతి నిర్మాతలుగా రూపొందాలి జనవిజ్ఞాన వేదికను మన స్వంతం చేసుకోవాలి. హక్కులు-బాధ్యతలు మన నేత్రాలని, నిత్యం గమనంలో ఉంచుకొని పురోగమించాలి.

ఈ మహాసభలు ఐక్య ఉద్యమాన్ని మరోమలుపు తిప్పబోతున్నాయి. అఖిల భారత ఉద్యమానికి అంకురార్పణ చేయబోతున్నాయి ఉద్యమచరిత్రలో సువర్ణాధ్యాయం సృష్టించబోతున్నాయి. అది మళ్లీ మనకు ప్రత్యేక గర్వకారణం.

మనకృషి వృథా పోలేదు ఎక్కడికి వెళ్లినా అపారాదరణ, ఎవర్ని కదలించినా శక్తికి మించిన తోడ్పాటు. ఉపాధ్యాయులూ అంతే.. విద్యాభిమానులూ అంతే! అందుకే రాష్ట్ర సభల్ని విజయవంతం చేయగల్గుతున్నాము మన స్థాయి ఎంత ఎదిగిందో రుజువు చేయగల్గుతున్నాము

ఈ మహాసభలిచ్చే చైతన్యంతో మరింత పురోగమిద్దాము

విజయం మనదే ! ఉజ్జ్వల భవిష్యత్తు మనదే ! జిందాబాద్ ..యు.టి యఫ్ !!!

# St. Thomas High School

*SECUNDERABAD*

## HISTORY

This School is a Diocesan institution in the Diocese of Medak of the Church of South India.

Having been founded in 1842 by the late Rev. N. Paranjothy as an auxiliary to mission work of the then S.P.G. Mission, the school can rank as one of the oldest in the station. The school enjoyed the status of a high school from 1931 to 1937 at the time of the late Rev. S. Daniel but was subsequently reduced to Middle School. In July 1944 however permission was accorded by the Department to open the 9th Class (Form IV). But it was not till June 1950, three years after consumation of Church Union that class X could be opened. The School final Class (Class XI) was opened in the succeeding year, June 1951, and the school is a high school since then.

With the introduction of Junior Colleges, class XI was abolished with effect from the academic year 1969-70 and as such the school has now classes from 4th to 10th (S.S.C) with Tamil and Telugu as 1st languages. Instruction is given in two media Telugu and English.

***Principal***

ప్రథమ బహుమతి పొందిన వ్యాసం (ఉపాధ్యాయినులు)

# మహిళా ఉద్యోగులు – నేటి సమాజం

శ్రీమతి **డి.కె. పద్మిని,** గూడూరు



సామాజిక ఉత్పత్తి పరిణామక్రమంలో స్త్రీకి ప్రముఖ పాత్ర వుంది. గింజలుచల్లితే మొక్కలు మొలిచి మరింత ధాన్యం వస్తుందని కనిపెట్టింది స్త్రీలే. పశువులను మచ్చిక చేసిందీ, కుండలు చేసిందీ మొదట స్త్రీలే. ఉత్పత్తులు ఆమె అధీనంలో ఉండటంచేత యజమాని కూడా స్త్రీయే. సర్వస్వతంత్రురాలుగా వున్న స్త్రీ రానురాను పురుషుని ఆస్థిగాను, వ్యాపార వస్తువుగాను మారిపోయింది. ఆధునిక సమాజంలో స్త్రీకి వ్యక్తిగత విలువ లేకుండా పోయింది.

మొదటి నుండి క్రింది తరగతి స్త్రీలు కూలీలుగా, కార్మికులుగా పనిచేస్తున్నారు. అంటే ఉత్పత్తి కార్యక్రమంలో భాగస్వాములే. అయితే వారికి పురుషునితో సమానమైన కూలి ఇవ్వకపోవటం ఇప్పటికి జరుగుతూనే వుంది. పారిశ్రామిక విప్లవం మూలంగా ఇప్పుడు మధ్యతరగతి స్త్రీలే గాక ఉన్నత తరగతి స్త్రీలు కూడా ఉద్యోగం చెయ్యవలసిన పరిస్థితి ఏర్పడినది. ఆధునిక పరిశ్రమలు స్త్రీలు సులభంగా పనిచెయ్యటానికి వీలుగా వున్నాయి. స్వాతంత్ర్యవిప్లవ పోరాటాలు మధ్యతరగతి స్త్రీలను చైతన్యవంతులుగా చేసి ఉద్యోగాలకు సిద్ధంచేశాయి. 'ఉద్యోగం పురుషలక్షణం' అన్న నానుడి స్థానే ఉద్యోగం స్త్రీ హక్కు అని వచ్చింది. ప్రతి కుటుంబంలోనూ స్త్రీ ఉద్యోగం చెయ్యవలసిన పరిస్థితి ఏర్పడింది. రోజూ పెరిగే ధరలూ, ప్రాథమిక స్థాయి నుండే ఖర్చుతో కూడిన చదువులు, ఒకరి జీతం ఏమాత్రం చాలని పరిస్థితి. మరి సమాజంలో సగభాగమైన స్త్రీలలో అక్షరాస్యులెందరు? ఉద్యోగార్హతవున్న వారెందరు ? ఉద్యోగినులెందరు ? సమాన వేతనం పొందుతున్న వారెందరు ? ఫలితంగా పనిచెయ్యగలిగి ఉండికూడా ఇతరులపై ఆధారపడాల్సివస్తున్నది.

సోవియట్‌లో అన్ని రంగాలలోనూ యాభైశాతం స్త్రీలే పనిచేస్తున్నారు. ఈ మధ్య తమిళనాడులో ప్రభుత్వోద్యోగాలలో ముప్పదిశాతం స్త్రీలకే కేటాయించటం జరిగింది. ప్రాథమిక పాఠశాలల్లో స్త్రీలనే నియమించాలని నిర్ణయించింది. కాగా మన రాష్ట్రంలోకుటుంబానికో ఉద్యోగం పేరుతో స్త్రీల కున్న ముప్పదిశాతం రిజర్వేషన్ కొట్టి పారేయబడింది.

స్త్రీలకు అన్నింటి కంటే ఉత్తమమైంది ఉపాధ్యాయ వృత్తి. ప్రాథమిక స్థాయిలో పసివాళ్ళ మానసిక స్థాయిని గమనించి చెప్పగల ఓర్పు, నేర్పు స్త్రీలకే వుంటుంది. అయితే కొంతమందికి దెబ్బపడనిదే చదువురాదన్న దురభిప్రాయం లేకపోలేదు. ఒకే గదిలో 4 తరగతుల నుంచితే మాత్రం ఈ అభిప్రాయం సమంజసమే. ఉపాధ్యాయినులకు పిల్లల తల్లులతో దగ్గర సంబంధం ఉండే అవకాశం ఉంది. వారిని అప్పుడప్పుడూ సమావేశపరచి కుటుంబనియంత్రణ వల్ల లాభం గురించి, ఆరోగ్యం గురించి, నీటి కాలుష్యం, పరిశుభ్రత గురించి చెప్పడం ద్వారా సమాజారోగ్యాన్ని, అభివృద్ధిని కలిగించే అవకాశం ఉపాధ్యాయినులకు ఎంతైనా వుంది.

ప్రైవేటు విద్యా సంస్థలు, ఎక్కువగా కాన్వెంట్లు స్త్రీలకు ప్రాధాన్యత నిస్తాయి. నిరుద్యోగ యువతులు కొల్లలుగా వున్నందున వారిని సులభంగా దోపిడీ చేయవచ్చు. గాడిద చాకిరి చేయించవచ్చు. నోరెత్తితే ఉద్వాసన చెప్పవచ్చు. ఈ కాన్వెంట్ల దోపిడి విధానం గురించి 'ప్రత్యూష' అనే చిన్న నవలలో చక్కగా వివరించ బడింది.

కొంతమంది స్త్రీలు అవసరం కొద్దీ, చాలా కొద్దిమంది హాబీగాను మోడల్స్‌గా పనిచేస్తుంటారు. వారి అంగాంగ ప్రదర్శన ద్వారా వ్యాపారులు విపరీత లాభాలు గడిస్తున్నారు. పురుషులకు సంబంధించిన వస్తువులకు కూడా స్త్రీలనే వాడడం మరీ దారుణం.

ఇప్పుడు యువకులు ఉద్యోగం చేసే యువతులనే వివాహం చేసుకోవాలని కోరుకుంటున్నారు. ఉద్యోగినులు మాత్రం ఏ నిరుద్యోగినైనా కొనుక్కోవడానికి సిద్ధపడుతున్నారు. ఉద్యోగం చేస్తూ కూడా ఆర్థిక స్వాతంత్ర్యం లేనివారే ఎక్కువ. జీతం భర్త చేతికిచ్చి తన ఖర్చులకు కొంచెం మిగిలించుకునే పరిస్థితి కల్పించడమే జరుగుతుంది. అందరూ అలా చేస్తారని కాదు. సంపాదిస్తూ ఆర్థిక స్వాతంత్ర్యం లేని మహిళ పరిస్థితిని 'స్వేచ్ఛ' నవలలో శ్రీమతి ఓల్గా చక్కగా వివరించారు.

ఈ పరిస్థితులలో మహిళా ఉద్యోగులు తమ హక్కులను గుర్తించి పోరాడాలి. తప్పనిసరిగా సంఘాలలో చేరాలి. సభ్యత్వం కట్టేసి చేతులు దులుపుకుంటే చాలదు. సంఘాలు నడిపే ఉద్యమాల్లో భాగస్వాములు కావాలి. ఇక్కడ మాత్రం వెనకనే వుంటున్నారు. బాధ్యతగల పనులు చేయవలసివచ్చినప్పుడు మాత్రం మేము స్త్రీల మంటూ తప్పించుకొని, తమను తామే చులకన చేసుకుంటున్నారు. స్త్రీలలోని ఈ భావం ఉద్యమాలకు దెబ్బ. ప్రభుత్వానికి, యాజమాన్యానికి ఇది లాభం. ఈ సందర్భంలో వ్యవసాయ కార్మికమహిళలు ఉద్యమాల్లో ఎక్కువగా పాల్గొనడం గమనించదగిన విషయం. స్వాతంత్ర్య పోరాటకాలంలో మహిళారెజిమెంట్‌కు నాయకత్వం మహించింది

లక్ష్మీసైగల్. తెలంగాణా పోరాటంలో పాల్గొన్నవీ సామాన్య స్త్రీ

ఉద్యమాల్లో మహిళలు పాల్గొనక పోవడానికి కొంతవరకు కుటుంబ పరిస్థితులు కారణం కావచ్చు. ముఖ్యంగా ఉద్యోగినులు 'మన కెందుకులే' అన్న భావం విడనాడి, వారి వారి సంఘాల ద్వారా హక్కుల కోసం పోరాడాలి. మహిళల హక్కుల కోసం కూడా పోరాడాలి. మహిళా సంఘాలతో కలిసి అధికధరలకు వ్యతిరేకంగాను, స్త్రీలపై జరిగే దౌర్జన్యాలకు వ్యతిరేకంగానూ పోరాడాలి. ఇది ఎంతైనా అవసరం. ఈ విషయాల్లో స్త్రీకి పురుషుని ప్రోత్సాహం ఎంత అవసరమో, పురుషునికి స్త్రీ సహకారం కూడా అంత అవసరం.

ఇక ఉద్యోగినుల ఇబ్బందులు. ఒక్క మాటలో చెప్పాలంటే రెండు విధాల దోపిడీకి గురౌతున్నది ఉద్యోగ మహిళ. ఒకవైపు ఇల్లు, పిల్లలు - మరొక వైపు ఉద్యోగం. వీటితో ఉద్యోగినికి మానసిక వికాసానికిగాని, విశ్రాంతికిగాని, ఇతర కార్యక్రమాల్లో పాల్గొనే అవకాశం కానీ లేకుండా పోతున్నది. ఇంకా వారి భర్తలు ఏదైనా సామాజిక బాధ్యతలు నిర్వర్తించే వారైతే కుటుంబ బాధ్యత అంతా స్త్రీలపైనే పడుతుంది. అంతేకాక ఆర్థిక స్తోమత ఉండీ కుటుంబానికి పౌష్టికాహారం సమకూర్చలేకపోవడం పెద్ద నష్టం. ఎదిగే పిల్లలకు మరీను.

ఇక ఇంటి నుండి బయట పడ్డ తరువాత రకరకాల ఇబ్బందులు మొదలు. బస్సుల్లో, సీట్ల దగ్గర నుంచీ అవి ఉంటాయి. కొంతమందికి ఉద్యోగం చేసే స్త్రీలంటే చులకన భావం. ఈ వేధింపులు పలురకాలు. ఆఫీసుల్లో పనిచేసే మహిళల పట్ల వారి తోటి ఉద్యోగులు (అందరూ కాకున్నా) ప్రవర్తించే తీరు కూడా కొన్ని సందర్భాలలో ఇబ్బందికరంగా ఉంటుంది. పాఠశాలల్లోగాని, కార్యాలయాల్లోగాని, స్త్రీలకు కనీస సౌకర్యాలు చాలా తక్కువ. కర్మాగారాల్లో పనిచేసే స్త్రీలపై అజమాయిషీ చేసే వారి జులుం కూడా ఎక్కువే. ఇక డ్యూటీ టైం అయిన తరువాత ఇంటికెప్పుడు చేరతామా? ఎదురు చూసే పనులు ఎప్పుడు చేస్తామా వగైరా ఆలోచనలు. ఇన్ని ఇబ్బందులతో సతమతమయ్యే స్త్రీ డ్యూటీ సక్రమంగా చెయ్యడం కష్టమే. ఇంటికి చేరిన తరువాత వారి భర్తల నుండి లభించే సహాయం కూడా తక్కువే. పురుషులు ఇంటి పనులలో సహాయం చేస్తే స్త్రీలకు సగం శ్రమ తగ్గుతుంది గదా!

ఈ ఇబ్బందులేకాక ఉద్యోగినికి కట్నం పిశాచి బాధకూడ తప్పడం లేదు. ఇందులో సమాజం పాత్ర కూడా ఎక్కువే. చట్టాలు ఎన్ని వున్నా సమాజంలో నైతిక మార్పు రానంతవరకూ ప్రయోజనం లేదు. ఉద్యోగం చేసే స్త్రీలు కూడా కట్నాలకు వేధించే భర్తల వల్ల హత్యలకు, ఆత్మ హత్యలకూ గురికావడం గమనించదగిన విషయం. ఇందుకు ఉదాహరణ :- కర్నూలులో యం.ఎ., యం.ఇ.డి. టీచరుగా పనిచేస్తున్న సువర్ణమ్మ ఈ వేధింపు కారణంగా ఆత్మహత్య చేసుకుంది. ఆర్థిక స్వాతంత్ర్యం వున్న స్త్రీ భర్తనుంచి వేరుగా బ్రతక వచ్చుగదా! అప్పుడీ సమాజం ఒంటరి స్త్రీని వేలెత్తి చూపుతుంది. అందుకే ఆమె ఆత్మహత్య చేసుకొని వుంటుంది. ఈ పరిస్థితులనుంచి మహిళలు బయటపడాలంటే ఆత్మస్థైర్యం అవసరం. ధైర్యంగా నిలవాలి. ఆ స్థాయికి ఎదగాలి. అందుకు మంచి సాహిత్యం తోడ్పడుతుంది. మహిళా సంఘాలు కూడా చేయూత నిస్తాయి.

ఇంటాబయటా సహాయ సహకారాలు లభించినపుడు స్త్రీలు అంకితభావంతో తమ విధులు నిర్వహించగలరు. స్త్రీ ఉద్యోగినియైనా, కాకున్నా సంపూర్ణస్వేచ్ఛ, పురుషునితో సమాన స్థాయి, తమ విధులలో పూర్తి నైపుణ్యం ప్రదర్శించడం అన్నది ఒక్క సోషలిస్టు సమాజంలోనే ఉంటుందన్న విషయం మహిళలందరూ తెలుసుకోవలసిన నిజం. "ఇంటి పనికి, వంటి పనికి, పిల్లల పెంపకానికి సమాజం బాధ్యత వహించినప్పుడే స్త్రీలు పురుషులతో సమానస్థాయిని పొందగలరు." అన్న లెనిన్ మహాశయుని వాక్యం ప్రత్యక్షర సత్యం.

ప్రభుత్వ బాధ్యత, కృషి ఉంటే మహిళా ఉద్యోగుల ఇబ్బందులను కొంతవరకూ నివారించ వచ్చు. స్త్రీల చేత తక్కువ జీతంతో ఎక్కువ పని చేయించ వచ్చనే దోపిడీ విధానం మాని; అన్ని రంగాల్లోనూ స్త్రీలకు సమాన ప్రతిపత్తిని కల్పిస్తే వారి శక్తి సామర్థ్యాలను వినియోగించుకొని దేశం అభివృద్ధి చెందుతుంది. అవివాహిత యువతులను వారి కుటుంబాలకు సమీప ప్రాంతంలో నియమించాలి. గర్భిణీస్త్రీలకు ప్రత్యేక సౌకర్యాలు ఉండాలి. హాస్టల్ సౌకర్యం ఉండాలి. ఉద్యోగినుల పిల్లలకు సౌకర్యంగా వారికి దగ్గరలోనే క్రెచెస్ ఏర్పాటు చెయ్యాలి. లావెటరీ సౌకర్యం తప్పకుండా ఉండాలి.

అయితే మహిళా ఉద్యోగులు ఎవరోవచ్చి సౌకర్యాలు కల్పిస్తారని, ప్రభుత్వాలు హక్కులను రక్షిస్తాయని, అనుకుంటే పొరబాటే. హక్కులు పోరాడి సాధించుకోవలసిందే. సాధించిన వాటిని నిలుపుకోవడానికి కూడా పోరాటాలు సాగిస్తూ ఉండవలసిందే. అంతేకాదు మన సంఘాలు, మన హక్కులు, మన అవసరాలు అని మాత్రమే గిరి గీసుకోకుండా జనంతో కలిసి వారి సమస్యలను గుర్తించి, పరిష్కారం కోసం కృషి చేయడం కూడా అవసరం. అప్పుడే సమాజంలో సగభాగంగా కర్తవ్యనిర్వహణ చేసిన వాళ్ళమవుతాము.



శ్రీ జి. మల్లిఖార్జున్, ఆర్టిస్టు, దువ్వూరు



సంతాప తీర్మానాలు ప్రవేశపెడుతున్న
శ్రీ ఎ. రాజయ్య, ఉపాధ్యాయుడు, జిల్లా శాఖ



ప్రథమ బహుమతి పొందిన కథ

# 'చక్రభ్రమణం'

రచన :- కె. ఆదిశేషారెడ్డి, హెచ్.యమ్.
శానాయపాళెం.

చంద్రం ఆరోజు ఎంతో హుషారుగా వున్నాడు. అతను అక్కడి పాఠశాల విద్యార్థి సంఘ నాయకుడు. హెడ్మాష్టరు నిరంకుశ వైఖరిని నిరసిస్తూ ఆ రోజు తరగతులు బహిష్కరించాలని, ఆ క్రితం రోజు విద్యార్థి సంఘం నిర్ణయించింది.

ఏడు గంటలకు కాని నిద్రలేవని చంద్రం ఆరింటికే రెడీ అయి బయలు దేరాడు. తోటి విద్యార్థులను కలుసుకొని, పరిస్థితులను వివరించి, తరగతులను బహిష్కరించి తమ నిరసన తెలియజేయాలని, అప్పటికీ ఆయన ప్రవర్తనలో మార్పు రాకపోతే, జిల్లా విద్యార్థి సంఘ నాయకులను కలుసుకొని తర్వాత కార్యక్రమాన్ని రూపొందించగలమని తెలియజేశాడు.

స్కూల్ ప్రారంభమైంది. ఉపాధ్యాయులు క్లాసుల కెళ్ళారు. మొదటి పీరియడ్ జరుగుతూ వుంది. పదో తరగతిలో చంద్రం పైకి లేచాడు. అతనితో పాటు మరో నలుగురు లేచారు.

"మిత్రులారా! మన హెడ్మాష్టరు విద్యార్థుల పట్ల కక్ష పెంచుకొని, అనవసరంగా నిందించటం, బెదిరించడం చేస్తున్నాడు. ఆయన నిరంకుశ వైఖరికి నిరసనగా యీనాడు మన మంతా క్లాసులు బహిష్కరిస్తున్నాం" అంటూ వెలుపలికి నడిచాడు.

అతనితో పాటు తోటి విద్యార్థులంతా బిలబిలమంటూ వెలుపలకు నడిచారు. క్లాస్ టీచర్ యేదో చెప్పబోయాడు. వినేదెవరు? ... అదో ఆవేశం! వారి వైపు చూస్తుండి పోయాడు క్లాస్ టీచర్.

*　　　*　　　*

మూడవ గంట మ్రోగింది. విద్యార్థులంతా ఎవరి తరగతి గదుల్లోకి వారు చేరి పోయారు. స్టాఫ్ రూం లోంచి, ఆయా క్లాసు టీచర్లు బోధనా సామగ్రితో వారి వారి తరగతి గదుల వైపు బయలుదేరారు.

సైన్సు టీచర్ చంద్రశేఖరం పదో తరగతి జీవశాస్త్రానికి సంబంధించిన కొన్ని పరికరాలతో ఆ గదిలోకి అడుగుపెట్టాడు.

విద్యార్థులంతా లేచి నిల్చొని వందనం చేశారు. వారికి ప్రతివందనం చేస్తూ, తన కుర్చీ వైపు నడిచి టేబుల్‌పై బోధనా సామగ్రిని వుంచాడు. పాఠం చెప్పడానికి సిద్ధమయ్యాడు.

అంతలో బెంచీల మధ్యలోంచి విద్యార్థి నాయకుడు ప్రభాకర్‌లేచి, తోటి విద్యార్థులను హెడ్మాష్టరుగారి నిరంకుశ పోకడలకు నిరసనగా క్లాస్‌లు బహిష్కరించమని కోరాడు.

విద్యార్థులు బిలబిలమంటూ లేచారు. టీచర్ వారిని అనునయించాలని వారి నిరసనను ఆపాలని ప్రయత్నిం చాడు. కాని వారు ఆవేశంగా వెళ్ళిపోయారు.

వెళ్ళిన విద్యార్థుల వంక చూస్తుండి పోయాడుక్లాస్ టీచర్ చంద్రశేఖరం - అలనాటి తన విద్యార్థి జీవితం స్మృతిలోకి వచ్చిన చంద్రం.

*　　　*　　　*

హైదరాబాద్ సెక్రటేరియట్ ముందు దాదాపు రెండు వేలకు పైగా ఉపాధ్యాయులతో ధర్నా జరుగుతున్నది. ధర్నా శిబిరం కోలాహలంగా వుంది. తమ డిమాండ్ల నినాదాలు హెూరును పై అధికారులు వినేట్లు గొంతెత్తి అరుస్తున్నారు. ఎంతో వ్యయప్రయాసలకోర్చి, రాష్ట్రం నలుమూలల నుండి ఉపాధ్యాయులు తమ నాయకుల నిర్ణయం మేరకు కార్యక్రమంలో చురుగ్గా పాల్గొంటున్నారు.

సంఘ ప్రధాన బాధ్యులు చురుకుగా ధర్నా కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు. ప్రధాన బాధ్యులలో ఒకరైన చంద్రశేఖరం తమ డిమాండ్ల పత్రాన్ని రూపొందించాడు. నాలుగు గంటలకు వాటిని తీసుకొని, ముఖ్యమంత్రిగారికి, విద్యాశాఖా మంత్రిగారికి వాటిని సమర్పించాలని నిర్ణయించుకొన్నారు.

సాయంత్రం నాలుగు గంటలు కాగానే ప్రధాన బాధ్యులు ముఖ్యమంత్రిగారిని కలుసుకొని, తమ డిమాండ్లు పొందు పరచిన పత్రాన్ని అందించారు.

ఆయన దానిని అందుకొంటూ, "మీ కోర్కెల పట్ల సదవగాహన వుంది. అన్ని విషయాలను విద్యాశాఖ మంత్రి గారితో చర్చించండి. తర్వాత మంత్రివర్గ నిర్ణయాన్ని ప్రకటిస్తాం" అని చెప్పారు.

తర్వాత ప్రతినిధులు విద్యాశాఖామంత్రిగారిని కలుసుకొన్నారు.

మంత్రిగారు డిమాండ్ల పత్రాన్ని పరిశీలిస్తూ - వాటిలో కొన్ని ఫైనాన్షియల్ మ్యాటర్ అని, కొన్ని టెక్నికల్ ప్రాబ్లమ్స్ కలిగి వున్నాయని - మరికొన్నింటిపట్ల సెంట్రల్ వారి అబ్జెక్షన్స్ కనిపిస్తున్నాయి - అంటూ ప్రతి డిమాండ్‌కు యేదో వంకపెట్టి, పెదవి విరిచారు.

ప్రధాన బాధ్యులలో ఒకరైన చంద్రశేఖరంకు విద్యాశాఖమంత్రిగారి సమాధానాలు రుచించటం లేదు. ప్రతి దానికి ఆయన అడ్డు వేస్తుంటే ... తామేమి సాధించినట్లు! యిన్ని వేల మంది ఉపాధ్యాయులను రాజధానికి రప్పించి, ఇంత హైరాన్ పడింది ... యీ సమాధానాల కోసమా..?

"వీటిలో మీరు కనీస డిమాండ్లనైనా ఆమోదించక పోతే - మేము ఉద్యమాన్ని ఉధృతం చేయాల్సి వుంటుంది." అని మధ్యలో ఓసారి ఆవేశంగా అనటం కూడా జరిగింది.

చర్చలు అయిపోయాయి. ఉపాధ్యాయ ప్రతినిధులు తమ తదుపరి కార్యక్రమం నిర్ణయించుకోడానికి, తమ ఆఫీసు వైపు నడిచారు.

* * *

ఉపాధ్యాయ సంఘం వారు సెక్రటేరియట్ ముందు టెంట్ వేసి రిలే నిరాహార దీక్షలు చేస్తున్నారు. వారం రోజులు గడిచి పోయాయి. రాష్ట్రాల నలుమూలల నుండి యెందరో ఉపాధ్యాయులు రాజధానికి వచ్చి, ఏ రోజు కార్యక్రమాన్ని ఆ రోజు జయప్రదం చేస్తున్నారు.

ప్రభుత్వం వైపు నుండి చర్చలకు పిలుపు వచ్చింది.

సంఘ ప్రధాన బాధ్యులకు - విద్యాశాఖ మంత్రి గారి అధ్యక్షతన యేర్పడిన మంత్రివర్గ ఉప సంఘానికి మధ్య చర్చలు ప్రారంభమయ్యాయి.

డిమాండ్లు ఒక్కటొక్కటే చర్చిస్తున్నారు.

కొన్ని డిమాండ్లు ... ఆర్థికపరమైనవి...!
యింకొన్ని .... సాంకేతిక పరమైన అడ్డంకులు గలవి!
మరి కొన్ని ... వీలు పడనివి ...!

ప్రతి దానికి యేదో విధంగా సర్ది చెప్పసాగింది మంత్రివర్గ ఉపసంఘం. ఉపాధ్యాయ ప్రతినిధులు యెంతగానో నచ్చ చెప్ప ప్రయత్నం చేసినా - అనేక డిమాండ్లలో ఏకాభిప్రాయం కుదరలేదు.

చర్చలు విఫలమయ్యాయి.

సంఘ ప్రధాన బాధ్యులు వెలుపలకు నడిచారు-సంఘ భవిష్యత్ కార్యక్రమాన్ని నిర్ణయించుకొనేందుకు ...!

ఉపాధ్యాయుల డిమాండ్ల చర్చలలో తనతో సహకరించిన తోటి మంత్రులకు - అధికారులకు ధన్యవాదాలు తెలియజేశారు - విద్యాశాఖా మంత్రిగారైన శ్రీ చంద్రశేఖరం గారు - ఒకనాటి ఉపాధ్యాయ సంఘ ప్రతినిధి...!

* * *

ఆయన బాల్కనీలో కూర్చుని, ఆనాటి దిన పత్రికను తెరిచాడు.

వార్తలలో కొన్ని హెడ్డింగ్స్ ఆయన దృష్టినాకర్షించాయి.

'హెడ్మాస్టరుతో విద్యార్థుల ఘర్షణ - తరగతులు బహిష్కరణ..'

'ఉపాధ్యాయుల నిరసన ర్యాలీ -విద్యాశాఖ మంత్రిగారితో చర్చలు విఫలం ....'

'ప్చ్...యేంటో విద్యారంగం రోజురోజుకీ యిలా సమస్యల సుడిగుండంగా మారి పోతోంది...దీనికి పరిష్కారమెప్పుడు? ...యెప్పుడు..?యెప్పుడు...? అసహనంగా కుర్చీలో కదిలాడాయన.

ఆయన - మాజీ విద్యాశాఖా మంత్రిగారైన - శ్రీ చంద్రశేఖరం గారు...!

## యు.టి.యఫ్. ఉద్యమ గేయాల క్యాసెట్

మహాసభల సందర్భంగా, ప్రజా నాట్యమండలి సహకారంతో యు.టి.యఫ్. ఉద్యమ గేయాల క్యాసెట్ రూపొందించి విడుదల చేసింది. 500 క్యాసెట్లు క్షణాల్లో అయిపోయాయంటే వాటిపై ఉపాధ్యాయులు ఆదరణ స్పష్టమవుతున్నది.

### క్యాసెట్‌లోని పాటల వివరాలు

ఎ. 1. ఎగురవేయ్ ఎగురవేయ్ (పతాక గేయం) రచన:- గంగిశెట్టి
2. దేశమును ప్రేమించుమన్నా - మహాకవి గురజాడ
3. పాడరా ఓ తెలుగువాడా! - శ్రీ కొండేపూడి లక్ష్మీనారాయణ
4. సుందర భారత మందరిదీ - శ్రీ వడ్లమూడి నాగేశ్వర రావు
5. చదవాలిరా .. ఎన్ని ఆటంకాలొచ్చినా - శ్రీ దేవేంద్ర
6. యు.టి.యఫ్. రైలు బండి - శ్రీ జాన్

బి. 7. అరుణారుణ కిరణమొకటి - ఆరుద్ర
8. నిజంగానే నిఖిల లోకం - శ్రీ శ్రీ
9. కట్నం .. కట్నం అంటారేందిరో - జానపదగేయం
10. నిదురించు వేళాయె ... - దేవేంద్ర
11. జయం మనదిరా - ఐక్య ఉపాధ్యాయ
12. మానవుడా .. ఓ మానవుడా .. - దేవేంద్ర

**గాయనీ గాయకులు** :- దేవేంద్ర (కన్వీనర్), జగన్, మోహన్, సురేష్, సత్యానంద్, ప్రభావతి, బేగం, లెనినా.

**సంగీత సహకారం** :- ఆంథోనీ (హార్మోనియ, ఆర్గాన్), అప్పారావు (తబలా), ఆమోస (ఫ్లూట్), రాజు (స్టూడియో రికార్డింగ్ టెక్నిషియన్)

**నిర్వహణ** :- శ్రీ శాంతారాం, (ప్రధాన కార్యదర్శి, ఆంధ్రప్రజా నాట్యమండలి) శ్రీమతి దేవి.

**- సహకరించిన వారందరికీ ధన్యవాదాలు!**

ప్రథమ బహుమతి పొందిన వ్యాసం (పురుషులు)

# మారుతున్న సమాజం – ఉపాధ్యాయుడు



శ్రీ పి.ఎస్. భాస్కరరావు
జె. ఆర్. పల్లె, వి.కె.పాడుకుండలం

విశ్వశాంతి కళ్యాణానికి, మారుతున్న సమాజంలో నాగరిక జీవనానికి, ఆధునికి యుగంలో విజ్ఞానాభివృద్ధికి, ఉన్నతస్థాయిలో శాస్త్రాధ్యయనానికి కావలసినది విద్య. అట్టి విద్యను విపులీకరించి వివిధ రంగములలో మహోజ్వల శిఖరాల నధిరోహించి సముచిత ఫలితాలను సాధించడానికి శాస్త్రాధ్యయన లోతుపాతులను విస్తృతార్థాలతో వివరించునది ఉపాధ్యాయుడు.

ప్రస్తుత శతాబ్దంలో వేగంగా పరుగిడుతున్న మానవుని మనస్సును అందుకొని అధ్యయనము చేయుటకు, మారుతున్న సమాజంలోని స్థితిగతులను అంచనావేసి మనుగడ సాగించగల శక్తిని విద్యార్థులకు కలిగించుటలో ఉపాధ్యాయుని పాత్ర చాలా ముఖ్యమైనది.

ప్రాచీనయుగంలో మానవుని జీవనగతులకు, ప్రస్తుత మానవుని జీవన గతులకు ఎంతో వ్యత్యాసమున్నది. ఈ రాకెట్‌యుగంలో విజ్ఞాన శాస్త్రం ఊహకందని అభివృద్ధిని, ప్రగతిని సాధిస్తున్నది. కనుక ఆపథంలో ప్రతి ఒక్క విద్యార్థి ప్రయాణించవలెనంటే వారి వెనుక ఉపాధ్యాయుల కృషి ఎంతో అవసరం. మారుతున్న సమాజంలో దేశ జనాభా పెరిగేకొద్దీ విద్యా విషయక విలువలు పడి పోకుండా నవ సమాజ స్థాపనకు విద్యార్థులను నిజమైన దేశపౌరులుగా తీర్చిదిద్దుటకు ఉపాధ్యాయులు సమాయత్తమై యుండాలి. విద్యార్థులలోని జ్ఞానాన్ని వెలికి తీయాలి. మారుతున్న సమాజంలో కలిగే ప్రతిష్ఠంభనను ఎదుర్కొని ముందుకు సాగిపోగల ఆత్మస్థైర్యాన్నిచ్చే విద్య వారికి కావాలి. గురువు విద్యార్థులలోని అజ్ఞానమనే చీకటిని పారద్రోలి వారిలో జ్ఞానమనే వెలుతురును ప్రసరింపజేయాలి. ప్రస్తుతం మారుతున్న సమాజంలో స్వయంపోషక విద్య విద్యార్థులకు అవసరం. అంతే కాకుండా ఉపాధ్యాయుడు ఈ మారుతున్న సమాజంలో ఎప్పటికప్పుడు జరిగే మార్పులను గమనించి వాటికి అనుగుణమైన విద్యను విద్యార్థులకు నేర్పించాలి. విద్యార్థుల మనస్తత్వాన్ని గమనించి వారిలో మార్పు తీసుకురావాలి. ఏయే విద్యార్థులు ఏయే రంగాలలో అభిలాష చూపిస్తున్నారో గమనించి వారిలో ఆ కళ అభివృద్ధి చెందుటకు తగిన శిక్షణ యిప్పించి వారిని దేశానికి ఉపయోగపడే ప్రయోజకులుగా మలచాలి.

కాబట్టి ఉపాధ్యాయుడు విద్యార్థులలో వున్న జ్ఞానాన్ని వెలికితీసి వారిని ఆయారంగాలలో నిష్ణాతులను చేయాలి. అందుకే ఉపాధ్యాయుడు నిత్య విద్యార్థిగా ఉండాలి. ఎన్నో విషయాలను క్రోడీకరించి విద్యావిషయక విలువలు పెంపొందించేటట్లు సమాజాభివృద్ధికి తోడ్పడేటట్లు విద్యార్థులకు విద్యను బోధించాలి. విద్యార్థులలో సర్వతోముఖాభివృద్ధి వుండేటట్లు చూడాలి. మూర్తిమత్వ లక్షణాలను పెంపొందించాలి.

ప్రస్తుత సమాజంలో నిజమైన దేశపౌరులుగా విద్యార్థులు తీర్చిదిద్దబడవలెనంటే వారిలో ఒకరిలోనొకరికి సౌభ్రాతృత్వం, దయ యిటువంటి విషయాలలో ఎక్కువ జాగ్రత్త వహించాలి. చిన్నారులైన విద్యార్థుల వయస్సు మీద ప్రస్తుత సమాజంలోని చీడ పురుగుల ముద్రపడకముందే వారిలో యిటువంటి అన్యోన్యభావ సంబంధాలు కలిగించాలి. ఈ విధంగా విద్యార్థులలో మార్పు తీసుకువచ్చి వారిని నవచైతన్యవంతులుగా చేయు వైతాళికుడు ఉపాధ్యాయుడే.

ఇంకా ఈ మారుతున్న సమాజంలో విద్యార్థులు అత్యున్నత స్థాయికి తీసుకువెళ్ళి దేశ సౌభాగ్యానికి దోహదం చేయవలసిన పని ఉపాధ్యాయుల భుజస్కంధాలపై యున్నది. విద్యార్థులలో సమాజ పరిస్థితుల దగ్గరనుంచి జాతీయ, అంతర్జాతీయ విషయాలలో అవగాహన కలిగేటట్టు చేయాలి. వివిధ దేశాలు వివిధ రంగాలలో ఏ విధంగా ముందంజ వేసినాయో ఆయా దేశాల వైజ్ఞానిక పరిస్థితులు ఆధునిక యుగంలో వాటిలో వచ్చే మార్పును అభివృద్ధిని విద్యార్థులకు బోధించాలి. విద్యా విషయక విలువలను పెంపొందించాలి.

ఈ మారుతున్న సమాజంలో ప్రస్తుతం మనము నివసిస్తున్నది సాంకేతిక, శాస్త్ర యుగంలో కాబట్టి దానికనుగుణంగా మన దేశం అభివృద్ధి చెందవలెనంటే మనకు ఎంతోమంది నిష్ణాతులైన శాస్త్ర, సాంకేతిక ప్రవీణులు అవసరము. కాబట్టి దానికి అనుగుణంగా తయారు చేయబడిన విద్య యిప్పుడు విద్యార్థులకు కావాలి. అంతేగాకుండా ప్రస్తుత సమయంలో వ్యవసాయ రంగంలో, పారిశ్రామిక రంగంలో గణనీయమైన అభివృద్ధిని సాధించవలసిన అవసరం వుంది. ఈ అభివృద్ధిని సాధించాలంటే ఆ బాధ్యత బాలలపై యున్నది. నేటి బాలలే రేపటి పౌరులు కదా! కాబట్టి విద్యార్థులకు ఈ విధంగా ఆధునీకరించబడిన విద్యను ఉపాధ్యాయుడు బోధించాలి. జపాన్, అమెరికా, రష్యా మొదలగు దేశాలు ఈ యుగానికి అనుగుణంగా గణనీయమైన అభివృద్ధిని యిప్పటికే సాధించినాయి. అటువంటి అభివృద్ధి మనదేశం కూడా సాధించవలెనంటే, అన్ని రంగాలలో గణనీయమైన మార్పు రావలెనంటే విద్యార్థులను ఆయా రంగాలలో తీర్చిదిద్దవలసిన బాధ్యత ఉపాధ్యాయునిదే. అన్ని రంగాలలో ఎప్పుడైతే గొప్ప మార్పు వస్తుందో అప్పుడే ఆ దేశం భోగభాగ్యాలతో తులతూగుతుంది. ఆ విధంగా విద్యార్థుల్ని విజ్ఞానవంతులను తయారుచేయవలసింది ఉపాధ్యాయుడే.

ప్రథమ బహుమతి పొందిన గేయం

# యు.టి.యఫ్. ఉద్యమ గీతం

- శ్రీ కె.వి. కృపానందం
జడ్.పి.పి. హైస్కూలు, కురుగొండ.



అయ్యోరన్నా నీకు దండమోరన్నా
అమ్మోరక్కా నీకు దండమేనక్కా
స్వార్థమంటే నీకు తెలియదోరన్నా
అవినీతి నీకు దూరమోరన్నా

1. గురుదేవోభవ అంట ఓరి కోలన్నా
గురువేమూలమంట "
పాఠశాలలు గుళ్ళంట "
పిల్లలేమో దేవుళ్ళంట "
భావి భారత పౌరుల్ని - చక్కగా తీరుస్తు
జాతీయ సమైక్యతకు -పునాదు లేస్తావు ||అయ్యోరన్నా||

2. కులమత భేదాలు ఓరి కోలన్నా
మనకు చాల దూరమయ్యా "
మనదంత ఒక వర్గము "
ఉపాధ్యాయ వర్గమయ్యా "
సామ్యవాదభావాల్తో - పాఠాలు చెప్పుతూ
భావిపౌరులందర్ని -తీరుగా తీర్చుతూ ||అయ్యోరన్నా||

3. బళ్లె లెక్కలు నీకేరా ఓరి కోలన్నా
గొర్రె లెక్కలు నీకేరా "
కుక్కల లెక్కలు నీకేరా "
మనుషుల లెక్కలు నీకేరా "
లెక్కలన్నీ వ్రాయిస్తూ - గొడ్డు చాకిరీ చేయిస్తూ
పాఠాలు చెప్పమని-సర్కారు చెపుతుంది||అయ్యోరన్నా||

4. పనిచేసే ఊళ్ళోనే ఓరి కోలన్నా
ఉండమని చెప్తారు "
ఉండటానికి ఇల్లుండదు "
త్రాగటానికి నీళ్ళుండవు "
బాధలన్నీ దిగమ్రింగి-కష్టాలు పడుతూ
ఊళ్ళోనే ఉంటూనే-పాఠాలు చెప్మంట్రు ||అయ్యోరన్నా||

5. తలకు మించిన సిలబస్ అయ్యా ఓరి కోలన్నా
అచ్చు తప్పు పుస్తకాల్తో "
ఇబ్బంది పాలవుతూ "
కష్టపడి పోతుంటే "
ఓరియంటేషన్లని-పదిరోజులు క్లాసులు పెట్టి
చెప్పిందే చెప్పుతూ-సుత్తిగొట్టి పారేస్తారు ||అయ్యోరన్నా||

6. సింగిల్ టీచర్లంటూరు ఓరి కోలన్నా
క్లాసులేమో అయిదాయె "
ఉండటానికి రూముండదూ "
కూర్చోటానికి బల్లుండదూ "
బ్లాక్‌బోర్డు లేకుండా-చాక్‌పీస్ లేకుండా
టీచింగు నేర్పులు పెట్టి-పాఠాలు చెప్పమంట్రు ||అయ్యోరన్నా||

7. ఎండకాలపు సెలవులొచ్చె ఓరి కోలన్నా
బదిలీల బాధలతో "
అధ్వరు బెదురు అయ్యోరా "
ఎండ మండి పోతుంటే "
రెకమెండేషన్ చేటబట్టి-చెప్పులరగ తిరుగుతూ
ట్రాన్సఫర్ల ఆర్డరు కోసం-ఎదురు చూస్తుంటావు ||అయ్యోరన్నా||

8. నెల్లూరు నగరాన ఓరి కోలన్నా
యు.టి.యఫ్. రాష్ట్ర సభలు "
మహా జోరు గున్నాయి "
మనకెంతో గర్వమన్న "
యు.టి.యఫ్. జండా క్రింద -ఐక్యంగా ఉంటూనే
మన హక్కుల కోసం - పోరాటం సాగిస్తాం ||అయ్యోరన్నా||

ప్రథమ బహుమతి పొందిన మినీగేయం.

## "దేవుడు"

- ఆర్. వెంకట్, టీచర్
మున్నవరప్పాడు.

గుడిలోని దేవునికి
బడిలోని దేవునికి
భేదమేమి?

గుడిలోని దేవుడు
గుండు గీయించు!
బడిలోని దేవుడు
గుండె వెలిగించు!

కార్యాలయంలోనే ఉండి నిత్యకృషి చేస్తున్న
జిల్లా కార్యదర్శి శ్రీ డి. మస్తాన్‌రావు.

ప్రథమ బహుమతి పొందిన వ్యాసం (విద్యార్థి విభాగం)

# 'నేను కోరుకొనే ఉపాధ్యాయుడు'

—వి.విజయకుమార్, 10 వ. తరగతి.
వి.ఆర్.హైస్కూల్, నెల్లూరు.

ఉపాధ్యాయుడు విద్యార్థులకు ఆదర్శప్రాయుడు. ఆయన నడవడికనుబట్టే విద్యార్థులు నడచుకొంటారు. ఆయన దుర్వ్యసనాలుగలవాడైతే, విద్యార్థులకు కూడా అవి అంటుకొంటాయి. మంచి అలవాట్లు గలవాడైతే అవే విద్యార్థులకూ అబ్బుతాయి.

అందువల్ల, నేను కోరుకునే ఉపాధ్యాయుడు సద్గుణవంతుడు, దయాశీలి, శాంతమూర్తి, సత్యవాది, సత్ప్రవర్తనగలవాడై వుండాలి. చెప్పే నీతులన్నీ స్వయంగా పాటించేవాడై వుండాలి. చిటపటలాడక విద్యార్థుల్ని ప్రేమగా చూసేవాడుగా వుండాలి. హెచ్చు తగ్గులు, తేడాలు చూపకుండా అందరికీ సమానంగా విద్య నేర్పేవాడై వుండాలి.

పాఠం ఆసక్తికరంగావుండాలంటే ఉపాధ్యాయుడు పిల్లల్లో కలిసిపోవాలి. వారి మనోభావాలను గుర్తించి, వాటికి అనుగుణంగా పాఠాలు బోధించాలి. క్రొత్త క్రొత్త విషయాలు తాను నేర్చుకొంటూ, పిల్లలకు చెప్పాలి. కులమతాలకు అతీతంగా జాతీయ భావాలు కలిగించాలి. పాఠాలే గాక ఆటలు, పాటలు అన్నీ నేర్పాలి. అప్పుడే విద్యార్థులకు ఉత్సాహం, గురువంటేగురి, భయ భక్తులూ ఏర్పడతాయి.

విద్యార్థుల మెదటికి పదునుపెట్టే విధంగా ఆయన బోధన వుండాలి. ఎవరికి ఏ విషయంలో ఆసక్తి వుందో గమనించాలి. వాటన్నిట్లో ప్రోత్సాహం యివ్వాలి. అప్పుడే మట్టిలో మాణిక్యాలెన్నో వెలికి వస్తాయి. సానబట్టిన వజ్రాలెన్నో తయారవుతాయి. బోధించే విషయం విద్యార్థికి అర్థమవుతుంటే అతడు గోలచేయడు. క్రమ శిక్షణ దానంతట అదే అబ్బుతుంది. ఆ విద్యార్థులు సత్పౌరులుగా తయారవుతారు. మంచేదో చెడేదో తెలుసుకొని మసలుకొంటారు.

గురువు వీరుల కథలు, నీతికథలు సందర్భోచితంగా చెప్తూ ఉండాలి. కథలంటే పిల్లలు చెవులు కోసుకుంటారు. ఆ కథలద్వారా ధైర్యం, సాహసం, దేశభక్తి, మొదలైన గుణాలు విద్యార్థులకు అబ్బుతాయి. భవిష్యత్తులో వారు దేశభక్తులుగా తయారవుతారు.

పాఠ్యపుస్తకంలోని విషయం చెప్పటమేగాకుండా, వీలయిన ప్రయోగాలద్వారా పిల్లల మనసుకు హత్తుకొనేట్లు పాఠంవుండాలి. అప్పుడప్పుడూ విజ్ఞానయాత్రలకు తీసుకువెళ్ళిలోకజ్ఞానంగలవారిగా పిల్లల్ని మలచాలి. క్విజ్ పోటీలు, ఆటలు, పాటలు, వ్యాసరచన, వకృత్వం, చిత్రకళ మొదలగు రకరకాల పోటీలలో పిల్లలు పాల్గొనేట్లు ప్రోత్సాహించాలి. వారికి సర్వతోముఖ వికాసం కలిగించాలి. చిన్న చిన్న బహుమతులు ఏర్పరచి వారిని ఆకర్షించాలి.

సంఘంలో అనేక దుర్మార్గాలు, అత్యాచారాలు జరుగుతుంటాయి. గురువు విద్యార్థుల్ని వాటికి వ్యతిరేకంగా తీర్చిదిద్దాలి. సంఘ సంస్కర్తల్ని గురించి చెప్పాలి. చిన్నప్పటినుండే త్యాగ దృక్పథం అలవడేటట్లు, తోటి మానవుల్ని గౌరవించేటట్లు చూడాలి.

దేశ సమస్యల్ని గురించి తరచు చెప్తూ వుండాలి. పెరుగుతున్న జనాభా, దరిద్రం, జబ్బులూ, వాటి నివారణోపాయాలూ బోధించాలి. ప్రపంచంలో మానవులంతా ఒకటేనని, ప్రాంతీయ విభేదాలు పనికిరావని చెడు ఎక్కడ జరిగినా నిరసించాలని, మంచిని ప్రోత్సాహించాలని, ధైర్యంగా మనసులోని మాట చెప్పాలని, తన ప్రవర్తన ద్వారా నిరూపించాలి. అటువంటి మేధాశక్తిగల ఉపాధ్యాయుణ్ణే నేను కోరుకుంటాను. ఆయనే నా ఆదర్శ గురువు.

## ముఖ్య గమనిక

స్థలాభావ కారణంగా మహాసభలలో యు.టి.యఫ్. పక్షాన ప్రవేశపెట్టిన కాన్వెంట్ ఎడ్యుకేషన్, చటోపాధ్యాయ కమిటీ రిపోర్టు, వృత్తివిద్య డాక్యుమెంట్లు ఇందులో ఇవ్వలేకపోతున్నాము. వాటిని సెప్టెంబరు సంచిక నుండి వరుసగా ప్రచురింపగలము.
॥సం॥

# మహాసభల్లో ఆమోదించిన వివిధ తీర్మానాలు

శ్రీ జి.లక్ష్మయ్య
ఉపాధ్యక్షుడు, యు.టి.యఫ్



## సంతాపతీర్మానాలు

1986 జనవరి 8, 9, 10, తేదీలలో విజయవాడలో జరిగిన మన నాల్గవ విద్యా వైజ్ఞానిక మహాసభల నుండి ఈనాటివరకు అంతర్జాతీయ, జాతీయ, ప్రజారంగాలలో చనిపోయిన ప్రముఖులు, ప్రకృతి వైపరీత్యాలు, కుల, మత, ఘర్షణలలో చనిపోయిన వారున్నారు. వారందరికి ఈ మహాసభ పక్షంగా మన సంతాపాన్ని తెలియజేయటం మన కనీస కర్తవ్యంగా భావిస్తూ ఈ సంతాప తీర్మానాన్ని ప్రతిపాదిస్తున్నాము.

1) జన చైనా కమ్యూనిస్టుపార్టీ మాజీప్రధాన కార్యదర్శి కా॥హుయావోబాంగ్, సోవియట్ రష్యా మాజీ ప్రధాని కా॥మాలటోవ్, వియత్నాం అగ్ర నాయకుడు కా॥పామ్‌వాంగ్, శ్రీలంక వామపక్ష నాయకుడు కా॥విజయకుమార్ రణతుంగ, ప్రపంచ ఉపాధ్యాయ సమాఖ్య కార్యదర్శి హెర్‌బర్ట్‌గెర్‌హార్ట్ మొదలుగాగల అంతర్జాతీయ ప్రాముఖ్యత పొందిన వ్యక్తులు మరణించారు. వారి మరణానికి ఈ మహాసభ తన సంతాపాన్ని తెలియజేస్తోంది.

2) మాజీ భారత ప్రధాని చరణ్‌సింగ్, లెబనాన్ ప్రధాని రషీద్‌కరామీ, బంగ్లాదేశ్ కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి కా॥ మహమ్మద్ పల్‌హాద్ గార్లు ఈ కాలములో చనిపోయారు. వారి మృతికి ఈ మహాసభ తన సంతాపాన్ని తెలియజేస్తోంది.

3) ఢిల్లీ జననాట్యమండలి నిర్మాణ, వీధినాటక ప్రయోక్త, ప్రజా కళాకారుడు కామ్రేడ్ సఫ్దర్‌హష్మి ఘజియాబాద్‌లో వీధి ప్రదర్శనలిస్తున్న సందర్భంగా హత్య గావింపబడ్డారు. వారి అకాల మరణానికి ఈ మహాసభ తన సంతాపాన్ని తెలియజేస్తున్నది.

4) ప్రముఖ కార్మికనేతలు, వామపక్షనాయకులు, స్వాతంత్ర్య సమరయోధులు కా॥ పి. రామమూర్తి, నృసింగ చక్రవర్తి, కృష్ణపదఘోష్, కళ్యాణసుందరం, వి.పి.చింతన్, హర్యానా యువజన నాయకుడు శ్రీమాన్‌సింగ్, దీపక్‌ధావన్, పంజాబ్ రైతు సంఘ నాయకుడు చనన్‌సింగ్‌ధూత్, బీహార్ ప్రజానాయకుడు ఆనందసింగ్, గుజరాత్ ప్రజానాయకుడు దీపక్‌ధావన్, తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ యమ్.జి. రామచంద్రన్, మాజీ ముఖ్యమంత్రి భక్తవత్సలం, మహారాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి వసంతదాదాపాటిల్‌గార్లు ఈ కాలంలో చనిపోయారు. వారి మృతికి ఈ మహాసభ తన సంతాపాన్ని తెలుపుతోంది.

5) యు.టి.యఫ్ రాష్ట్ర మాజీసబ్‌కమిటీ సభ్యుడు, మహబుబ్‌నగర్ జిల్లా యు.టి.యఫ్ విస్తృతికి, విద్యార్థి, ప్రజా సంఘాల అభివృద్ధికి కృషి చేసిన కా॥ఎ.చంద్రమౌళి గుండెపోటువలన అకాలంగా మరణించారు. నిన్న, మొన్నటివరకు మన మధ్య తిరిగిన వారి స్మృతులింకా మన కళ్ల ముందు కదులుతూనే ఉన్నాయి. సంఘం ఎడల వారి విశ్వాసాన్ని వివిధ ప్రజాసంఘాల వ్యాప్తికోసం ఆ జిల్లాలో వారు సల్పిన కృషి-ధృఢ దీక్షలను మనము సదా మననము చేసుకొందాము. వారి అకాల మరణానికి ఈ మహాసభ తన శ్రద్ధాంజలి ఘటిస్తున్నది.

6) ప్రముఖ సినీ కళాకారులు రాజ్‌కపూర్, పి. పుల్లయ్య, కిశోర్ కుమార్, మోదుకూరు జాన్సన్‌గార్లు ఈ కాలములో మరణించారు. వారి మృతికి ఈ మహాసభ తన సంతాపాన్ని తెలియజేస్తోంది.

7) పండితులు, పత్రికా రచయితలు, కవులు, సర్వశ్రీ విద్వాన్ విశ్వం, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, తుమ్మల వెంకట్రామయ్య, ఖ్వాజా అహమ్మద్ అబ్బాస్, జి.కె.రెడ్డి, రమేష్ థాపర్, గంటి జోగి సోమయాజి, రోణంకి అప్పలస్వామి, పన్యాల రంగానాధరావు శ్రీమతి మహాదేవివర్మ, మొదలగువారు చనిపోయారు. వారి మృతికి ఈ మహాసభ సంతాపాన్ని తెలియజేస్తోంది.

8) మార్క్సిస్టుపార్టీ మహిళా కార్యకర్త శ్రీమతి లీలా సుందరయ్య, రాష్ట్ర ముఖ్యమంత్రి కార్యదర్శి శ్రీ యు.బి. రాఘవేంద్రరావు, శాస్త్రవేత్త సూరిభగంతం, పక్షి శాస్త్రజ్ఞుడు సలీంఆలీ, వివిధ ప్రజాసంఘాల నాయకులు, రతన్‌లాల్ బ్రహ్మన్, శంకర్‌దయాళ్ తివారి, సదాశివన్, రామబహదూర్ గురుంగ్, డి.కె.శ్రీవాస్తవ, బి.యస్. రామయ్య, భీష్మారావు, సూర్యనారాయణ, చంద్రరావు, పులిరామయ్య మొదలగువారు మరణించారు. వారి మరణానికి ఈ మహాసభ సంతాపాన్ని తెలియజేస్తోంది.

9) పార్లమెంటు సభ్యులు పార్థసారధి, కె.యల్. యన్.ప్రసాద్, సోషల్ సైంటిస్టు వ్యవస్థాపకుడు, మాజీ పార్లమెంటు సభ్యుడు, మాథ్యూకురియన్, మాజీ మంత్రులు అమరనాథరెడ్డి, ఇబ్రహీంఅలీ, అన్సారీ, గుంటూరుజిల్లా పరిషత్ చైర్మన్ దొడ్డపనేని ఇందిరగార్ల మరణానికి ఈ మహాసభ తన సంతాపాన్ని తెలియజేస్తోంది.

10) పంజాబ్ హర్యానాలలో ఉగ్రవాదుల దాడులలో మరణించిన ప్రజానీకం, మీరట్ మతకలహాలలో మరణించిన అమాయక ప్రజలు, డార్జిలింగ్‌లో గూర్ఖా నేషనల్ లిబరేషన్ ఫ్రంట్ దౌర్జన్యాలకు గురైన వందలాది మంది అమాయకులు, త్రిపురలో దుండగుల దాడికి బలైన గిరిజనులు, నీరుకొండ పిప్పర గ్రామాలలో భూస్వాములదాడికి గురైన హరిజనులు, ఆర్మీనియా భూకంపములో మరణించిన వారికి ఈ సమావేశం తన సంతాపాన్ని తెలియజేస్తోంది.

11) వివిధ జిల్లాలలో మన సంఘ కార్యకర్తలుగా పనిచేసిన కా॥ ధర్మరాజు, రెడ్డి వెంకటేశ్వరరావు, ఎ.యల్. కాంతారావు, డి.బి.గాంధీ, సి.హెచ్.సోమయ్య ఆర్. -వెంకటేశ్వరరావు నర్సయ్య, యాదవ్ మొదలగు వారి మరణాలకు ఈ మహాసభ తన సంతాపాన్ని తెలియజేస్తోంది.

# విద్యావిషయిక తీర్మానాలు

## 1. జాతీయ సమగ్రతా పరిరక్షణ నేటి మనతక్షణ కర్తవ్యం

భారతదేశము వివిధ భాషలు, విభిన్న ఆచార వ్యవహారములను పాటించే షుమారు 80 కోట్ల జనాభా గల దేశముగా నేడు రూపొందింది. పారిశ్రామిక, వ్యవసాయ, విద్యాభివృద్ధి, ఉద్యోగ అవకాశాలలో అసమానతలు స్వాతంత్ర్యం పొందిన 42 సంవత్సరాల తరువాత కూడా కొనసాగుతున్నవి. ఈ దేశ సమగ్రతను స్వాతంత్ర్యాన్ని అస్థిర పరచడానికి అనుక్షణము పొంచి కూర్చున్న విదేశీ మిషనరీలు సంక్షేమ సంస్థల పేరుతో పీఠమేసి కూర్చొన్నవి. కుల, మత ప్రాంతీయ విచ్ఛిన్న శక్తులకు ప్రోత్సాహమిచ్చి మన జాతీయ సమగ్రతకు చిచ్చు పెట్టటానికి విదేశీశక్తులు ప్రోత్సాహము విస్తృతముగా అందజేస్తున్నవి.

ఈ దశలో విద్యారంగములో పనిచేస్తున్న మనందరిపైన ఈ జాతి సమగ్రతను సమైక్యతను కాపాడుటకు కృషి చేయవలసిన బృహత్తర కర్తవ్యమున్నది. జాతీయ సమైక్యతను, సమగ్రతను పటిష్ఠ పరచుటకు ఉపాధ్యాయులుగా మనము ఈ క్రింది కర్తవ్యాలను నెరవేర్చాల్సి ఉంటుందని ఈ మహాసభాముఖంగా ఆంధ్రప్రదేశ్ ఉపాధ్యాయ లోకానికి విజ్ఞప్తి చేస్తోంది.

1) విద్యార్థులు, ఉపాధ్యాయులలో సెక్యులర్ భావాలను పెంపొందించుటకు కృషిచేయాలి.

2) అంధ విశ్వాసాలను, విచ్ఛిన్నభావాలను విద్యార్థులు గురైరిగే పద్ధతిలో పాఠ్యాంశముల బోధనలో కృషిచేయాలి. అందుకుగాను జనవిజ్ఞాన యాత్రలు, సైన్సు ఎగ్జిబిషన్లు, చైతన్య సదస్సులలో మన వంతుగా పాల్గొనుటేకాక, విద్యార్థులు పాల్గొనునట్లు ప్రోత్సహించాలి.

3) పాఠశాలలలో క్రీడా, సాంస్కృతిక కార్యక్రమాల అభివృద్ధికి ప్రాధాన్యతనిచ్చి కృషిచేయాలి.

4) జాతీయ సమగ్రతాభివృద్ధికి మనచుట్టూఉన్న ప్రజానీకాన్ని జాగృతము చేయుట మన కనీస కర్తవ్యముగా భావించాలి.

## 2.హాస్పిటల్సు-ఇతర సంస్థల బిల్లును ఉపసంహరించాలి

ప్రైవేటు, ప్రభుత్వరంగాలలో వైద్య, విద్య మొదలుగాగల రంగాలలోని సిబ్బంది సమిష్టి సమస్యలను పరిష్కరించు కొనుటకు ఉన్న అవకాశాలను కాలరాసేందుకుద్దేశింపబడిన బిల్లు "హాస్పిటల్సు-ఇతర సంస్థల బిల్లు" సమిష్టిబేరసారాలను, సమ్మెహక్కును హరించేందుకు ఉన్న చట్టాలలోనే అనేక అంశాలున్నవి. ఇవి చాలవన్నట్లు విస్తృత అధికారాలను గుప్పెట్లో పెట్టుకోవటానికుద్దేశింపబడిన దుర్మార్గమైన బిల్లు ఇది.

ఏ యూనిట్ ఆ యూనిట్లో గ్రీవెన్సరిడ్రెసల్ అథారిటీని ఏర్పాటుచేయుట దీనిలో ముఖ్యాంశము. వ్యక్తిగతమైన సమస్యల పరిష్కారానికి యాజమాన్యాలు అధికారిని నియమిస్తాయి. అతనికి నివేదించిన సమస్యపై 60 దినాలలో తీర్పునిస్తాడు. తీర్పుసానుకూలము కాకపోయినా, గడువులోపల తీర్పురాకపోయినా యాజమాన్యం నియమించిన మరొక అధికారికినివేదించాలి. ఆ అధికారి 90 దినాలలో తీర్పునిస్తాడు. ఆమోదంకానిచో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నియమించిన ట్రిబ్యునళ్ళకు వెళ్లాలి. 90 దినాలలో వచ్చే ఈ తీర్పే తుదితీర్పు. అందరికీ సంబంధించిన సమస్యల పరిష్కారానికి యాజమాన్యం, ఉద్యోగులు సమాన సంఖ్యలో నుండే 'యాజమాన్యం కౌన్సిల్' ఏర్పాటుచేస్తారు. ఈ కౌన్సిల్ పరిష్కారంచేయని సమస్యను మధ్యవర్తికి నివేదించాలి. మధ్యవర్తిదే తుది తీర్పు. సమస్య పెండింగులో నున్న సమయములో కార్యచరణకు పోరాదు. కార్యాచరణలో పాల్గొన్నవారికి, ప్రోత్సహించినవారికి జైలుశిక్షతోకూడిన జరిమానా విధించబడును. జైలుశిక్ష 1 నుండి 6 నెలలు, జరిమానా 1000 రూ.ల నుండి 10వేల వరకుండును. ఈ క్రిమినల్ చర్యలకు నిరసన తెలిపిన 6 నెలలు జైలుశిక్ష 20,000 రూలు జరిమానా, న్యాయముకోసము నిరసన తెలిపే హక్కును హరిస్తుంది. కోర్టులో సవాలు చేసుకొనే ప్రాథమిక హక్కును కాలరాసే అత్యంత దుర్మార్గపుచట్టమిది. భావిభారత పౌరులకు హక్కులను, బాధ్యతలను తెలుపవలసిన బాధ్యతగల ఉపాధ్యాయుల ప్రాథమిక హక్కులనే హరించే ఈ బిల్లును నిరసించటము, దీని రద్దుకు జరిగే సమైక్య ఆందోళనలో పాలుపంచుకోవటము ద్వారానే రాజ్యాంగము ప్రసాదించిన హక్కులను కాపాడుకోగలము. కావున ఈ మహాసభ ఈ నిరంకుశ "హాస్పిటల్సు-ఇతర సంస్థల" బిల్లును ఉపసంహరించుకోవలసిందిగా డిమాండ్ చేస్తోంది.

## 3. సహకార జూనియర్ కళాశాలల విధానాన్ని ఉపసంహరించుకోవాలి.

+2 విద్య విద్యార్థి జీవితములో మన విద్యా విధానములో అతి ముఖ్యమైన మలుపు. యూనివర్శిటీ విద్యలకు వెళ్ళవలసినవారికికాని, టెక్నికల్ కోర్సులో చేరుటకుగాని లేక ఏదో ఒక వృత్తి విద్యనభ్యసించి జీవితములో స్థిరపడు వారికిగాని ఇదొక మలుపునిస్తుంది. అట్టి +2 విద్య పట్ల ప్రభుత్వము అత్యంత శ్రద్ధవహించవలసియున్నది.

ఇప్పటికే +2 స్టేజిలో రెసిడెన్షియల్ కళాశాలలు ప్రవేశించాయి. ఇవి సంపన్నుల సొంతాని కందుబాటులోనున్న సంస్థలే. పేద, మధ్యతరగతి వర్గాలలో చదువుకున్న తెలివైన పిల్లలకు +2 విద్యనందించవలసిన బాధ్యత ప్రభుత్వముపై నున్నది. జూనియర్ కళాశాలలు ఏర్పాటుకు స్థానికులు చెల్లించవలసిన వాటాధనాన్ని చెల్లించలేని ప్రజలు పలుప్రాంతాలలో నున్నారు. ఈ స్థితిలో సహకారరంగానికి జూనియర్ కళాశాల యాజమాన్యాన్ని అప్పగించి తన చేతులు దులుపుకోవటమనేది కేంద్ర ప్రభుత్వమువారు తమ నూతన విద్యావిధానములో సూచించిన స్వయంప్రతిపత్తి గల కళాశాలా విధానాన్ని దొడ్డిదారిన ప్రవేశపెట్టటమే. విద్యారంగాన్ని వ్యాపారరంగముగా మార్చ సిద్ధంగానున్న దళారీల చేతులకు జూనియర్ కాలేజి విద్యను ఒప్పగించుటే. ఇది విద్యార్థులకు, ఉపాధ్యాయులకు నష్టదాయకమైన విధానము. ప్రస్తుతమున్న ఎయిడెడ్ యాజమాన్యాల వ్యాపారధోరణిని చూస్తూనే సహకార జూనియర్ కాలేజిల పేరుతో ఎయిడెడ్ యాజమాన్యాలు విస్తృతంగా విద్యారంగాన్ని వ్యాపారరంగముగా

మార్చే విధానానికి తలుపులు తెరచుటే. ఈ సహకార జూనియర్ కలాశాలా విధానాన్ని ఉపసంహరించుకోవలసిందిగా ఈ మహాసభకోరు తోంది.

### 4. మాతృభాషలో విద్యాబోధన

విద్య మానవునిలో నిద్రాణమైయున్న శక్తులను వెలికితీసేమహత్తర సాధనము. మాతృ భాషద్వారా విద్యాబోధన అత్యధికులు లాభముపొందే ప్రయోగము అభివృద్ధిచెందిన దేశాలన్నింటిలోను ఆయాదేశాల మాతృభాషలోనే విద్యబోధన జరిపి అద్భుతమైన ఫలితాలను సాధిస్తున్నారు. అంతరిక్షయానమువరకు పరిశోధనలు జరిపి శాస్త్రరంగములో పురోభివృద్ధిగాంచుతున్న అన్నిదేశాలలో మాతృభాషద్వారానే విద్యాబోధన జరిపి అతి విలువైన ఫలితాలను పొందుతున్నారు.

కావున ప్రైమరీనుండి యూనివర్శిటీ స్థాయివరకు విద్యాబోధనను మాతృభాషద్వారానే జరుపుటకు అనువగు చర్యలన్నింటిని తీసికోవలసినదిగా ఈ మహాసభకోరుతోంది.

## 5. ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి

రాజ్యాంగవములో 6-14 మధ్య వయసున్నగల బాలబాలికలందరికి విద్యగరపుట మన పవిత్రకర్తవ్యముగా వ్రాసికొన్నాము. కాని ఈ లక్ష్యము చేరటానికి మనము నిర్ణయించుకొనిన గడువుదాటి దాదాపు పది సంవత్సరములు పూర్తికావస్తున్నది. విద్యమానవ ఉత్పాదనాశక్తిని పెంచుటలో తోడ్పడుతుందని శాస్త్రీయ అవగాహన, శాస్త్రీయ పద్ధతిలో విద్యగరపవలసినదశలో గూడ తరగతి గదులలో విద్యార్థి, ఉపాధ్యాయ నిష్పత్తి అత్యంత అశాస్త్రీయముగా నున్నది. ప్రాథమిక, ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయ, విద్యార్థి నిష్పత్తి 1 : 100 కు మించికూడ ఉంటున్నది. ఈ స్థితిమారనిదే మనము ఆశించిన ఫలితాలు సాధించుట సాధ్యముకాదు.

కావున ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తిని ప్రాథమిక పాఠశాలలో 1 : 20 మైదాన ప్రాంతాలలోను 1 : 15 గా గిరిజన ప్రాంతాలలోను, ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలలో 1 : 30గా ఉండాలని, అందుకనుగుణముగా ఉత్తరువు ఇవ్వాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని ఈ మహాసభ కోరుతున్నది.

6) మధ్యాహ్న భోజన పథకము ప్రవేశ పెట్టాలి:-

ప్రాథమిక పాఠశాలలో చేరిన విద్యార్థులలో 80% పైగా సెకండరీ విద్య స్థాయివరకు చేరుటలేదని గణాంక వివరములు తెలియజేస్తున్నవి. దీనికి ప్రధాన కారణము పేదరికము. మన దేశములో 50% పైగా ప్రజానీకము దారిద్ర్యరేఖకు దిగువ అంచుననే బ్రతుకుతున్నారు. ఆ కుటుంబాలవారు తమ పిల్లలను తాము పోషించజాలక వారి పోషణకోసము ఏదో ఒక వృత్తిలో పెడుతున్నారు. 6-14 వయస్సుగల పిల్లలలో ఎక్కువమంది పాఠశాలలకు రాజాలకపోవుచున్నారు.

ఈ విషయాన్ని అర్థముచేసికొని మన పొరుగునున్న తమిళనాడు రాష్ట్రమువారు మధ్యాహ్నభోజన పథకాన్ని ప్రవేశపెట్టి సత్ఫలితాలను పొందుతున్నారు.

1982లో ప్రవేశపెట్టిన ఈ పథకాన్ని నిర్వహణలోని లోపాలను దృష్టిలో పెట్టుకొని రద్దుచేసినది. నిర్వహణ లోపాలను సరిచేసుకొని పథకాన్ని అమలు జరుపుట ద్వారా సత్ఫలితాలు సాధించుట సాధ్యము. గుజరాత్, బెంగాలు రాష్ట్రాలలో ఈ పథకము ప్రవేశపెట్టారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు తోటి రాష్ట్ర ప్రభుత్వాలు నిర్వహిస్తున్న ఈ పథకాన్ని తిరిగి ప్రవేశ పెట్టవలసినదిగా ఈ మహాసభ కోరుతున్నది.

7) పాఠశాల భవనాల నిర్మాణము తక్షణము చేపట్టాలి :

ఈనాటికి ఆంధ్రప్రదేశ్‌లో వేలాది ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలలు చెట్లక్రింద, గొడ్లసావిళ్లలో నడుపబడు తున్నవి. ప్రకృతి దయాదాక్షిణ్యాలపై ఈ పాఠశాలలు నడవాల్సిన స్థితి. కొన్ని పాఠశాలల భవనాలు జీర్ణస్థితిలో నున్నవి. పక్కాపాఠశాల భవనములు లేకుండా పాఠశాలలు సక్రమముగా నిర్వహింపబడుట సాధ్యముకాదు. ఈ విషయాన్ని గత విద్యా మహాసభలో సూచనలతోనొక తీర్మానాన్ని రూపొందించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికందజేయబడినది. పురోభివృద్ధి కొంతయున్నా ఇదిచాలదు. 5 సంత్సరాలలో అన్ని పాఠశాలలకు భవనాలను సమకూర్చేందుకు సంవత్సరానికి బడ్జెట్‌లో 30 కోట్లు కేటాయిస్తూ ప్రణాళికను తయారు చేసి అమలుపరచవలసినదిగా కోరుతూ తీర్మానిస్తున్నది.

### 8) విద్యార్థులకు పాఠ్యపుస్తకాలను ఉచితముగా సరఫరా చేయాలి :-

జాతీయ పాఠ్యపుస్తకములను ప్రస్తుతము యస్.సి. యస్.టి. విద్యార్థులకు ఉచితముగా సరఫరా చేయుచున్నారు. బి.సి. విద్యార్థులకు చూడ కొన్ని సందర్భాలలో సరఫరా చేస్తున్నారు. రాష్ట్రములోని బాలబాలికలందరికి ఉచితముగా పాఠ్యపుస్తకములు సరఫరా చేసిన 8, 9 కోట్ల రూ.ల మించి ఖర్చుకాదు. ఇది ఉపయుక్తమైనది. పాఠశాలల పునః ప్రారంభము నాటికే పాఠశాలల అవసరములను మదింపుచేసి పాఠ్యపుస్తకాలను సకాలములో సరఫరాచేయుటవలన పుస్తక విక్రేతల నల్లబజారు వ్యాపారాన్ని అరికట్టగలుగుటేకాక ప్రతి విద్యార్థి పాఠ్యపుస్తకము సంపాదించలేక ఇబ్బందులపాలయ్యే పరిస్థితిని అరికట్టగలము. విద్యా వ్యాసంగము సక్రమముగా సాగుటలో ఎదురయ్యే ప్రధానమైన అడ్డంకిని తొలగించుటలో కృతకృత్యులమౌతాము.

కావున విద్యార్థులందరికి జాతీయ పాఠ్యపుస్తకాలను ప్రభుత్వమే నేరుగా ఉచితముగా సరఫరా చేసే కార్యక్రమాన్ని చేపట్టవలసినదిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతూ ఈ మహాసభ తీర్మానిస్తున్నది.

### 9) పాఠశాలలకు స్పెషల్ ఫీజు రీ ఇంబర్స్‌మెంట్ విధిగా జరగాలి :-

ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలలో సహవిద్య, (కోకరిక్యులర్), విద్యేతర (ఎక్స్‌ట్రా కరిక్యులర్) కార్యక్రమముల నిర్వహణ నిమిత్తము విద్యార్థులనుండి వసూలు చేయు స్పెషల్ ఫీజులను ఎస్.సి., ఎస్.టి., బి.సి., విద్యార్థులకు మినహాయింపునిస్తున్నారు. ఆ కార్యక్రమాల నిర్వహణకు వసూలయ్యే నిధులు గణనీయముగా తగ్గి ఆకార్యక్రమాల

నిర్వహణ కుంటుపడుతున్నది. ఈ విద్యార్థులనుండే మినహాయించే ఫీజులను ప్రభుత్వమువారు విధిగా ప్రతి సంవత్సరము పాఠశాలలకు తిరిగి చెల్లించవలసినదిగా ఈ మహాసభ కోరుతున్నది.

10) ఉపాధ్యాయులకు ఆర్థిక సెలవును సంవత్సరానికి 20 రోజులివ్వాలని ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతోంది.

11) మహిళా ఉద్యోగినులకు ప్రస్తుతమిస్తున్న ప్రసూతి సెలవును 90 రోజుల నుండి 180 రోజులుగా సవరించాలని టెంపరరీ, పర్మనెంట్ ఉద్యోగులనే భేదభావాన్ని చూపరాదని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతోంది.

12) ఎయిడెడ్ ప్రైమరీ ఉపాధ్యాయులకు ఆంధ్రప్రదేశ్ సెలవునిబంధనలు 1933 ను వర్తింపజేయాలని కోరుతున్నాము.

13) ఉపాధ్యాయులు, ఉద్యోగులు తాము రిటైరయిన సందర్భములో నగదును పొందుటకు వీలున్న ఆర్థిక సెలవు పరిధిని 180 రోజులనుండి 240 రోజులుగా మార్చాలని కోరుతున్నాము.

14) ఉపాధ్యాయుల, ఉద్యోగుల కనీస పెన్షన్‌ను రు.375లుగా ప్రకటించాలి. కమ్యూటేషన్, గ్రాట్యుటీ గరిష్ఠ పరిమితులను కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులతో సమానముగా పెంచాలి.

15) పెన్షనర్లకు 1-7-86 నుండి ఇవ్వవలసిన రిలీఫ్‌ను జీవన వ్యయసూచిక పెరుగుదలను గమనించి వెంటనే మంజూరీ చేయుట సాధారణ న్యాయమని ఈ మహాసభ గుర్తిస్తున్నది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు వెంటనే పెన్షనర్లరిలీఫ్ ప్రకటిస్తూ ఉత్తరువులీయవలసినదిగా కోరుతోంది.

16) ప్రభుత్వరంగ సంస్థలు, కేంద్ర ప్రభుత్వం తన ఉద్యోగులకు బోనస్ చెల్లింపును అంగీకరించి చెల్లిస్తున్నది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు తన ఉద్యోగులు, ఉపాధ్యాయులకు సంవత్సరమునకు ఒక నెల వేతనము బోనస్‌గా ప్రకటించి చెల్లించాలని ఈ మహాసభ కోరుతోంది.

17) పేరివిజన్ కమీషన్ ఉత్తరువులందరికీ సమానముగా వర్తించాలి.

ఎ) 1986 వేతన సవరణ సిఫార్సులలో ఉపాధ్యాయులు, ఉద్యోగులందరికి 10, 15, 22 సంవత్సరముల ఆటోమాటిక్ అడ్వాన్సుమెంటు స్కీమును సిఫారసు చేసినది. ఈ స్కీమును ఉద్యోగులకు వర్తింపజేస్తూ ఉత్తరువులిచ్చారు. ఉపాధ్యాయుల విషయములో వివక్షతను పాటించుట తగదని, వెంటనే 10, 15, 22 సంవత్సరముల ప్రమోషన్ ఉత్తరువులు విడుదల చేయవలసినదిగా ప్రభుత్వాన్ని ఈ మహాసభకోరుతోంది.

బి) ఎయిడెడ్ ఉపాధ్యాయులకు 1986 రివైజ్డ్ వేతనములను వర్తింపచేస్తూ ఉత్తరరువు లిచ్చారు. ప్రభుత్వ, పంచాయతీరాజ్ ఉపాధ్యాయులకిచ్చిన 600 రూ.ల అడ్‌హక్ పేమెంటును ఎయిడెడ్ ఉపాధ్యాయులకిస్తూ ఉత్తరువులీయ వలసినదిగా ప్రభుత్వాన్నిన్ని ఈ మహాసభ కోరుతోంది.

సి) 1986 వేతన సిఫారసులను నాన్‌గెజిటెడ్ ఉద్యోగులకు వర్తింపచేయు సందర్భములో తాత్కాలిక భృతిలో రు.25 లు, రు.30 లను వేతన స్థిరీకరణ సందర్భములో కలిపి వేతన నిర్ణయము చేశారు. ఇదే లాభాన్ని ఉపాధ్యాయులకుకూడ కలుగజేస్తూ ఉత్తరువులీయ వలసినదిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని ఈ మహాసభ కోరుతోంది.

డి) వేతన నిర్ణయ కమీషనర్ సిఫారసు చేసిన విధముగా 1550-3050 స్కేలులో పని చేస్తున్న ఉపాధ్యాయులు, ఉద్యోగులందరికీ అటెండరు అలవెన్సు రు.200 లు మంజూరు చేయవలసినదిగా ఈ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతోంది.

**18. సర్వీసుల క్రమబద్ధీకరణ**

(ఎ) జిల్లా ఎంపిక కమిటీ ద్వారా ఎంపికయై నియామకము జరగలేదన్న నెపముతో 10, 15 సంవత్సరములుగా రెగ్యుల రైజ్ కాని వివిధ జిల్లాలలోని పంచాయతీరాజ్ వుపాధ్యాయుల సేవలను వారి నియామకపు తేదీ నుండి క్రమబద్ధీకరించు టకు ఉత్తరువులీయవలసినదిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని ఈ మహాసభ కోరుతుంది.

(బి) అభ్యుదయ పాఠశాలల్లో నియమింపబడిన ఉపాధ్యాయుల సేవల క్రమబద్ధీకరణ వారి నియామకపు తేది నుండి జరపాలని, వారి సేవలకు 100% గుర్తింపునిస్తూ వుత్తరువులీయవలసినదిగా ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది

(సి) ఉద్యోగుల సర్వీసుల క్రమబద్ధీకరణకు వుద్యోగి పూర్వ నడవడికకు సంబంధించిన రిపోర్టులు పోలీసు డిపార్టుమెంటు నుండి అందలేదనే నెపముతో సంవత్సరాల తరబడి సేవల క్రమబద్ధీకరణ నిలిపివేయబడుచున్నవి. వెల్లొడి కమీషన్ వారు పోలీసు పరిశీలనా రిపోర్టులు సర్వీసు రెగ్యులరైజేషన్‌కు అవసరములేదని సిఫారసు చేశారు. ఆ సిఫారసులను అమలుపరుస్తూ సర్వీసుల క్రమబద్ధీకరణకు వుత్తరువులీయ వలసినదిగా ఈ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతోంది.

19) ప్రభుత్వము గతములో రూపొందించిన వుత్తరువుల ప్రకారము పోస్టుమంజూరీ అయిన తరువాత బాలికలు, బాలుర పాఠశాలల్లో 3 సం॥లు, 5 సం॥ల అన్ ఎయిడెడ్ పోస్టులుగా కొనసాగిన పోస్టులన్నింటిని గ్రాంటు-ఇన్-ఎయిడ్‌కు అనుమతించాలి. ఒకసారి గ్రాంటు-ఇన్-ఎయిడ్ అనుమతింపబడిన పోస్టులకు గ్రాంట్లను నిరవధికముగా మంజూరు చేయాలని ప్రభుత్వాన్ని ఈ మహాసభ కోరుతోంది.

20) ఎయిడెడ్ పాఠశాలల భౌతిక వనరుల అభివృద్ధి పేరుతో ప్రతి విద్యార్థి నుండి నెలకు 5 రూ॥లు చొప్పున వసూలు చేయుటకు అవకాశాన్నిస్తూ ప్రభుత్వము 37 విద్య తేది 6-2-1982 ఉత్తరువునిచ్చింది. ఎయిడెడ్ యాజమాన్యాలు అడ్మిషన్ల సందర్భములో జరిపే వసూళ్ళు చట్టబద్ధముగా చేసికునేందుకు ఉపయోగపడుతోంది ఉత్తరువు. యాజమాన్యాలు ఈ నిధులకు భారీగా దుర్వినియోగ పరచటానికి అవకాశముంది. తల్లిదండ్రులపై ఆర్థికభారాన్ని పెంచే ఈ వుత్తరువును ఉపసంహరించవలసిందిగా ఈ మహాసభ కోరుతోంది.

21) ప్రస్తుతము కొనసాగుతున్న బడ్జెటరీ పద్ధతి ప్రకారము ఎయిడెడ్ పాఠశాలలలో పనిచేస్తున్న ఉపాధ్యాయులు ప్రతి సంవత్సరం నెల రెండు నెలలు ఆలస్యముగా జీతాలు పొందుతున్నారు. ఈ కారణముగా వారి కుటుంబాలు ఆ కాలములో ఆర్థిక ఇబ్బందులకు

గురౌతు స్నారు. ఎయిడెడ్ ఉపాధ్యాయుల జీతాలను నాన్ బడ్జెటరీ అంశముగా ఆమోదించి డైరక్టు పేమెంటును సులభతరము చేసి ప్రతినెల సకాలములో జీతాలు చెల్లించబడుటకు తగు చర్యలు తీసికోవలసినదిగా ప్రభుత్వాన్ని ఈ మహాసభ కోరుతోంది.

22) ఎయిడెడ్ ఉపాధ్యాయుల జీతములు, బకాయిలు చెల్లించు సందర్భములో లోగడ ట్రజరీ కంట్రోలు అవసరము లేకుండా ఉత్తర్వు యిచ్చి వున్నారు. తిరిగి గత సంవత్సరం నుండి దానిని అమలు జరుపుచున్నారు. అందు వల్ల గ్రాంటు రిలీజు అయినా ఉపాధ్యాయులు జీతములు పొందలేక చాల నష్టపోవుచున్నారు. లోగడ వలె ట్రజరీ కంట్రోలు లేకుండా జీతములు చెల్లించ కోరు చున్నాము.

23) ఎయిడెడ్ యాజమాన్యాలలో ఎక్కువ సంఖ్య విద్యా చట్టములోని నిబంధనలను అతిక్రమించి నిధులను దుర్వినియోగము చేయుట, ఉపాధ్యాయులను అకారణముగా వేధించుట, ప్రభుత్వ మరియు డిపార్టుమెంటువారి వుత్తరువులను వుల్లంఘిస్తూ ప్రవర్తిస్తున్నారు. నిబంధనలకు వ్యతిరేకముగా ప్రవర్తించి ప్రభుత్వ వుత్తరువులను వుల్లంఘించిన యాజమాన్యాలపై ప్రాధమిక విచారణలో ఋజువులున్న వెంటనే ఆ యాజమాన్యాన్ని సస్పెండు చేసి స్పెషల్ ఆఫీసరును నియమించుటకు, సమగ్ర విచారణలో దోషియని తేలిన ఆ యాజమాన్యాన్ని రద్దుపరచి ప్రభుత్వమూ పాఠశాలలను స్వాధీనము చేసికొనుటకు వీలుగా ఎయిడెడ్ విద్యా చట్టాన్ని సవరించవలసినదిగా ఈ మహాసభ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తోంది.

24) ప్రొవిన్షియలైజేషన్ ఫలితముగా పంచాయతీరాజ్ వుపాధ్యాయులకు ప్రభుత్వ వుపాధ్యాయులతో సమానముగా రావలసిన అన్ని సౌకర్యాల అమలుకు, ప్రమోషన్లు పొందుటకు అనుకూలముగా నియమ నిబంధనలు రూపొందించి అమలు జరపవలసినదిగా ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతోంది.

25) గ్రూపు ఇన్సూరెన్సు పథకము అమలుకు వుపాధ్యాయుల వుద్యోగుల స్కేళ్లను గ్రూపులుగా విభజించుట జరిగినది. 1986 వేతన పునః పరిశీలన తరవాత గతములో చేసిన గ్రూపుల విభజనలో ఎంతో మార్పు వచ్చినది. నూతన స్కేళ్ళు ఆధారముగా గ్రూపుల పునర్విభజన జరిపి గ్రూపు ఇన్సూరెన్సు పథకాన్ని అమలుపరచుటకు వుత్తరవులీయ వలసినదిగా ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది.

26) రీ గ్రూపింగ్ స్కేల్సులో అదనపు అర్హతలకు అదనపు ఇంక్రిమెంట్లను మంజూరీచేయవలసినదిగా ఈ మహా సభ విజ్ఞప్తి చేస్తోంది.

27) క్యాటగిరి - 2 వుపాధ్యాయులకు, కేటగిరి - 3 వుపాధ్యాయులవలె టెస్టుపాస్ అగుటకు 1990 వరకు అవకాశ మిస్తూ వారిలో 1-12-82 నాడు మరియు తదుపరి 15 సంవత్సరాలు నిండిన వారికి 15 సంవత్సరాల స్కేలునిస్తూ వుత్తరవులీయవలసినదిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాము:

28) ప్రధమశ్రేణి భాషా పండితులకు 15 సంత్సరముల స్కేలునకు నిర్వహిస్తామన్న పరీక్షను సిలబస్ ప్రకటించి వెంటనే నిర్వహించాలి. క్యాటగిరి-3 వుపాధ్యా యుల వలె వీరికి 1990 లోపుల 1-12-82 నాడు ఆ తదుపరి 15 సంవత్సరము స్కేలునకు అర్హులైన వారందరికి 15 సంవత్సరాల స్కేలునిస్తూ వుత్తరవులివ్వాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది.

29) బి.ఇడి. గ్రేడు-1 భాషాపండితుల, బి.పి ఇడి అర్హత గల వారి పోస్టులన్నింటిని అప్‌గ్రేడ్ చేయవలసినదిగా ఈ మహాసభ కోరుతోంది.

30) తెలంగాణా ప్రాంతములో ప్రభుత్వ ఉత్తరువు 8 ప్రకారము జిల్లా పరిషత్తులలో విలీనము చేసికొనిన వారికి వారి జూనియర్ పొందుచున్న స్కేలును సూపర్ న్యూమరరీ పోస్టుగా సృష్టిస్తూ ఉత్తరువులివ్వాలి

31) జూనియర్ కాలేజీలలో విలీనము చేసికొనిన వారికి 1974 నుండి సెలెక్షన్ గ్రేడ్ పోస్టులను సూపర్ న్యూమరరీ పోస్టులుగా సృష్టించి వారికి ప్రమోషన్ల నివ్వాలి.

32) 1-4-74 నాడు 200 - 240 సెలెక్షన్ గ్రేడ్ పొందినవారు అదే స్కేలులో 1-4-75 వరకు కొనసాగి ఇంక్రిమెంటును పొందిన తదుపరి 1974 స్కేళ్లలో 290-520 స్కేలులో వేతన నిర్ణయాన్ని చేయించుకొనుట కనుమతిస్తూ ఉత్తరువు లీయవలసినదిగా ఈ మహాసభ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తోంది.

33) తెలంగాణా ప్రాంతములో 26-421/2, 30-60 స్కేళ్లలో నియమింప బడిన మెట్రిక్యులేట్ ఉపాధ్యాయులకు నియామకము తేదీ నుండి 45-90 స్కేలులో 45లు వేతనమిస్తూ ఉత్తరువు లీయవలసినదిగా ప్రభుత్వాన్ని ఈ మహాసభ కోరుతోంది.

34) ప్రధానోపాధ్యాయులకు వారు ప్రధానోపాధ్యాయుని ప్రమోషన్ పొందిన తేదీ నుండి సర్వీసు లెక్కించి 15 సంవత్సరాల స్కేలివ్వాలని ఈ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతోంది.

35) క్యాటగిరి-2, క్యాటగిరి-3 ఉపాధ్యాయుల రీగ్రూపింగ్ స్కేళ్లలోనికి 1-12-82 నాడు వచ్చినవారికి ఇంక్రి మెంటు అనుమతించిన విధముగానే 1000 [S] లో క్యాటగిరి-1 అయిన ప్రధానోపాధ్యాయులు 1-12-82 నాడే 900-1500 స్కేలులోనికి వచ్చినట్లుగా సవరిస్తూ ఇంక్రిమెంటు తేదీకి ఇంక్రిమెంటును అనుమతించవలసినదిగా ఈ మహాసభ పక్షాన ప్రభుత్వాన్ని కోరుతున్నాము.

36) తెలంగాణా ప్రాంతములో సెకండరీ పాఠశాలలో ప్రధానోపాధ్యాయుని పోస్టును 13-3-70 నుండి సృష్టించారు. ఆనాడున్న ప్రత్యేక పరిస్థితులవలన 30-6-72 వరకు అక్కౌంటు టెస్టుపాస్ అగుటకు అనుమతిస్తూ 7 సంవత్సరముల సర్వీసు స్కూలు అసిస్టెంటుగా నున్నవారిని ప్రధానోపాధ్యాయులుగా ప్రమోటు చేశాడు. ప్రత్యేక పరిస్థితుల దృష్ట్యా 1974 ఆగస్టు వరకు అక్కౌంట్ టెస్టు పాస్ అగుటకు అవకాశాన్నిస్తూ వారి సేవలను సీనియారిటీ మరియు తదితర ప్రయోజనాలకు అర్హమైన సర్వీసుగా పరిగణించాలని ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతోంది.

37) ఉన్నత పాఠశాలల ప్రధానోపాధ్యాయులకు విధి నిర్వహణకు గాను గతములో (ప్యానల్-నాన్‌ప్యానల్) విధి నిర్వహణ అలవెన్సు అమలులో నుండెడిది. అన్ని రాష్ట్రాలలోను

ప్రధానోపాధ్యాయుని విధి నిర్వహణ అలవెన్సు 100 రూ||ల నుండి రూ. 200 లుగా కొనసాగుతున్నది. కావున ప్రధానోపాధ్యాయుని విధి నిర్వహణ అలవెన్సును 100 రూ||లుగా పునరుద్ధరించవలసినదిగా ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతోంది.

38) ప్రాధమిక, ప్రాధమికోన్నత, ఉన్నత పాఠశాలల ప్రధానోపాధ్యాయుని విధి నిర్వహణా అలవెన్సును ప్రత్యేకంగా పరిగణించి పెన్షన్ లెక్కింపులో పరిగణనలోనికి తీసికోవలసి నదిగా ఈ మహాసభ కోరుతోంది.

39) 1983 లో కన్సాలిడేటెడ్ పోస్టులను సృష్టించే సందర్భములో క్యాటగిరి-3 స్కేలు కనీసవేతనములో 75%ను కన్సాలిడెటెడ్ పోస్టువేతనము రు.398 లుగా నిర్ణయించారు. ధరల పెరుగుదల భారాన్ని తట్టుకోవటానికి స్కేలులో పనిచేయువారికి కరువు భత్యము పెంపు రూపములో ప్రతిఫలమునందిస్తున్నారు. ధరల పెరుగుదల ప్రభావము కన్సాలిడేటెడ్ వేతనము పొందే ఉపాధ్యాయునిపై గూడ అదే భారాన్ని కలిగిస్తుంది. ధరల పెరుగుదల వలన కలిగే ఆటుపోటులను తట్టుకొనివారు పనిచేయాలంటే క్యాటగిరి-3 స్కేలులోని కనిష్ట వేతనము 1010 రూ||లను వారికి వేతనముగా నివ్వాలని ఈ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతోంది.

40) ఏకోపాధ్యాయ పాఠశాలలన్నింటిని బహుళో పాధ్యాయ పాఠశాలలుగా మార్చాలని ఈ మహాసభ కోరుతోంది.

41) పార్టుటైమ్ కంటింజెంట్ ఉద్యోగుల భృతిని రూ.75-00 లు నుండి రూ. 200-00 లుగా మార్చాలి. కంటింజెంట్ ఉద్యోగుల వేతనాలు అన్ని ప్రాంతాలు యాజమాన్యాలలో ఒకేవిధముగా నుండునట్లు ఉత్తరువు తీయాలని ప్రభుత్వాన్ని ఈ మహాసభ కోరుతోంది.

42) ఇ.యల్.టి.సి. సెంటర్లలో శిక్షణ పొందు ఉపాధ్యాయులకు ఎ.పి.టి.ఎ. రూల్సు ప్రకారము టి.ఎ.డి.ఏ.లు చెల్లించాలని ప్రభుత్వాన్ని ఈ మహాసభ కోరుతోంది.

43) అవసరాలున్న పాఠశాలకు అవసరాలకు మించి ఉపాధ్యాయులున్న పాఠశాలల నుండి పోస్టుల బదలాయింపు ద్వారా ఆ పాఠశాలల అవసరాలను తీర్చాలితప్ప డెప్యుటేషన్ల పేరుతో ఉపాధ్యాయులకు ఒక పాఠశాల నుండి మరొక పాఠశాలలో పనిచేయించు విధానానికి స్వస్తి చెప్పాలని ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతోంది.

44) అప్‌గ్రేడ్ చేయబడిన ఉపాధ్యాయులకు రెగ్యులర్ పోస్టులలో విలీనము చేయునపుడు యఫ్.ఆర్ 22బిని వర్తింప చేయాలని ఈ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతోంది.

45) సమస్యల పరిష్కారానికి మండల, జిల్లా, రాష్ట్ర స్థాయిలతో ఉపాధ్యాయ సంఘాల ప్రతినిధులతో సమస్యలు సంఘ సమావేశాలను మూడు నెలల కొక పర్యాయము జరుపుటకు ఉత్తరువు లియ్యవలసినదిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని ఈ మహాసభ కోరుతోంది.

46) ట్రైబల్ వెల్‌ఫేర్ టీచర్ల సర్వీస్ నిబంధనలను ఎడ్యుకేషనల్ సబార్డినేట్ సర్వీస్ రూల్స్‌లో చేర్చాలి.

రాష్ట్రంలోని విద్యాశాఖ మరియు జిల్లా పరిషత్ యాజమాన్యంలో పనిచేస్తున్న ఉపాధ్యాయుల సర్వీస్ నిబంధనలు జి.ఓ. 278 విద్యాశాఖ (డి), తేదీ: 20.6.83 ద్వారా రూపొందించబడి "ది ఆంధ్రప్రదేశ్ ఎడ్యుకేషనల్ సబార్డినేట్ సర్వీస్ రూల్స్" పేరుతో అమల్లో వున్నవి.

ఈ రూల్సు ప్రకారం విద్యాశాఖలో పనిచేస్తున్న ఉపాధ్యాయుల సర్వీస్ నిబంధనలు పార్ట్-1 గాను మరియు జిల్లా పరిషత్ యాజమాన్యంలోని ఉపాధ్యాయుల నిబంధనలు పార్ట్-2 గానూ వర్గీకరింపబడినవి.

కాని రాష్ట్రంలోని ఏజన్సీ ప్రాంతాలలో గిరిజన సంక్షేమ శాఖ ద్వారా నియమింపబడి పనిచేస్తున్న వేలాది ఉపాధ్యాయుల సర్వీస్ నిబంధనలు ఇంతవరకు ఏ పార్ట్‌లోనూ పేర్కొనలేదు.

కనుక ఇకనైనా ప్రభుత్వం ఈ విషయమును పరిశీలించి గిరిజన విద్యాసంస్థలు ప్రభుత్వ శాఖచే నడుపబడుచున్నవి గనుక ట్రైబల్ వెల్‌ఫేర్ టీచర్ల సర్వీస్ నిబంధనలను ఎడ్యుకేషనల్ సబార్డినేట్ సర్వీస్ రూల్స్‌లో పార్ట్-3 గా చేర్చి రెగ్యులరైజ్ చేయవలసినదిగా కోరుతున్నాము.

47) గిరిజన సంక్షేమ శాఖలోని అన్‌ట్రైయిండ్ టీచర్లకు శిక్షణా అవకాశం కల్పించాలి.

గిరిజన విద్యాభివృద్ధి కొరకు ఏజన్సీ ప్రాంతాలలోని గిరిజన సంక్షేమ శాఖ (ఐ.టి.డి.ఏ.) పాఠశాలల్లో పని చేయుటకు ఆనాడు శిక్షణ పొందినవారు లభించనందున 1980 వరకు అశిక్షితులైన వారిని కూడ ఉపాధ్యాయులుగా నియమించటం జరిగింది. వారిలో కొందరికి 1980 లో టి.ఎస్.ఎల్.సి పేరుతో ప్రభుత్వ ఖర్చుతోనే శిక్షణ ఇవ్వటం జరిగింది. మరి కొందరు తమ స్వయంకృషితో శిక్షణ పొందినారు.

కాగా ఏ విధమైనా శిక్షణా అవకాశం లభించనందున ఇంకనూ కొందరు అశిక్షితులుగానే కొనసాగుచున్నారు. 15, 20 సం.ల సర్వీస్ వున్నవారు కూడ కనీసవేతనంలో వుంటున్నారు. ఇకనైనా వీరి అందరికి వెంటనే శిక్షణ అవకాశం కల్పించవలసిందిగా ఈ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతున్నది.

48) ఏజన్సీ ప్రాంతములో గతములో 20 శాతం స్పెషల్ ఇంటి అద్దె, 20 శాతం స్పెషల్ కాంపెన్‌సేటరి అలవెన్సు, 10 శాతం బి.సి.ఎ. యిచ్చేడివారు. ప్రభుత్వం ఒకటి మాత్రమే అమలు జరిపింది. మిగిలినవి కూడా అమలు జరిపించ కోరుతున్నాము.

49) గిరిజన సంక్షేమ పాఠశాలలలో పనిచేయుచున్న పోస్టు గ్రాడ్యుయేట్సుకు జూనియర్ లెక్చరర్సుగా ప్రమోషను అవకాశాలు కల్పించాలి

50) గిరిజన సంక్షేమ పాఠశాలల యందలి, ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలల ఉపాధ్యాయులకు చెక్ డ్రాయింగ్ అధికారం యివ్వాలి

51) గిరిజన పాఠశాలల ఉపాధ్యాయుల ఇంటి అద్దె తదితర బకాయిలు వెంటనే చెల్లించాలి.

52) ఏజన్సీ ప్రాంతములో లోగడ నియమించిన పోస్టులు ముఖ్యముగా తూర్పు గోదావరి జిల్లాలో పండిట్స్ పోస్టులు, రెగ్యులర్ పోస్టులుగా మార్చి వారి సర్వీసు క్రమబద్ధీ కరణ చేయించ కోరుచున్నాము.

53) వివిధ ఉపాధ్యాయ పోస్టులలో నియమించుటకు అశాస్త్రీయమైన డి.యస్.సి. విధానము తొలగించి శిక్షణ పొందిన వారిని వారి ఎంప్లాయిమెంటు సీనియారిటీ ఆధారంగా ఉద్యోగములో నియమించాలి.

54) మెడికల్, ఇంజనీరింగ్, బి.ఇడి, సెకండరీ గ్రేడు మొదలగు చదువులకు వారి సర్టిఫికెట్సుకు విలువ యివ్వకుండా ఎంట్రన్స్ పెట్టడం సరియైన విధానము కాదు. కనీసం వారు చదివిన చదువుకు 50 శాతం, ఎంట్రెన్స్‌లో 50 శాతం మార్కులు వుండునట్లు నిర్ణయించ కోరుచున్నాము.

55) ఇటీవల విజయవాడ సంఘటన సమయంలో కృష్ణ, గుంటూరు, ఉభయగోదావరి జిల్లాలలో ఉపాధ్యాయుల సర్వీసు రిజిష్టర్లు తగులబడి పోయినవి. వాటిని వెంటనే ఓపెన్ చేయుటకు తగు ఉత్తర్వులు యిప్పించ వలసినదిగా కోరు తున్నాము.

56) ప్రభుత్వం లోగడ పెంచిన రెండు సార్ల డి.ఎ.ను బ్యాంకులలో నిల్వచేసి, వడ్డీతో ఉపాధ్యాయులకు చెల్లిస్తామని ఉత్తర్వులు యిచ్చింది. కొన్ని మానేజిమెంట్లు అలసత్వ కారణంగాను, ఎయిడెడ్ స్కూల్సుకు ప్రభుత్వమే డి.ఎ.లు చెల్లించని కారణంగాను, బ్యాంకులలో జమ చేయలేదు. ఆ కారణంగా ఉపాధ్యాయులు నష్టపోవుచున్నారు. ప్రభుత్వమే బాధ్యత వహించి ఇంటెరిండెడ్ డి.ఎ. పై అందరికి వడ్డీ చెల్లించాలని ఆ సమావేశం ప్రభుత్వాన్ని కోరుతున్నది.

57) ఎయిడెడ్ ఉపాధ్యాయులు టి.పి.యఫ్. ఖాతాలు సక్రమముగా జమకాక ఉపాధ్యాయులు చాల నష్టపోవు చున్నారు. ప్రతి నెల రెగ్యులరుగా జమ అగునట్లు కట్టుదిట్ట మయిన ఏర్పాట్లు చేయించ కోరుచున్నాము.

మరియు సదరు ఖాతాలకు 5 శాతం వడ్డీ మాత్రమే యిస్తున్నారు. ఇతర టి.పి.యఫ్.లకు 12 శాతం వడ్డీ యిస్తున్నారు. పోస్టలు సేవింగ్సుకు కూడా 12 శాతం వడ్డీ యిస్తున్నారు. ఈ టి.పి.యఫ్. కు కూడా 12 శాతం వడ్డీ వచ్చు ఏర్పాట్లు చేయించ కోరుచున్నాము.

58) ఎయిడెడ్ మానేజిమెంట్లు అక్రమంగా తొలగించిన ఉపాధ్యాయులను చేర్చుకొనాలని విద్యాశాఖాధికారులు ఉత్తర్వులు యిచ్చినా సకాలంలో తిరిగి పాఠశాలలలో చేర్చుకొనుట లేదు. అందుచేత ఉపాధ్యాయులు ఆర్థికంగా యిబ్బందులు పాలగు చున్నారు. అట్టివారికి ప్రత్యేక ఏర్పాటు ద్వారా జీతములు యిప్పించు ఏర్పాటు చేయించ కోరుచున్నాము.

59) ఎయిడెడ్ ఉపాధ్యాయులకు వేరే మానేజిమెంట్లకు మార్చిన సందర్భంలో వారి సర్వీసు బ్రేకు పీరియడు ఉదా: రాజమండ్రి విశ్వతేజ, అనకాపల్లి బేతాల్ స్కూలు డ్యూటీగా పరిగణించి జీతములు యిప్పించ కోరుచున్నాము.

60) ఉపాధ్యాయులకు, స్వీపర్లకు యిస్తున్న కంటెన్‌జెన్సీ రేట్లు రాష్ట్ర వ్యాప్తంగా ఒకే విధముగా లేవు. ఉపాధ్యాయులకు రు.0.31 నుండి 25/- వరకు వున్నాయి. స్వీపర్లకు రు.0.75 నుండి రు.150/- ల వరకు వుంది. వాటిని రాష్ట్రమంతటా ఒకే విధముగా వుండునట్లు మార్పించాలని, కంటెన్‌జెన్సీ గ్రాంటు, నేటి జీతముల గ్రాంటులో 10 % గా విడుదల చేయాలని ఈ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతున్నది.

61) 1986 పి.ఆర్.సి.లో ఫిట్‌మెంట్ ఫార్ములాలో తేడాలు వున్నవి. అలవెన్సులలో ఎట్టి మార్పులు లేవు. సదరు అనామలీస్ సవరించాలని, నటరాజ్ కమిటీని నియ మించినా, వారికి మెమొరాండము యిచ్చినా యీనాటికి సదరు రిపోర్టు రాలేదు. వెంటనే అనామలీస్ కమిటీ రిపోర్టు రప్పించి అమలు జరపించ కోరుతున్నాము.

62) జైలు పాఠశాలలలో పనిచేయుచున్న ఉపాధ్యాయులకు 1982 లో రీగ్రూపింగ్ అమలు జరుగని కారణంగా వారి జీతములు రు. 530/- రు. 700/- లు కాలేదు. ఆ కారణంగా 1986 పే రివిజన్‌లో వారికి రు. 1010/- రు. 1280/- గా నిర్ణయించక తక్కువ యిచ్చి వున్నారు. ఈ అన్యాయాన్ని సవరించి వారికి కూడా యితర ఉపాధ్యాయుల వలె రీగ్రూపింగ్ వర్తింపజేసి, జీత నిర్ణయం చేయించ కోరుచున్నాము.

63) ప్రభుత్వము వివిధ సందర్భములలో సెకండరీ గ్రేడు పోస్టులలో పనిచేయుచున్న వారికి 1.1.76 నుండి బి.ఇ.డి. స్కేలు యిస్తూ, వారిని రాబోవు ఖాళీ పోస్టులలోనికి అబ్జార్బు చేయాలని ఉత్తర్వులు యిచ్చి వున్నది. అలాగే భాషా పండితులకు 10-8-83 నుండి గ్రేడు - 1 స్కేలు యిచ్చి వున్నది. వారందరూ స్కేలు తీసుకొనుచున్నా సర్వీసు లెక్కింపబడక నష్టపోవుచున్నారు. వారందరి పోస్టులు ఎట్టి మినహాయింపులు లేకుండా బి.ఇ.డి., మరియు గ్రేడు - 1 పండిట్ పోస్టులుగా పరిగణిస్తూ ఉత్తర్వులు యిప్పించ కోరుతున్నాము.

64) క్రీడలలో మనదేశ దౌర్భాగ్యస్థితి వేరే చెప్పనక్కర లేదు. దానిని సరిచేయుటకు ప్రాథమిక స్థాయి నుండి వ్యాయామ విద్యను నిర్బంధ బోధనాంశంగా చేసి, ప్రతి పాఠశాలకు ఒక వ్యాయామోపాధ్యాయుని చొప్పున నియమించాలని యీ సమావేశము ప్రభుత్వాన్ని కోరుతున్నది.

65) చాలా పాఠశాలల్లో మరుగుదొడ్లు, మంచినీరు లాంటి కనీస సౌకర్యాలు కూడా లేవు. కనీసం మహిళా ఉపాధ్యాయినులు, విద్యార్థినులు ఉన్న పాఠశాలలో నయినా మరుగుదొడ్లు నిర్మింప జేయాలని కోరుచున్నాము.

66) గతంలో గ్రేడు-1 భాషా పండితులకు ప్యానల్ ప్రధానోపాధ్యాయుల పోస్టునకు ప్రమోషను చేయు అవకాశం వుండెడిది! దానిని ఇటీవల రద్దు చేశారు. భాషా పండితులలో అర్హత గల వారికి తిరిగి ప్యానల్ హెడ్మాష్టరుగా ప్రమోషన్ పొందు అవకాశం కల్పించాలి.

67) వృత్తి విద్య బోధింపబడు ఉన్నత పాఠశాలలలో, రెగ్యులరు స్కేలుపై ఇన్‌స్ట్రక్టర్‌లను నియామకము చేయాలని యీ సమావేశము ప్రభుత్వాన్ని కోరుచున్నది.

68) ఉపాధ్యాయులకు రీగ్రూపింగ్ సందర్భంలో యింక్రిమెంటు తేదికి ఇంక్రిమెంటు గురించి ఉత్తర్వు పొందడం జరిగింది. ఇతరులకు యిటీవల వచ్చిన ఉత్తర్వు నొక దానిని చూపి, ఉపాధ్యాయులకు రికవరి పెట్టు చున్నారు. శ్రీకాకుళం జిల్లాలో ఆడిట్ అభ్యంతరముల కారణంగా, ఇంక్రిమెంట్లు, పెన్షన్ తదితర సౌకర్యాలు ఆగిపోయినవి. యల్.యఫ్. డైరక్టర్ గారు, వెంటనే తగు ఆదేశములు యిచ్చి ఉపాధ్యాయు లకు రీగ్రూపింగ్‌లో ఇంక్రిమెంటు తేదికి యింక్రిమెంటు యిప్పించ

కోరుచున్నాము.

69) సింగరేణి కాలరీస్‌లో పనిచేస్తున్న ఉపాధ్యా యులు, అనేక సమస్యలతో బాధపడుచున్నారు. ప్రభుత్వ ఉత్తర్వులు అమలు కాక, సింగరేణి కాలరీస్ ఉద్యోగుల సౌకర్యాలు వర్తించక వారు నష్టపోవుచున్నారు. వారి సమస్యలు పరిష్కారానికి తగు చర్యలు గైకొనాలని కోరు చున్నాము.

70) ఉన్నత పాఠశాలలలో డ్రాయింగ్ టీచర్లు 6 నుండి 10 వ తరగతి వరకు బోధించు చున్నారు. కాని వారికి సిలబసు మాత్రం 8, 9, 10 తరగతులకు యిచ్చి వున్నారు. అది కూడా ఉపాధ్యాయులకు అగమ్యగోచరముగా వున్నది. 6, 7 తరగతులకు కూడా సిలబసు యిచ్చి వారందరికి రీఓరియంటేషను కోర్సు నిర్వహించాలని కోరుచున్నాము.

71) స్కౌటు మాస్టర్లు, కబ్ మాస్టర్లకు జి.ఓ. వున్నా అలవెన్సులు చెల్లించబడుటలేదు. డ్రస్ అలవెన్సు యిచ్చుట లేదు. కబ్24 మంది వున్నా వారి సాంవత్సరిక రుసుములు మండలాలు చెల్లించుట లేదు. అందుకు తగు చర్యలు గైకొనవలసినదిగా ప్రభుత్వాన్ని కోరుచున్నాము.

72) ఉద్యోగములో వుండి చనిపోయిన ఉద్యోగులకు, ఉపాధ్యాయులకు అంత్యక్రియలకురూ.1000/- లు ఇచ్చు చున్నారు. రిటైరయి చనిపోయిన ఉద్యోగులకు అంత్య క్రియలకు రూ.500/-లు యిచ్చుచున్నారు. కాని రిటైరయి చనిపోయిన ఉపాధ్యాయులకు మాత్రం యివ్వక యిబ్బందులు పెట్టుచున్నారు. వారికి కూడా యిచ్చునట్లు స్పష్టమయిన ఉత్తర్వులు యిప్పించ కోరుచున్నాము.

73) యన్.జి.ఓ. లకు యిచ్చు బస్ పాసు సౌకర్యము ఉపాధ్యాయులకు కూడా వర్తింపజేయాలని ఈ సమావేశము కోరుచున్నది.

74) ప్రభుత్వము యిచ్చు అన్ని జి.ఓ.లు మరే విధమైన వివరణ, లేకుండానే అన్ని మానేజిమెంట్లలోని ఉపాధ్యాయులకు వర్తించునట్లు ఉత్తర్వులు యివ్వాలి.

75) జూనియర్ కాలేజిలో గల హైస్కూలు సెక్షన్లు విడగొట్టాలి. కలిసి వున్నందున సిలబసు వేరు, పీరియడ్లు వేరు; కంటిన్యూ సెక్షన్లు కారణంగా విద్యార్థులు చాల నష్టపోవు చున్నారు. వాటిని విడదీసి, హైస్కూల్సు వేరేగా నిర్వహించు టకు తగు ఉత్తర్వులు యిప్పించ గోరుచున్నాము.

76) **పాఠశాలల టైమింగ్స్** :- ఆంధ్ర, తెలంగాణా రెండు ప్రాంతములలో పూర్వం నుండి హైస్కూల్సు, యు.పి. స్కూల్సు ఉదయం గం.10-00 లకే ప్రారంభమయ్యేడివి. కాని యిటీవల వాటిని గం.9-00 లకు మార్చిన కారణంగా దూర ప్రాంతముల నుండి వచ్చు పిల్లలు చాల యిబ్బందులు పడుచున్నారు. మహిళా ఉపాధ్యాయినులు కూడా చాల యిబ్బందులు పడుచున్నారు. దానిని తిరిగి గం.10-00 లకు మార్పు చేయించ కోరుచున్నాము.

మరియు ప్రాథమిక పాఠశాలలు పూర్వము ఆంధ్రలో ఉదయం గం.8-00ల నుండి తెలంగాణాలో గం.10-00ల నుండి నడుస్తుండేవి, వాటిని కూడా గం.9-00 కి మార్చారు. తిరిగి వాటిని కూడా పూర్వపు పద్ధతికి మార్పు చేయించ కోరు చున్నాము.

77) ప్రభుత్వము జి.ఓ.యం.యస్.నెం. 559, తేదీ:10.10.88 ప్రకారం ఉద్యోగ సంఘాలను 13 గ్రూపులు చేసి, ఆంధ్రప్రదేశ్ సివిల్ జాయింట్ స్టాఫ్ కౌన్సిలులో వంతుల వారి ప్రాతినిధ్యము కల్పించి వున్నారు.

అందులో ఉపాధ్యాయులది అయిన 2వ గ్రూపులో యు.టి.యఫ్.కు స్థానము కల్పించలేదు. ఆంధ్రప్రదేశ్‌లో అన్నిటికంటె పెద్దసంఘము అయి, అకడమిక్ విషయాలలో కృషిచేస్తున్న యు.టి.యఫ్.కు ప్రభుత్వ గుర్తింపు పొంది 3 సంవత్సరాలు అవ్వాలనే నిబంధన పెట్టడం సరికాదు.

వెంటనే యు.టి.యఫ్.కు ఆంధ్రప్రదేశ్ సివిల్ జాయింట్ స్టాఫ్ కౌన్సిలులో సభ్యత్వము యిప్పించ వలసినదిగా మహాసభ ప్రభుత్వాన్ని కోరుచున్నది.

సంపాదకవర్గం













నెల్లూరుజిల్లాలో వివిధరంగాలకు చెందిన ప్రముఖులను సన్మానిస్తున్న దృశ్యం

1. శ్రీ మరుపూరు కోదండ రామిరెడ్డిగారిని శ్రీ ఎ. వెంకటస్వామి
2. శ్రీ అభినవ పన్నహార్య శ్రీ పిసుపాటి విశ్వేశ్వర శాస్త్రిగారిని శ్రీ మైనేని
3. శ్రీ 'మోనా' గారిని శ్రీ వి. బాలసుబ్రహ్మణ్యం
4. శ్రీ కె. శివారెడ్డిగారిని శ్రీ టి. కొండాచారి
5. శ్రీ శంకరయ్యగారిని శ్రీ వి. రఘుపతి
6. శ్రీ కె. రామానుజాచార్యులుగారిని శ్రీ యల్. గుణశేఖరరెడ్డి
7. శ్రీ జయంపు కృష్ణగారిని శ్రీ కె. నారాయణరెడ్డి
8. శ్రీ ఆర్. వి. సుబ్బారావుగారిని శ్రీ యం. శ్రీనివాసరావు

'ఉదయతార'—శుభాభినందనలు।

రూ. 10,000/- ల నుండి రూ. 1,00,000/- వరకు నెలవారీ చిట్ పథకాలు

మరియు

రూ. 10,000/- ల నుండి రూ. 50,000/- ల వరకు రోజువారి చిట్ పథకాలు నిర్వహిస్తూ యింతవరకు 'ఉదయతార' రూ. 3.00 కోట్లకు పైగా పంపిణీ చేసిందని మీకు తెలుసా?

గత ఏడేళ్ళుగా తన ఎనలేని సేవలతో వందలాది సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి, అచంచల విశ్వాసం "ఉదయతార" ఉన్నతాశయానికి నిదర్శనం.

ఉదయతారతో పొదుపు చేస్తే మీధనానికి అమితభద్రత, అధిక ఆదాయంతోపాటు, ఆకర్షణీయమైన డివిడెండ్లుతోడయి సత్వర పేమెంటు సమకూరుతుందని తెలిసి ఎందరో సభ్యులయ్యారు

ప్రతిభాశాలురైన పాలక వర్గంతో నిర్వహించబడుతున్న ఉత్తమ చిట్‌ఫండ్ సంస్థ ఉదయతార.

అన్ని ఆదాయ వర్గాలవారికి అనువైన మా చిట్ పథకాలలో ఒకదానిని ఎన్నుకొని సభ్యునిగా చేరండి మీకే తెలుస్తుంది.





యు·టి·యఫ్· మహాసభలకు జూన్ 22నుండి 25 వరకు ఆన్‌డ్యూటీ

**GOVERNMENT OF ANDHRA PRADESH**
EDUCATION (SER.IV) DEPARTMENT

**Memo. No.879/Ser.IV.1/89-1, Edn., Dt.16-6-1989.**

**Sub:** Conferences/Seminars - A.P. United Teachers' Federation - 5th State Conference from 22-6-1989 to 25-6-89 at Nellore - Treating the absence of delegates as on duty - Instructions - Issued.

**Ref:** From the President, A.P. United Teachers' Federation, Hyderabad, Lr. dt. 7-6-1989.

* * *

The Director of School Education, is requested to treat the absence of the delegates who will be attending the Conference being conducted by A.P.United Teachers' Federation at Nellore from 22-6-1989 to 25-6-1989 be treated as 'On duty' as a Special case.

2. The delegates are however, not eligible for T.A. & D.A.

R.V.Vaidyanatha Ayyar,
Secretary to Government.

PROCEEDINGS OF THE DIRECTOR OF SCHOOL **EDUCATION, ANDHRA PRADESH : HYDERABAD**

**Rc.No.1316/E1/1989 Dt.20-6-1989.**

**Sub:** Conferences/Saminars - A.P. United Teachers', Federation - Fifth State Conference from 22-6-1989 to 25-6-1989 at Nellore - Treating the absence of delegates as "On Duty" - Orders - Issued.

**Ref:** Government Memo.No.879/Ser-IV-1/89-1 Edn., dt. 16-6-1989.

* * *

Copy communicated to all the Undermentioned Officers for taking necessary action in the matter.

P.Sunder Rao,
for Director of School Education.

నెల్లూరు మహాసభలకు పట్టణంలో శెలవులు

**PROCEEDINGS OF THE DIRECTOR OF SCHOOL**
EDUCATION, ANDHRA PRADESH : HYDERABAD

**Rc.No.1317/E1/89 Dt.20-6-1989.**

**Sub:** Conference Services - Declaration to Holidays from 22-6-1989 to 25-6-1989 to the Schools located in Nellore Town - Regarding.

**Ref:** Reptn., dt.16-6-1989 from Secretary, A.P.U.T.F., Vijayawada.

* * *

While enclosed a copy of the reference read above. The District Educational Officer, Nellore is requested to declare local Holidays from 22-6-1989 to 25-6-1989 to all the schools located in Nellore town, subject to compensate these days during the ecademic year i.e., 1989-90.

P.Sundar Rao,
for Director of School Education.

కర్ఫ్యూ సందర్భంగా పాఠశాలలకు వెళ్ళలేక పోయినవారికి స్పెషల్ లీవు

**PROCEEDINGS OF THE DIRECTOR OF SCHOOL**
EDUCATION, A.P: HYDERABAD-4

**L.Dis.No.436/D2-4/89 Dt.18-4-1989.**

Sub: School Education - Andhra area curfuew - Absence of duty - Sanction of Special Leave - Orders - Issued.

**Read:**
1. Representation of President, APUTF, Vijayawada, 16/89, dt.6-2-89.
2. Govt.Memo.No.293/Ser.IV-1/89-1, Edn., dt.16-3-'89.
3. Govt. Memo.No.3112/Poll.A/88-3, dt.23-2-89.

* * *

As per the directions given by the Government vide reference 2nd and 3rd cited, the Director of School Education is hereby sanctioned special casual leave to the teachers who could not attend schools due to imposition of day curfew on the account of the disturbances following the murder of Sri V.M.Ranga Rao, M.L.A., at Vijayawada on 26-12-'88.

The District Educational officers of Andhra area are therefore requested to take necessary action accordingly.

D.Balakrishna Murthy,
for Director of School Education.

370 ప్రకారం రెవెన్యూ డివిజన్ దాటిన వారిని ప్రక్క మండలాలుకు తెచ్చుట గురించి

**GOVERNMENT OF ANDHRA PRADESH**
PANCHAYATI RAJ AND RURAL DEVELOPMENT DEPARTMENT

**Memo.No.28847/Estt-VIII/89-1, Dt.17-6-1989.**

**Sub:** Establishment - Panchayati Raj and Rural Development Department - Certain instructions on transfers of teachers working under Mandal Praja Parishads and Zilla Praja Parishads - Orders - Issued.

Ref: 1. G.O.Ms.No.262, Panchayti Raj and Rural Development (Mandal-I) Department, dt. 21-4-1987.

2. G.O.Ms.No.370, Panchayati Raj and Rural Development (Mandal-I) Department, dt.18-6-1987.
3. G.O.Ms.No.466, Panchayati Raj and Rural Development (Mandal-I) Department, dt. 23-7-1987.
4. G.O.Ms.No.100, Finance and Planning (Fin.Wing-W&M-I) Department, dt.5-4-1988.
5. G.O.Ms.No.139, Finance and Planning (Fin.Wing-W&M-I) Department, dt.30-5-1988.
6. G.O.Rt.No.1386, Panchayati Raj and Rural Development (Establishment-VIII) Department, dt. 28-10-1988.
7. Government Express Telegram No.30455, Establishment-VIII/89-1, dt.28-4-1989.
8. G.O.Ms.No.273, Panchayati Raj and Rural Development (Mandal-I) Department, dt.29-4-1989.

* * *

In the references 1st to 3rd cited, Government have issued certain instructions regarding transfers of teachers working in Zilla Praja Parishads/Mandal Praja Parishads Schools and orders were also issued not to post any teacher to a place which is located in his native revenue division. However, Government have modified above said orders and issued instructions through reference 8th cited, not to post any teacher to a place which is located in his/her native Mandal. Finance and Planning Department through references 4th and 5th cited have imposed certain restrictions in transfers and consequently, Panchayati Raj and Rural Development Department have issued orders imposing ban on transfers through references 6th and 7th cited.

2. As the restrictions on general transfers are still in force, keeping in view the need for effecting certain types of transfers of most invitable nature, Government have decided to issue certain instructions to Zilla Praja Parishads/ Mandal Praja Parishads permitting them to effect teachers transfers of following types while relaxing the orders issued in para I (ii) of G.O.Ms.No.139, Finance and Planning (Fin.Wing-W&M-I) Department, dt.30-5-1988.

(a) To fill up 'Subject need' vacancies which cannot be handled by existing not qualified teachers in a School.
(b) In the event of necessity for redeployment of teachers to the schools having too many vacancies for the reasons to be recorded.
(c) On grounds of disciplinary action subject to rule 8(k) of G.O.Ms.No.262, Panchayati Raj and Rural Development dated 21-4-1987.
(d) Consequent on promotion.
(e) Request transfers of those teachers who were shifted out of their native revenue divisions during 1987-88 subject to availability of clear vacancies and requests for mutual transfers involving only above mentioned category of teachers relaxing the rule 8 (f) in G.O.Ms.No.262, Panchayati Raj and Rural Development (Mandal-I) Department dated 21-4-1987. A register showing receipt of applications for transfers at request under this category shall be maintained by Zilla Praja Parishads/Mandal Praja Parishads and transfers shall be effected strictly on the basis of the date of receipt of the application from the individual.

3. Transfers of teachers other than those mentioned in para 2 above shall not be effected.

4. Transfers except those falling in categories under para 2(c) and 2(d) shall not be effected after 15-7-1989 and any proposal left over may be taken up after 1-5-1990.

The above instructions should be adhered to strictly by the District Development Officers/Mandal Development Officers while effecting the transfers of teachers in schools under management of Zilla Praja Parishads and Mandal Praja Parishads. Any violation of the above instructions will be viewed seriously.

N.Narasimha Rao,
Deputy Secretary to Government.

## ఇతర డివిజన్లలో అబ్జార్బయిన లేక నియమించబడిన వారిని కూడా ప్రక్క మండలాలకు బదిలీ చేయుట గురించి

GOVERNMENT OF ANDHRA PRADESH
PANCHAYATI RAJ AND RURAL DEVELOPMENT DEPARTMENT

Memo.No.28847/Estt.VIII/89-2 Dt.15-7-1989.

**Sub:** Establishment - Panchayati Raj and Rural Development Department - Certain instructions on transfers of teachers working under Mandal Praja Parishads and Zilla Praja Parishads - Orders - Issued.

Ref: 1. Memo.No.28847/Estt.VIII/89-1, dt. 17-6-1989 of PR&RD Dept.
2. From the Chairman, Z.P.P. Warangal, Lr.Rc.No.C1/1732/89, dt.24-6-1989.
3. From the D.D.O., Medak, Lr.No.F 1259/89, dt.23-6-89.
4. From the DDO, Nellore Lr.No.E1/1872/89, dt.23-6-1989.
5. Representations from A.P.Teacher Service Associations.

* * *

In the reference first cited, the District Development Officers were permitted to effect certain transfers of teachers before 15th July, 1989. Representations were received by the Government requesting it to permit Zilla Praja Parishads to effect some more categories of transfers of teachers, working in Zilla Praja Parishads and Mandal Praja Parishad Schools.

2. After careful examination of the matter Government have decided to issue instructions to Zilla Praja Parishads and Mandal Praja

Parishads permitting them to effect the following types of transfers in addition to the transfers of teachers already permitted vide reference first cited:

1) Request transfers of those teachers who were transferred outside their native revenue division on promotion, or after absorption as regular teachers of an administration grounds even after 1987-88 academic year without involving T.T.A.
2) Mutual transfers on request, following the norms laid down in G.O.Ms.No.252 and also mutual transfers between those teachers who were safted outside their native division as per G.O.Ms.No.70 and other teachers without involving T.T.A.
3) Request transfers facilitating posting of husband and wife teachers as far as possible at the same place OR at least in neighbouring places subject to availability of vacancies and without involving T.T.A.

3. Transfers of above mentioned categories, in addition to those already permitted vide reference first cited shall not be effected after 31st July, 1989 and any propose left over may be taken up after 1-5-1990.

4. The above instructions should be adhered to strictly by the District Development Officers/ Mandal Development Officers while effecting the transfers of teachers in Schools under management of Zilla Praja Parishads and Mandal Praja Parishads. Any violation of the above instructions will be viewed seriously.

N.Narasimha Rao,
Deputy Secretary to Government.

## స్పెషల్ పండిట్స్ పి·ఇ·టి·లను రెగ్యులరు పోస్టులలో నియమించుట గురించి

**GOVERNMENT OF ANDHRA PRADESH**

**A B S T R A C T**

**Education - Elementary - Special Language Pandits and Special Physical Education Teachers - Absorption into regular post of S.G.B.Ts - Orders - Issued.**

EDUCATION (EE.1) DEPARTMENT

**G.O.Ms.No.203** **Dt.8-6-1989.**

**Read the following:-**

1. G.O.Ms.No.378, Edn., Dt.22-3-1988.
2. G.O.Ms.No.68, Education (EE.1) Department, Dt.22-2-1989.
3. From the Director of School Education Lr.Rc.No.2929/B5-2/88, Dt.19-9-1988.

ORDER:

The Director of School Education has submitted proposals in the reference 3rd read above for the absorption of Special Language Pandits and Special Physical Education Teachers into regular time scale of S.G.B.Ts.

2. Government after careful consideration, direct that the Special Language Pandits and Special Physical Education Teachers be placed in the posts of S.G.B.Ts in the minimum of regular time scale of pay.

3. The Special Language Pandits/ Special Physical Education Teachers should then be given an orientation course before absorbing them against the existing or future vacancies of S.G.B.Ts., i.e., retirement vacancies and the posts sanctioned under Operation Black Board or any other Central Sheme. As a part of implementation of the absorption of Special Language Pandits/Special Physical Education Teachers as per Chief Minister's announcement, the Director of School Education shall submit proposals regarding conduct of orientation course to these Special Language Pandits/Special Physical Education Teachers immediately.

4. The resultant vacancies of Special Language Pandits and Special Physical Education Teachers should not be filled up as already laid down in the G.O. 2nd read above.

5. The Director of School Education is requested to take expedititious steps for implementation of these orders.

6. These orders are applicable to the Special Language Pandits/Special Physical Education Teachers working in Zilla Parishads, Municipal and government Schools.

7. The orders on modalities of absorption of these Special Language Pandits/Physical Education Teachers will be issued separately.

8. This order issues with the concurrence of Finance and Planning (EE) Department vide their U.O.No.8905/193 /1075/EE/89, dt.29-5-1989.

(By order and in the name of the Governor of A.P.)

R.V.Vaidyanatha Ayyar,
Secretary to Government.

## స్పెషల్ పండిట్స్, పి·యి·టి·ల నియామకము గురించి సవరణ ఉత్తర్వులు

**GOVERNMENT OF ANDHRA PRADESH**

**A B S T R A C T**

**Centrally Sponsored Scheme - Operation Black Board - Appointment of additional teachers in Single teacher Schools covered under Operation Black Board - Filling up of posts - Revised instructions - Issued.**

EDUCATION (PROG.I) DEPARTMENT

**G.O.Rt.No.1157, Edn.,** **Dt.3-7-1989.**

**Read the following:-**

1. G.O.Ms.No.36 Edn., dt.28-1-1989.
2. G.O.Ms.No.159, Edn., dt.3-5-1989.
3. G.O.Ms.No.160 Edn., dt.3-5-1989.
4. From the Director of School Education, Hyderabad D.O.Lr.No.4115/G2/88 dt.5-4-1989 and 9-5-1989.
5. G.O.Ms.No.203, Edn., dt.8-6-1989.

Phone : 53582

# గౌతమ్ రెసిడెన్షియల్ ఎంట్రన్స్ కాలేజి

## భారతీనగర్, విజయవాడ-8

## EAMCET - 1990

లాంగ్‌టర్మ్ ఇంటెన్సివ్ ఎంట్రన్స్ కోచింగ్‌లో ప్రవేశానికి అర్హులైన అభ్యర్థులనుండి దరఖాస్తులు కోరబడుచున్నవి. 1989 EAMCETలో మెడికల్‌లో 2,000 లోపు, ఇంజనీరింగ్‌లో 10,000 లోపు రాంక్ సాధించినవారు మాత్రమే ప్రవేశానికి అర్హులు.

ఈ కోచింగ్ సెప్టెంబరు మొదటి వారం నుండి
ఎంట్రెన్స్ పరీక్ష జరిగేవరకు ఉంటుంది.

అప్లికేషన్, ప్రాస్పెక్టస్ కొరకు రూ. 20/- M.O. డైరెక్టర్ పేర పంపండి లేదా ఆఫీసులో చెల్లించి నేరుగా పొందవచ్చును.

-: మా గత సంవత్సరం ఫలితాలు :-

మెడికల్ - 11/26 ఇంజనీరింగ్ - 58/80

# గౌతమ్ రెసిడెన్షియల్ జూనియర్ కాలేజి

కరన్సి నగర్, రామవరప్పాడు (P. O.)

విజయవాడ - 521 108

-: మా ఫలితాలు :-

| | ఇంటర్ | ఇంజనీరింగ్ | మెడికల్ |
|---|---|---|---|
| 1984-86 | 95% | 40/82 | 5/14 |
| 1985-87 | 94% | 76/135 | 4/17 |
| 1986-88 | 95% | 116/156 | 3/15 |
| 1987-89 | 96% | 81/175 | 1/5 |

*Sri G. BULLIAH* M. SC.,
డైరెక్టర్

*Dr. K. KOTESWARA RAO* M. SC., P.L.D.
ప్రిన్సిపాల్

ORDER:

In the G.Os first to third read above, the Government while sanctioning additional S.G.B.T. teacher posts to single teacher schools covered under Operation Black Board, have issued instructions to fill them by redeployment of eligible leftover lady teachers and by way of absorption of qualified special teachers, Grade-II Hindi pandits and identified surplus staff.

2. On a representation made by the teachers Organisations, the Director of School Education has now proposed for absorption of Special P.E.Ts and Special Language Pandits also in the posts sanctioned under Operation Black Board and also retirement vacancies.

3. In continuation of orders issued in the G.O. fifth read above, Government after careful consideration of the issue, and in partial modification of the earlier instructions hereby direct that the S.G.B.T. posts sanctioned in the G.Os. read above shall be filled up by following the norms given below:

1) By redeployment of eligible leftover women teachers, if any;

2) a) The Special Teachers/ Special Language Pandits/ Special P.T.Ts. should be absorbed as S.G.B.Ts. against the existing vacancies or future vacancies or new posts created from time to time in the ratio of 1:1:1 in a cycle of three vacancies management-wise;

b) the District (in the case Mandal Praja Parishad and Government Institutions) Municipality in case of Municipal schools should be taken as a Unit for the purpose of absorption based on overall management-wise seniority lists maintained in Zilla Praja Parishad/ Municipality/ District Educational Officers Unit.

c) the resultant vacancies of special language pandits and special P.E.Ts. should be left unfilled.

3. Where in any particular district sufficient number of lady teachers/special teachers/special Language Pandits/ Special P.E.Ts. are not available to fill up the posts, fresh recruitment can be resorted to after obtaining the concurrence of Government.

4. Orders regarding absorption of Grade-II Hindi Pandits will be issued separately.

(By order and in the name of the Governor of A.P.)

R.V.Vaidyanatha Ayyar,
Secretary to Government.

## గ్రేడు-II పండితులను సెకండరీ గ్రేడు పోస్టులలో నియమించుట గురించి

GOVERNMENT OF ANDHRA PRADESH

**ABSTRACT**

Education - Primary - Utilisation of Surplus Grade-II Hindi Pandit posts as E.G.B.Ts. in needy primary and U.P.Schools - Action of the Director of School Education - Satisfied.

EDUCATION (PROG-I) DEPARTMENT

**G.O.Rt.No.1158 Edn.,** **Dt.3-7-1989.**

Read the following:-

1. From the Director of School Education D.O. Letter No.4115/G2/88 dt.3-4-1989 and 9-5-1989.
2. From the Director of School Education Letter Rc.no.4115/G1/88, dt.30-5-1989.
3. G.O.Rt.No.1157 Education, dt. 3-7-1989.

* * *

ORDER:

In G.O.Ms.No.36 Education dt.28-1-1989 read with G.O.Ms.No.160 Education dt.3-5-1989 and G.O.Ms.No.159 Education dated 3-5-1989, orders have been issued, among other things, for filling up of the SGBT posts sanctioned under Operation Black Board by redeployment of leftover lady teachers, and by way of absorption of qualified Special Teachers and Grade-II Hindi Pandits etc. In the G.O. (3) read above, revised guidelines were issued for filling up of the S.G.B.T. posts sanctioned under Operation Black Board.

2. The Director of School Education has now proposed for conversion and utilisation of surplus Grade-II Hindi pandits as SGBTS and to use these posts for strengthening the existing needy primary and Upper primary schools. He has also requested for ratification of his action in having issued instructions in this regard.

3. Government after careful examination of the issue, hereby ractify the action of the Director of School Education in having issued instructions to the concerned to convert all the Grade-II Hindi pandit posts, identified as surplus, into SGBTs and to utilise such convereted SGBTs in the respective managements for strengthening the existing and needy primary and Upper Primary Schools.

4. All the District Educational Officers/District Development Officers / Municipalities are requested to take action accordingly and in case of any deviation, they should obtain prior approval of the Director of School Education.

(By order and in the name of the Governor or A.P.)

R.V.Vaidyanatha Ayyar,
Secretary to Government.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | 1UV01A 270 |
| పుస్తకం పేరు | ఇక్బాల్ ఉపన్యాసాలు |
| తారీఖు | 30/08/23 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 113 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Mounika |
| పేజీలు విడదీసినది | Mouni |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | Hema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |